శ్రీమతే రామానుజాయ నమః



అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన

# జ్ఞానసారమ్

(శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం, దానికి ఆంధ్రానువాదంతో)


ఆంధ్రానువాదం
ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి






**శ్రీరామానుజ సిద్ధాంత సభ**

**సికిందరాబాద్**

**2015**

**జ్ఞానసారమ్** - అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్
(శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం, దానికి ఆంధ్రానువాదంతో)

ఆంధ్రానువాదం - ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణము | - | నవంబర్, 2015 |
| సందర్భము | - | శ్రీమణవాళమహామునుల తిరునక్షత్రం |
| ప్రతులు | - | 500 |




| | | |
|---|---|---|
| ముఖచిత్రం | - | అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్, తిరుప్పాడగం, కాంచీపురం |


**ప్రతులకు**

**శ్రీమాన్ స్వామిదాస్**
3-3-713, రంగరేజ్ బజార్
సికింద్రాబాద్-500 003
☎ 94400 90324



డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి.
శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, భవానినగర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్
ప్రకాశంరోడ్, తిరుపతి.




# ముందుమాట

జ్ఞానసారప్రవక్తారం దివ్యజ్ఞానప్రదాయకమ్ ।
దేవరాజమునిం వందే జ్ఞానాదిగుణవారిధిమ్ ॥

భగవద్రామానుజుల ముఖ్యశిష్యులలో ఒకరైన అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన రెండు ప్రబంధాలలో జ్ఞానసారం ఒకటి. ఇది నలభై వెణ్బా అనే ద్రావిడ ఛందస్సులోని పాశురాలతో కూడిన గ్రంథం. రెండవది ప్రమేయ సారం. ఇతఃపూర్వమే ప్రమేయసారం శ్రీవరవరమునుల వ్యాఖ్యానంతో, దానికి ఆంధ్రానువాదంతోపాటు శ్రీరామానుజసిద్ధాంతసభ, సికిందరాబాద్, ద్వారా ప్రచురింపబడింది. ఇపుడు ఆ సభ ద్వారానే జ్ఞానసారం కూడా శ్రీవరవరమునుల వ్యాఖ్యానంతో, దానికి ఆంధ్రానువాదంతోపాటు ముద్రింపబడడం ప్రపన్న లోకానికి ఆనందావహం కాగలదనడంలో సందేహం లేదు. జ్ఞానసారవ్యాఖ్యానం తెలుగు లిపిలో చాలాకాలం క్రితం ముద్రింపబడినా, దానికి ఆంధ్రానువాదం ముద్రింపబడినట్లుగా తెలియలేదు. తెలుగు లిపిలో ప్రచురింపబడిన వ్యాఖ్యాన కోశాలు కూడా ప్రస్తుతం అలభ్యాలు. అందువల్ల ప్రకృత గ్రంథముద్రణ ఆవశ్యకమైనది. ఈ సత్కార్యాన్ని చేసి, వైదికమైన భగవద్రామానుజసిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి కృషిచేస్తున్న శ్రీరామానుజ సిద్ధాంత సభ, సికిందరాబాద్, తప్పక అభినందించదగినది.

**"ముముక్షువుకు జ్ఞాతవ్యాలైన రహస్యాలు మూడు. అవి తిరుమంత్రం, ద్వయం, చరమశ్లోకం"** అని అంటూ శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు ముముక్షుప్పడి రహస్య గ్రంథం ప్రారంభంలో సూత్రీకరించారు. **"సా విద్యా యా విముక్తయే"** అనే రీతిలో పరమపురుషార్థరూప మోక్షాన్ని పొందడానికి తెలియవలసిన జ్ఞానాన్ని అందించే ఈ మూడు రహస్యాల సారమే ఈ జ్ఞానసారం. ఉదాహరణగా - 13వ పాశురంలో అష్టాక్షరీ వివరణం, 1, 2, 3, 4, 25, 31 మొదలైన పాశురాలలో ద్వయమంత్ర వివరణం, 13వ పాశురంలో చరమశ్లోక వివరణం చేయబడడం గమనించవచ్చు. ఈ మూడు రహస్యాలలో ప్రతిపాదింపబడిన తత్త్వహితపురుషార్థాల జ్ఞానం చరమపర్వపర్యంతం

పర్యహసించాలనే విషయం కూడా **"ఎట్ట విరున్ద కురువై"** ఇత్యాది పాశురాలలో వివరింపబడడం గమనించవచ్చు.

ఈ ప్రబంధ ప్రభావం శ్రీపిళ్ళైలోకాచార్యులవారి శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలో స్పష్టంగా గోచరిస్తుంది. చరమపర్వనిష్ఠా ప్రకరణంలోని **449, 450, 451, 453**వ సూత్రాలు అర్థం, ఆ సూత్రాలను వ్యాఖ్యానిస్తూ శ్రీవరవరమునులు జ్ఞానసారప్రబంధ పాశురాలను ఉదాహరించిన వైనం ఈ అంశాన్ని ఋజువు చేస్తున్నాయి.

శ్రీవరవరమునులు ఈ ప్రబంధానికి అనుగ్రహించిన విపుల వ్యాఖ్యానాన్ని గమనించినపుడు ఈ ప్రబంధవైలక్షణ్యం, గౌరవం తేటతెల్ల మవుతుంది. పలువైదిక సూక్తులను, పాంచరాత్ర ప్రమాణాలను, శ్రీరామాయణ గీతాది ఉపబృంహణ సూక్తులను ప్రమాణీకరిస్తూ, వాటిలోని అవశ్య జ్ఞాతవ్యార్థాలు ఈ ప్రబంధంలోని పాశురాల రూపంలో గ్రథనం చేయబడ్డాయనే విషయాన్ని శ్రీవరవరమునులు నిరూపించిన తీరు అత్యుద్భుతం. ఈ ప్రబంధాన్ని నిత్యానుసంధేయంగా పూర్వాచార్యులు నిశ్చయించారు. పూర్వాచార్యులు రచించిన పలు రహస్య గ్రంథాలకు ఈ ప్రబంధం దోహదపడిందనడంలో ఏ సందేహం లేదు.

ఈ గ్రంథాన్ని శ్రీరామానుజ సిద్ధాంతసభ, సికింద్రాబాద్ ద్వారా ప్రకాశింపజేసిన సహృదయులు ఉ.వే. శ్రీమాన్ పరకాలన్‌స్వామి వారికి, **భాగవతశ్రేష్ఠులు శ్రీమాన్ స్వామిదాస్** గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెల్పుకుంటున్నాను. ఈ గ్రంథం ఈ ఏడు శ్రీవరవరమునుల తిరునక్షత్రోత్సవ సందర్భంలో ఆవిష్కరింపబడడం నా భాగ్యంగా భావిస్తున్నాను. **పరమపద వాసులు శ్రీమాన్ పెరుంబూదూర్ కందాళ పార్థసారథి గారి పవిత్రస్మృతిగా వారి సతీమణి శ్రీమతి సత్యవతిగారు** ఆర్థిక సహాయాన్ని అందించారు. వారికి నా కార్తజ్ఞ్యాన్ని నివేదిస్తూ, వారి సంప్రదాయ సేవను అభినందిస్తున్నాను.

ఇట్లు

భాగవత విధేయుడు

ఈ.ఏ. శింగరాచార్యులు

14-10-2015
తిరుపతి



శ్రీమతే రామానుజాయ నమః



అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన

# జ్ఞానసారమ్

**(శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం, దానికి ఆంధ్రానువాదంతో)**

అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ తనియన్‌లు

**1.** కార్తికే భరణీజాతం యతీంద్రాశ్రయ మాశ్రయే ।
జ్ఞానప్రమేయసారాభివక్తారం వరదం మునిమ్ ॥

కార్తికమాసం భరణీనక్షత్రంలో అవతరించిన వారు, శ్రీరామానుజులను ఆశ్రయించినవారు, జ్ఞానసార ప్రమేయసారాలనే ప్రబంధాలను వచించిన వారైన దేవరాజముని అనే అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌కు ఆశ్రయిస్తున్నాను.

**2.** రామానుజార్యసచ్ఛిష్యం వేదశాస్త్రార్థసంపదమ్ ।
చతుర్థాశ్రమసంపన్నం దేవరాజమునిం భజే ॥

శ్రీరామానుజుల గొప్పశిష్యులు, వేదాలలోని, శాస్త్రాలలోని అర్థాన్ని సంపదగా కలవారు, సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించినవారైన దేవరాజమునిని భజిస్తున్నాను.

**3.** కరుళార్ కరుక్కుழల్ తోకైయర్‌వేల్ విழియిల్ తువళుమ్,
మరుళామ్ వినై కెడుమ్ మార్క్కమ్ పెర్ఱ్రేన్, మఱ్ఱై నాన్గుమ్ శొన్న
పొరుళ్‌ఞాన సారత్తై ప్పున్దియిల్ తన్దవన్ పొఙ్గొళిశేర్,
అరుళాళమాముని యమ్బెుక్కుழల్‌కళ్ అడైన్ద పిన్నే

నాల్గు వేదాలలో ప్రతిపాదింపబడిన అర్థాలను కల్గిన జ్ఞానసారమనే ప్రబంధాన్ని అనుగ్రహించినవారు, గొప్ప కీర్తిని కలవారైన అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌యొక్క శ్రీచరణాలను ఆశ్రయించగల్గినందున నల్లని కేశాలను

కల్గిన అందమైన వేలాయుధం వంటి స్త్రీలు చూపులలో చిక్కుకొని బాధపడకుండా ఉండే మార్గాన్ని పొందగలిగాను. (విషయాంతర ప్రావణ్యం తొలగిపోయేటట్లుగా సన్మార్గాన్ని నేను పొందగలిగాను.)

## శ్రీమణవాళ మహామునులు అనుగ్రహించిన వ్యాఖ్యానమ్

### అవతారికై

ఎమ్బెరుమానార్ తిరువడికళిలే ఆశ్రయిత్తు, సకలవేద తాత్పర్యార్థఙ్గళెల్లామ్ అవర్ అరుళిచ్చెయ్య క్కేట్టు, తత్త్వహిత పురుషార్థ యాథాత్మ్యవిత్తమరాయ్, "తేవు మ*ఱ్ఱ*ఱియేన్" ఎన్ఱు అవర్ తిరువడికళిలే నిత్యకైంకర్యమ్ పణ్ణి సేవిత్తిరున్ద అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ తమ్ముడైయ పరమ కృపైయాలే, ఇవ్వర్థవిశేషఙ్గళెల్లామ్ అఱిన్దు ఉజ్జీవిక్కవేణుమెన్ఱు, తత్త్వహిత పురుషార్థజ్ఞానత్తినుడైయ సారాంశత్తై పెణ్ణుక్కుమ్, పేదైక్కుమ్ తెరియక్కడవదాక ద్రావిడభాషైయాలే ఇప్ప్రబంధముఖేన అరుళిచ్చెయ్‌కిఱార్. ఆకైయాలే ఇదుక్కు జ్ఞానసారమెన్ఱు తిరునామమాయి*ఱ్ఱు*.

## అనువాదం

భగవద్రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించి, వారి సన్నిధిలో సమస్త వేద తాత్పర్యాలను ఉపదేశంగా పొంది, తత్త్వ హిత పురుషార్థాల యథార్థ తత్త్వాన్ని తెలిసినవారిలో గొప్పవారై, **"తేవు మ*ఱ్ఱ*ఱియేన్"** (వేఱొక దైవాన్ని తెలియను) (కణ్ణినుణ్ - 2) అనే రీతిలో వారి శ్రీచరణాలలో నిత్యకైంకర్యాలను చేస్తూ ఉండే అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనే ఆచార్యులు తమ గొప్ప కృప కారణంగా ఈ అర్థవిశేషాలను అన్నిటిని తెలిసి అందరూ ఉజ్జీవించాలి అని తలచి, తత్త్వహిత పురుషార్థాల జ్ఞానంలోని సారాంశాన్ని ఆబాల గోపాలానికి తెలిసే రీతిలో ద్రావిడభాషలో ఈ ప్రబంధం ద్వారా అనుగ్రహించారు. అందువల్ల దీనికి జ్ఞానసారమనే పేరు వచ్చింది.



అరుళాళ ప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించిన

# జ్ఞానసారమ్

**(శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన వ్యాఖ్యానం, దానికి ఆంధ్రానువాదంతో)**

**1. ఊన వుడల్ శిఱై నీత్తు ఒణ్‌కమలై కేళ్వనడి,**
**త్తేనుకరు మాశై మికు శిన్దైయరాయ్, – త్తానే**
**పఴుత్తాల్ విఴుమ్ కని పోల్ పఱ్ఱఱ్ఱు వీఴుమ్,**
**విఴుక్కాడే తాన్ అరుళుమ్ వీడు**

ఊన = మాంస ప్రచురమైన, ఉడల్ శిఱై = దేహమనే చెఱసాలను, నీన్ద= విడచిపెట్టి, ఒణ్ కమలై క్కేళ్వన్ = అందమైన తామరపూవును నివాసస్థానంగా చేసికొన్న లక్ష్మీదేవి యొక్క వల్లభుని, అడి త్తేన్ = తేనెవలె భోగ్యాలైన శ్రీచరణాలను, నుకరుమ్ = అనుభవించాలి - అనే, ఆశై మికు = ఆశను మిక్కిలిగా కల్గిన, శిన్దైయరాయ్ = మనస్సును కల్గినవారై, పఴుత్తాల్ = పండితే, (పరిణతిని పొందితే), తానే విఴుమ్ = తనకు తానుగానే కిందకు రాలే, కని పోల్ = ఫలంవలె, ప*ఱ్ఱు* అ*ఱ్ఱు*= మిగిలిన ప్రాప్యప్రాపకాలలో సంబంధాన్ని (ఆశను) వీడి, వీఴుమ్= సర్వేశ్వరుని శ్రీచరణాలలో శరణాగతి చేసే రీతిలో, విఴుక్కాడే తాన్ = యాదృచ్ఛికంగా వాలడమనే ఆర్తప్రపత్తియే, వీడు = మోక్షాన్ని, అరుళుమ్= పొందిస్తుంది.

మాంసమయమైన శరీరమనే చెఱసాలనుండి విడుదలను పొంది, శ్రియః పతి శ్రీచరణాలను సేవించాలనే ఆశను మిక్కిలిగా కల్గిన మనస్సును కలవారమై, బాగాపండి ఇక గెలలో నిలువలేక తనకు తానే రాలే పండువలె, ఉపాయాంతరాల లోను, ఉపేయాంతరాలలోను సంగం (సంబంధం) లేనివారమై మనం ఉండడమే (ప్రణమిల్లడమే) మనకు మోక్షాన్ని కల్గిస్తుంది.

**ముదల్పాట్టు :- అవతారికై - సకలవేదాంతతాత్పర్యభూమియాయ్, తత్త్వహిత పురుషార్థయాథాత్మ్య ప్రతిపాదకమాయ్, సంసారి చేతనోజ్జీవన కామనాన సర్వేశ్వరన్ తన్నాలే ప్రకాశిక్కప్పట్టుళ్ళదాయ్, ఉపదేశపరంపరా**

ప్రాప్తమాయ్, తత్త్వవిదగ్రేసరరాన నమ్ పూర్వాచార్యర్కళుక్కు ప్పరమధన మాయ్, నిత్యానుసంధేయమాయిఱే, రహస్యత్రయ మిరుప్పదు.

వ్యాఖ్యానమ్ :- అదిల్ - ప్రథమరహస్య మాయ్, పదత్రయాత్మకమాన తిరుమంత్రత్తిల్ ప్రథమపద ప్రతిపాద్యమాన అర్థత్తుక్కు వివరణమాయిరున్దుళ్ళ మధ్యమ - చరమపదఙ్గళుక్కు "ద్వయేన మంత్రరత్నేన" ఎన్గిఱపడియే మంత్రరత్నాఖ్య మాయ్, మధ్యమరహస్యమాన ద్వయత్తిల్ పూర్వోత్తరవాక్యఙ్గళ్ వివరణమాయ్, అదిల్, పూర్వవాక్య ప్రతిపాద్యమాన సిద్ధోపాయవరణమ్ - ఉపాయాంతర పరిత్యాగపూర్వకమాయ్, స్వీకారత్తిల్ ఉపాయత్వ ప్రతిపత్తినివృత్తి పూర్వకమాక వేణ్డుకైయాలుమ్, ఉత్తరవాక్య ప్రతిపాద్యమాయ్, పరమ పురుషార్థమాన కైంకర్యమ్- ప్రాప్తిప్రతిబంధక సకలపాపనివృత్తిపూర్వకమాక సిద్ధిక్కవేణ్డు కైయాలుమ్, పూర్వోత్తరార్థఙ్గళాలే తదుభయప్రతిపాదకమాయ్, చరమరహస్య మాన చరమశ్లోకమ్ వాక్యద్వయత్తుక్కుమ్ వివరణమాయ్క్కొణ్డు తచ్ఛేషమాయిరుక్కైయాలే, రహస్యత్రయత్తిలుమ్ ద్వయమే ప్రధానమాకవిఱే నమ్మాచార్యర్కళ్ అనుసంధిత్తు ప్పోరుమదు. అన్ద ద్వయమ్తన్నిల్ పూర్వ వాక్యత్తాలే ప్రతిపాదిక్కప్పడుకిఱ ప్రపత్తిదాన్, ఆర్తప్రపత్తి -ఎన్ఱుమ్ దృప్తప్రపత్తి -ఎన్ఱుమ్, ద్వివిధమాయిఱే యిరుప్పదు. అదిల్, ఆర్తప్రపత్తి ముఖ్యమాయ్, దృప్తప్రపత్తి గౌణమాయిరుక్కుమ్. అన్ద ఆర్తప్రపత్తివేషత్తై ఇప్ప్రబంధత్తిన్ ముఱ్పాట్టాలే అరుళిచ్చెయ్కిఱార్.

(ఊన వుడఱ్చిఱై నీత్తు) - ఊనావదు మాంసమ్. ఊన్ - ఎన్ఱదు - ఊనైయుడైయ - ఎన్ఱపడి. ఇత్తాల్ - మాంసమయమాన శరీరమ్- ఎన్ఱై. ఇద్దేహత్తుక్కు దోషమ్ శొల్లువారెల్లామ్. "ఊనక్కురమ్బై" ఎన్ఱుమ్, "ఊనేరాక్కై" ఎన్ఱుమ్, "ఊనుడై క్కురమ్బై" ఎన్ఱుమ్- ఇప్పడియిఱే శొల్లువదుమ్. మాంసత్తైచ్చొన్న ఇదు-మఱ్ఱుమ్ ఇదిలుణ్డాన అస్రుక్ పూయవిణ్ మూత్రస్నాయుమజ్జాస్తికళాన అవాంతరదోషత్తుక్కు ఎల్లామ్ ఉపలక్షణమ్. ఎల్లామ్ ఉణ్డానాలుమ్, మాంస ప్రచురమాయిరుక్కైయాలే "పుణ్ణారాక్కై" ఎన్ఱిఱే ఇత్తై చ్చొల్లువదు. "పుణ్ణై మఱైయ అఱిన్దు" ఎన్గిఱ పడియే తోలై మఱైక్క క్కైప్పాణియిట్టు మెழుక్కువదియిలే భ్రమిక్కుమ్బడి పణ్ణివైక్కైయాలే



ఆంతరదోషమ్ తోఱ్ఱాదిఱే. అకవాయ్ పుఱవాయ్ ఆనాల్, కాక్కై నోక్క ప్పణిపోరు మిత్తనైయిఱే.

(ఉడఱ్చిఱై)- ఇప్పడి ఆంతరదోషయుక్తమాకైయాలుమ్, ఆత్మావుక్కు సంకోచకరమాకైయాలుమ్, ఆరబ్ధకర్మఫలమాకైయాలుమ్, అన్ద కర్మాను గుణమాక ఇన్దదేహత్తిలే యిట్టువైత్తవనే విడువిక్కిల్లదు తన్నాల్ విడువిత్తుక్కొళ్ళ క్కొణ్డామైయాలుమ్, అఱివు పిఱన్దార్క్కు ఇద్దేహత్తిల్ ఇరుప్పు కారాగృహమ్ పోలే నిరంతర దుఃఖావహమాకైయాలే, ఇద్దేహత్తై చ్చిఱై - ఎన్గిఱదు. ఇదిలే పొరున్దియిరుప్పార్ ఇద్దేహదోషమ్ కాణమాట్టాద అజ్ఞరిఱే. "మాంసాస్రుక్ పూయవిణ్మూత్ర స్నాయుమజ్జాస్తి సంహతౌ, దేహేఽస్మిన్ ప్రీతిమాన్ మూఢో భవితా నరకేఽపి సః" ఎన్ఱానిఱే శ్రీప్రహ్లాదాழ்వాన్. తన్నై చ్చిఱైయ నాకవుమ్, పెరుమ్ కడన్ పట్టానాకవుమ్, అన్ధకనాకవుమ్, విషదష్టనాకవుమ్ అనుసంధిప్పా నెన్ఱు ప్రతిజ్ఞై పణ్ణి, అదునాలైయుమ్ అడైవే వివరిక్కిఱ పిళ్ళైలోకాచార్యర్, ముదల్ వార్త్తైయై వివరిక్కిఱ అళవిలే, "దేహమ్ శిఱైకూడమాకవుమ్, దేహాను బంధికళాన భార్యాపుత్రాదికళ్ కైక్కూడమాకవుమ్, అహంకారమమకారఙ్గళ్ వళైయలా కవుమ్, నాశమాన పాశమ్ నారియాకవుమ్, అవివేకమ్ పూట్టాణి యాకవుమ్, ఇంద్రియఙ్గళ్ పిరివాళరాకవుమ్, విషయఙ్గళ్ పిరియలాకవుమ్, మనస్సు మేల్దణ్డలాకవుమ్, తాన్ శిఱైయనాకవుమ్, ఎమ్బెరుమాన్ విమోచకనాకవుమ్ అనుసంధిప్పాన్"- ఎన్ఱాఱిరే.

(నీన్దు)- ఇప్పడి ఇరున్దుళ్ళ దేహమాకిఱ శిఱై విట్టు. నీఱ్ఱల్ - విడుదల్. రాజపుత్రన్ అழுక్కుచ్చిఱైయిలే కిడన్దాల్, ముడిశూడి రాజ్యమ్ పణ్ణుమదిలుమ్ శిఱైవిడుకైయే ప్రయోజనమాయిరుక్కుమాపోలే, ప్రాప్యలాభత్తిలుమ్ ఇదినుడైయ విమోచనత్తాలే ప్రయోజనమాక ప్పోరుమ్బడియిఱే, ఇదినుడైయ హేయతైదా నిరుప్పదు.

(ఒణ్కమలై క్కేళ్వన్) "పద్మే స్థితామ్" ఎన్గిఱపడియే ఒళ్ళిదాన తామరై ప్పూవై వాసస్థానమాక ఉడైయ పెరియపిరాట్టియారుక్కు వల్లభనానవన్. ఇత్తాల్- అనుభవ కైంకర్య ప్రతిసంబంధియాయ్ క్కొణ్డు, ప్రాప్యమాన విషయమ్ ఒరు

మిథున మెన్నుమిడమ్ శొల్లుకిఱదు. ఇదు తన్నై ఉత్తరవాక్యత్తిల్ ప్రథమపదత్తిలే కణ్డుకొళ్వదు.

(అడిత్తేన్) - "అడిత్తేన్" ఎన్ఱు శ్రియఃపతియానవనుడైయ తిరువడికళిల్ భోగ్యతైయై చ్చొల్లుకిఱదు. "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" ఎన్నుమ్, "ఉన్ తేనే మలరుమ్ తిరుప్పాదమ్" ఎన్ఱుమ్ శొల్లక్కడవదిఱే. ఇదుదాన్ దివ్యమంగళ విగ్రహ భోగత్తైక్కుమ్ ఉపలక్షణమ్. తిరువడికళాకిఱదు- విగ్రహైకదేశమిఱే. "నిన్మాట్టాయ మలర్పురైయుమ్ తిరువురువుమ్" ఎన్గిఱదుక్కు "మట్టై"- "మాట్టై"న్ఱు నీట్టు క్కిడక్కిఱదాయ్, "మధ్వ ఉత్సః" ఎన్గిఱపడియే మధు స్యందియాకైయాలే, నిరతిశయభోగ్యమాన తిరుమేని-ఎన్నుదల్ - ఎన్ఱు నమ్బిళ్ళై అరుళిచ్చెయ్దారిఱే.

(తే నుకరుమ్) - నుకరుకైయావదు - భుజిక్కైయాయ్, "తే నుకరు" మెన్ఱు అన్ద భోగ్యతైయై అనుభవిక్కైయై చ్చొల్లుకిఱదు.

(ఆశై మికు శిన్దైయరాయ్)- ఎన్ఱదు - అన్ద భోగ్యతైయై అనుభవిక్కవేణు మెన్ఱు ఆశై మిక్కిరున్దుళ్ళ మనస్సై యుడైయవర్- ఎన్రై. ఇత్తాల్-ప్రాప్యరుచి యినుడైయ ప్రాచుర్యమ్ శొల్లుకిఱదు. ఇన్ద రుచియిఱే ప్రాప్యలాభనిబంధనమాన ఆర్తిక్కు క్కారణమ్.

(తానే పళుత్తాల్ విళుమ్ కనిపోల్) - పక్వమానాల్ తానే విళున్దు నిఱ్కుమ్ పళమ్పోల్. ఇదు ఆర్తప్రపత్తిక్కు దృష్టాంతమ్. ఆర్త ప్రపత్తిక్కు వేషమిరుక్కుమ్బడి ఎన్? ఎన్ఱు ఆళ్వానై కేట్క, కనిప్పళమ్ కామ్బఱ్ఱాప్పోలే యిరుక్కుమెన్ఱు అరుళిచ్చెయ్దార్- ఎన్ఱదు ప్రసిద్ధమిఱే.

(పఱ్ఱఱ్ఱు వీళుమ్ విళుక్కాడే) కీళ్ చ్చొన్న ప్రాప్యరుచియాలే ప్రాప్యాభాసజ్గళిలుమ్. ప్రాపకాభాసజ్గళిలుమ్ పఱ్ఱఱ్ఱు, ఆర్తియాల్ వన్ద పారవశ్యత్తాలే ప్రపదనరూపేణ తిరువడికళిలే విళుమ్ విళుక్కాడెన్ఱు ఆర్తప్రపత్తియై చ్చొల్లుకిఱదు. "యదా పరానన్వయిభిః దుశ్శక స్మృతిభిర్వినా, తేన తత్పురతః పాత స్సా ప్రపత్తి స్తదా భవేత్" ఎన్ఱు ఇన్ద ప్రపత్తివేషన్దాన్ సనత్కుమారసంహితైయిలే సంగ్రహేణ శొల్లప్పట్టదిఱే.



(విళుక్కాడేతాన్) ఎన్ఱదు "విళుక్కాడుదానే" ఎన్ఱపడి.

(అరుళుమ్ వీడు) -ఎన్ఱదు వీట్టైయరుళుమ్ -మోక్షత్తై త్తరుమ్- ఎన్ఱపడి. "వీడె"న్ఱు సంసారనివృత్తి పూర్వకమాన భగవత్ ప్రాప్తియై చ్చొల్లుకిఱదు. "విళుక్కాడుదానే మోక్షత్తై త్తరుకై" యావదు - ఆర్తప్రపత్తి యాకైయాలే అవిలంబేన ఫలవ్యాప్తియాకై. "ఆర్తానా మాశుఫలదా సకృదేవ కృతా హ్యసౌ" ఎన్నక్కడవదిఱే. అల్లదు స్వీకారమ్ తానే ఫలత్తై త్తరుమెన్నిల్, స్వీకార్యత్తినుడైయ నైరపేక్ష్యత్తుక్కుమ్, స్వీకర్తావినుడైయ పారతంత్ర్యత్తుక్కుమ్ విరుద్ధమామిఱే. స్వీకారమ్ తనక్కు ఒరుకాలుమ్ అధికారివిశేషణత్వమొళియ, ఫలసాధనత్వత్తిల్ అన్వయమిల్లై- ఎన్నుమిడమ్ తోఱ్ఱువిఱే "న్యాస ఇతి బ్రహ్మ హి పరః" ఎన్ఱుమ్ శ్రుతి శొల్లివైత్తదు. ఆకైయాలే, విళుక్కాడు దానే వీడరుళుమెన్ఱదు ఆర్తప్రపత్తియినుడైయ అవిలంబఫలవ్యాప్తియై చ్చొల్లిఱ్ఱామిత్తనై.

## ఆంధ్రానువాదం

మొదటిపాశురం :- అవతారిక : రహస్యత్రయం వేదాంతవాక్యాలకు అన్నిటికి తాత్పర్యరూపమైనదై, తత్త్వహిత పురుషార్థాల యథార్థజ్ఞానాన్ని వ్యక్తం చేసేదై, సంసారి చేతనులను ఉజ్జీవింపజేయడంకోసం సర్వేశ్వరునిచే వ్యక్తం చేయబడినదై, ఉపదేశపరంపరవల్ల లభించినదై, యథార్థాన్ని తెలిసినవారిలో అగ్రగణ్యులైన మన పూర్వాచార్యులకు గొప్ప సంపదయై, నిత్యం అనుభవించ దగినదై కదా, ఉన్నది.

అందులో - మొదటి రహస్యమై, మూడు పదాలను కల్గినదైన అష్టాక్షరీ మహామంత్రంలో, మొదటి పదమైన ఓంకారం ద్వారా చెప్పబడే అర్థానికి- మధ్యమ పదమైన 'నమః' అనే పదం, చివరి పదమైన "నారాయణాయ" అనే పదం- అనే ఈ రెండు వివరణమై ఉన్నవి. వీటిని (ద్వయమనే) మంత్రరత్నం- అని ప్రమాణాలలో ప్రసిద్ధిని పొందిన తిరునామాన్ని కల మధ్యమరహస్యమైన ద్వయం వివరిస్తున్నది. ఆ ద్వయంలో ఉండే రెండు వాక్యాలకు వివరణమై, అందులోని మొదటి వాక్యం ద్వారా చెప్పబడే సిద్ధోపాయమైన భగవానుని ఉపాయంగా వరిస్తున్నది- చరమశ్లోకం. ద్వయంలోని మొదటి వాక్యం -

అన్యోపాయాలను విడచిపెట్టడంతోపాటు, ఉండేది. దానిలో చెప్పబడిన తాను చేసే స్వీకారమనే స్వగత స్వీకారంలో ఉపాయభావనను విడచిపెట్టవలసి ఉన్నది కూడా. **"శ్రీమతే నారాయణాయ నమః"** అనే రెండవ వాక్యంలో చెప్పబడే, గొప్పదైన పురుషార్థమైన కైంకర్యం - భగవానుని పొందడానికి అవరోధంగా ఉండే అన్ని పాపాలు తొలగి పోవడమనే దానిని పురస్కరించుకొని ఉన్నది. (ద్వయంలోని) ఈరెండు వాక్యాల అర్థాన్ని మూడవ రహస్యమైన చరమశ్లోకార్థం పూర్వార్ధ - ఉత్తరార్ధాల ద్వారా తెల్పుతున్నది. అందువల్ల రెండవ రహస్యమైన ద్వయానికి మూడవ రహస్యమైన చరమశ్లోకం వివరణరూపమై ఉన్నది. ఈ కారణంవల్ల మధ్యమరహస్యమైన ద్వయమంత్రమే మన పూర్వాచార్యులచే ముఖ్యమైనదిగా అనుసంధింపబడుతున్నది. ఆ ద్వయంలో **"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే"** అనే మొదటి వాక్యంలో- భగవానుని జీవుడు ఉపాయంగా స్వీకరించడమనే ప్రపత్తి తెలుపబడుతున్నది. అది, ఆర్తప్రపత్తి - అని, దృప్తప్రపత్తి -అని రెండు రీతులలో ఉన్నది. అందులో, ఆర్త ప్రపత్తి ముఖ్యమైనది. దృప్త ప్రపత్తి అముఖ్యమైనది. ఈ ఆర్తప్రపత్తిలక్షణాన్ని ఈ జ్ఞానసారమనే ప్రబంధంలోని మొదటి పాశురంలో అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ తెల్పుతున్నారు.

వ్యాఖ్య : **(ఊన ఉడల్చిఱై నీత్తు) -"ఊన్"** అనే పదం ద్వారా మాంసమనే అర్థం తెలుపబడుతున్నది. **"ఊన"** అనే పదం మాంసాన్ని కల్గినది- అనే అర్థాన్ని ఇస్తున్నది. అందువల్ల **"ఊన"** అనే పదం మాంసప్రచురమైన శరీరాన్ని లక్షిస్తున్నది. ఈ దేహంలోని దోషాన్ని పలికే ఆళ్వార్లు అందఱు **"ఊనక్కురమ్బై"** (ముదల్ తిరు-91) (మాంసతో నిండిన శరీరం కల్గిన) అని, **"ఊనేయాక్కై"** (పెరియతిరు-6-2-3) అని, **"ఊనుడై క్కురమ్బై"** (పెరియ తిరు-1-6-9) (మాంసతో నిండిన శరీరం) అని అన్నారు. ఈ సూక్తులలో **"ఊన్"** అని అంటూ మాంసాన్నే నిర్దేశిస్తూ పలికారు కదా! ఇక్కడ మాంసాన్ని నిర్దేశించడం - ఈ దేహంలో ఉండే రక్తం, చీము, మలం, మూత్రం, నరాలు, ఎముకలు, మొదలైనవానిని కూడా లక్షిస్తుంది. ఈ విధంగా అన్నీ ఈ దేహంలోనే ఉన్నా, మాంసమే ఎక్కువగా ఉన్నందున **"పుణ్ణారాక్కై"** (పెరియ తిరు-1-9-6) (పుండ్లతో నిండిన శరీరం) అనికదా ఈ దేహం నిర్దేశింపబడుతున్నది. **"పుణ్ణై మఱైయ వరిన్దు"** (తిరువాయ్-5-1-5) అనే రీతిలో మఱుగు పరచడంకోసం పుండును **"కైప్పోణి"** (మై పూతను) పూసి, (చర్మమనే మైపూతతో పూసి) దానిని అందంగా ఉండేటట్లుగా చేసినందువల్ల శరీరం లోపల ఉండే దోషం బయటకు తెలియదు కదా! ఒక మానవునకు లోపల శరీరం ఉండే రక్తం, చీము మొదలైనవి బయట పడితే, వాటిని పొడిచి తినడం కోసం వచ్చే కాకులను తరిమి, వాటినుండి తనను కాపాడుకోవడానికే అతనికి సమయం సరిపోతుంది కదా!



**(ఉడల్చిఱై)**- ఈ విధంగా శరీరం లోపల ఉండేది అంతా దోషాన్ని కల్గినది అయినందున, ఆత్మయొక్క జ్ఞానాన్ని సంకోచింపజేసేది అయినందున, ఆ శరీరంలో అనుభవించవలసిన ప్రారబ్ధకర్మల ఫలమైనందున, ఈ కర్మలను అనుసరించి ఈ దేహంలో ఆత్మను నిలిపి ఉంచిన భగవానుడే స్వయంగా విడుదల కల్గిస్తే తప్ప, తన ప్రయత్నంవల్ల విడుదలను పొందడం (జీవునకు) సాధ్యం కాదు కనుక, జ్ఞానం కలవారికి ఈ పాంచభౌతిక దేహంలో నిలచి ఉండడం చెఱలో ఉండడంవలె నిరంతర దుఃఖాన్ని కల్గిస్తున్నందున ఈ దేహాన్ని **"శిఱై"** (చెఱసాల) - అని అన్నారు. ఈదేహమనే చెఱలో ఉండడానికే ఇష్టపడేవారు- ఈ దేహంలోని దోషాలను గమనించలేని అజ్ఞానులు కదా! **"మాంసాసృక్ పూయవిణ్మూత్ర స్నాయుమజ్జాస్థి సంహతౌ, దేహేఽస్మిన్ ప్రీతిమాన్ మూఢో భవితా నరకేఽపి సః"** (విష్ణు పురాణమ్-1-17-63) (మాంసం, రక్తం, మలం, మూత్రం, నరాలు, కొవ్వు, ఎముకలు - అనే వీని సమూహం అయిన ఈ శరీరంలో ఆనందాన్ని పొందే మూఢుడు నరకంలో కూడా ఆనందాన్ని పొందుతాడు) అని శ్రీ ప్రహ్లాదాళ్వాన్ శ్రీవిష్ణుపురాణంలో పలికాడు కదా. తనను చెఱలో ఉన్నవానినిగా, మహాసముద్రంలో చిక్కుకొన్నవానినిగా, గుడ్డివానినిగా, విషసర్పంచే కఱువబడిన వానినిగా బద్ధజీవుడు భావించాలని ప్రతిజ్ఞను చేసి, దానిని వివరించిన శ్రీపిళ్ళైలోకాచార్యులవారు **"శిఱైయన్"** అనే మొదటి పదాన్ని వివరించేటపుడు దేహాన్ని చెఱసాలగా, దేహానికి సంబంధించిన భార్యాపుత్రాదులను చెఱసాలలో ఉండే కావలివారుగా, అహంకార మమకారాలను చేతి సంకెళ్ళుగాను, మంచి చెడ్డలను వివేకించి తెలిసికోలేనితనాన్ని సంకెళ్ళను బిగించే

మేకుగా, భార్యాది బంధువుల పట్ల ఉండే పాశాలను బంధించే దారాలుగా, ఇంద్రియాలను చెఱసాలలోని కావలివారు గాను, విషయాలను విశ్లేషింపజేసేవి గాను, మనస్సును కావలివారు పెట్టే దండనగాను, తనను చెఱలో ఉన్నవానిని గాను, భగవానుని - చెఱసాల నుండి తనను విడిపించేవానిని గాను అనుసంధించాలి - అని అన్నారుకదా!

**(నీన్ద)**-ఈవిధంగా ఉండే దేహమనే చెఱను విడచి- అని అర్థం. **"నీత్తల్"**- విడుదల. రాజకుమారుడు మురికిపట్టిన చెఱలో కొంతకాలం ఉంటే, అతడు దానినుండి బయటకు వచ్చి రాజ్యపాలనను చేయడంకంటే, చెఱలో నుండి అతడు బయటకు రావడమే గొప్ప ప్రయోజనంగా ఉండేటట్లే, ప్రియమైన భగవానుని పొందడంకంటే, దేహమనే ఈ చెరసాలలో నుండి జీవుడు బయటపడడమే గొప్ప ప్రయోజనంగా చెప్పే రీతిలో ఈ దేహంలోని నైచ్యం ఉన్నది కదా!

**(ఒణ్ కమలైక్కేళ్వన్)- "పద్మే స్థితామ్" (శ్రీసూక్తమ్-4)** (తామరపూవులో నివసించే శ్రీదేవి) అనే రీతిలో గొప్ప కాంతిని కల తామరపూవును నివాసస్థానంగా పొందిన లక్ష్మీదేవికి వల్లభుడై ఉండేవాడు - అని అర్థం. ఈ పదం ద్వారా పరమపదాన్ని చేరి అనుభవించి, కైంకర్యం చేయడం మొదలైనవి ఒక మిథునాన్ని (లక్ష్మీనారాయణులనే మిథునాన్ని) ఉద్దేశించే- అని, పొందదగిన విషయం. లక్ష్మీసహితుడైన నారాయణుడే- అని తెలుపబడుతున్నది. ఈ విషయాన్ని ద్వయంలోని రెండవ వాక్యంలో గల **"శ్రీమతే"** అనే మొదటి పదంలోని అర్థంగా గ్రహించవచ్చు.

**(అడిత్తేన్)- "అడిత్తేన్"** అని లక్ష్మీనాథుని శ్రీచరణాలలోని మాధుర్యం తెలుపబడుతున్నది. **"తదస్యప్రియ మభిపాథో అశ్యామ్ నరో యత్ర దేవయవో మదంతి, ఉరుక్రమస్య స హి బంధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (విష్ణుసూక్తమ్-5)** (ముందు మంత్రంలో చెప్పిన క్రమంలో - విష్ణువుయొక్క గొప్పదైన పాదంలో మధుప్రవాహం ఉన్నది. ఆ మధుప్రవాహంలో దేవతలు కాగోరిన మానవులు ఆనందిస్తున్నారు. ఈ త్రివిక్రముని భోగ్యమైన ఆ శ్రీచరణాలలోని మధుప్రవాహాన్ని పానం చేస్తాను. ఆ పురుషోత్తముడే కదా



మనకు సర్వవిధబంధువు) అని, **"తేనే మలరుమ్ తిరుప్పాదమ్"** (మధువును స్రవించే శ్రీపాదం) **(తిరువాయ్‌మొఴి-1-5-5)** అని చెప్పబడుతున్నది కదా! ప్రకృతంలో, శ్రీచరణాల భోగ్యతను గూర్చి పల్కడం తిరుమేనియొక్క భోగ్యతను కూడా సూచిస్తుంది. శ్రీచరణాలు తిరుమేనిలోని ఒక భాగమేకదా! **"నిన్ మాట్టాయ మలర్ పురైయుమ్ తిరువురువమ్" (తిరువాయ్-3-1-4)** అనే తిరువాయ్‌మొఴి ప్రయోగాన్ని వ్యాఖ్యానించేటపుడు, నమ్బిళ్ళై ఈడులో- **"మట్టే" మాట్టు - ఎన్ఱు నీట్టిక్కిడక్కిఱదాయ్ "మధ్వ ఉత్సః" ఎన్గిఱపడియే మధుస్యందియాకైయాలే నిరతిశయభోగ్యమానతిరుమేని ఎన్నుదల్"** (**"మట్టే"** అనే పదం **"మాట్టు"** అనే రూపాన్ని పొందింది. భగవానుని శ్రీచరణాలు **"మధ్వ ఉత్సః"** అనేటట్లు మధువును స్రవించేవి కనుక, **'మాట్టు'** అనే పదానికి నిరతిశయభోగ్యతను కల నీ తిరుమేని - అని అర్థం.) అని అన్నారు కదా!

**(తే నుకరుమ్)- 'నుకరుకై"** అంటే - అనుభవించడం - అని అర్థం. అందువల్ల **"తేనుకరుమ్"** అనే ప్రయోగం ఆ తిరుమేని భోగ్యతను అనుభవించడాన్ని తెల్పుతుంది.

**(ఆశై మికు శిన్దైయరాయ్)-** ఆ తిరుమేనిని అనుభవించాలనే ఆశ మెండుగా కల్గిన మనస్సును కలవారు- అని అర్థం. ఈ పదసందర్భం ద్వారా ప్రాప్యమైన కైంకర్యంలో ఆశ మెండుగా కల్గి ఉండాలి- అని చెప్పబడుతున్నది. ఈ అభినివేశమేకదా, ప్రాప్యమనే కైంకర్యాన్ని పొందడానికి కారణమైన ఆర్తిని తెల్పుతుంది.

**(తానే పఴుత్తాల్ విఴుమ్ కనిపోల్)-** కాయ పక్వదశను పొందితే **(పండితే)-** తానుగానే స్వయంగా క్రిందికి రాలే పండువలె- అని అర్థం. ఇది ఆర్తప్రపత్తికి ఉపలక్షణం. "ఆర్తప్రపత్తికి లక్షణం ఏది?'' అని కూరేశులు ప్రశ్నించగా, "పండు దాని తొడిమనుండి రాలిపడడంవలె ఆర్తప్రపత్తి ఉంటుంది'' అని అన్నారు- అనే విషయం ప్రసిద్ధం కదా!

**(పఱ్ఱఱ్ఱు వీఴుమ్ విఴుక్కాడే)** - పూర్వం తెల్పిన ప్రాప్యంలోని అభినివేశంవల్ల, ప్రాప్యం కాని శబ్దాదివిషయాలు మొదలైనవాటిలో, ప్రాపకం

కాని కర్మయోగం మొదలైనవానిలో సంగాన్ని వీడి- ఆర్తితో (గొప్ప అభినివేశంతో) కల్గిన పారవశ్యంతో శ్రీచరణాలలో శరణాగతిని చేసి పడడమే- అని ఆర్తప్రపత్తి తెలుపబడుతున్నది. **"యథా పరానన్వయిభి ర్ధశ్శక స్మృతిభిర్వినా, తేన తత్పురతః పాతః సా ప్రపత్తి స్తథాఽ భవేత్"** (సనత్కుమార సంహిత) (ఎపుడు పరమాత్మతో సంబంధంలేని, అసహ్యాలైన అనన్య ప్రాపకప్రాప్యాల స్మృతియే లేకుండా, మిక్కిలి ఆర్తితో ఆ పరమాత్మసమక్షంలో పడతాడో, అపుడది ఆర్తప్రపత్తి అని చెప్పబడుతున్నది) అని ఆ ప్రపత్తి యొక్క లక్షణం సనత్కుమార సంహితలో చెప్పబడింది కదా!

**(విழுక్కాడేతాన్)** - అనే ప్రయోగాన్ని **"విழுక్కాడు తానే"** అని గ్రహించాలి. **"అరుళుమ్ వీడు"** అంటే- **"వీట్టై అరుళుమ్"** (పరమపదాన్ని అనుగ్రహిస్తుంది) అని అర్థం. **"వీడు"** అనేది సంసార బంధాన్ని తొలగించుకొని భగవానుని పొందడాన్ని తెల్పుతుంది. **"విழுక్కాడుతానే మోక్షత్తై త్తరుమ్"** అంటే - ఆర్తప్రపత్తి కనుక ఆలస్యం లేకుండా మోక్షం లభిస్తుంది- అని భావం. **"ఆర్తానా మాశుఫలదా సకృదేవకృతా హ్యసౌ, దృప్తానా మపి జంతూనాం దేహాంతరనివారిణీ"** (పాంచరాత్రమ్)- (ఒకసారి చేయబడిన ఈ ప్రపత్తి ఆర్తితో చేసేవారికి వెంటనే ఫలాన్ని ఇస్తుంది. దృప్తప్రపన్నులకు కూడా ఆ దేహం అవసానంలో వేఱొక దేహం కలుగని రీతిలో నివారిస్తుంది) అని చెప్పబడింది కదా! ఈవిధంగా గ్రహించకుండా, జీవుడు భగవంతుని ఆశ్రయించడమనే స్వీకారం మోక్షాన్ని కల్గిస్తుంది- అని అంటే, ఆశ్రయింపబడే భగవంతుడు ఫలాన్ని ఇచ్చేటపుడు దేనినీ ఎదురు చూడడు- అనే శాస్త్రార్థానికి, ఆశ్రయించే జీవుడు భగవానునకు శేషభూతుడు- అనే దానికి విరుద్ధమవుతుంది. ఆశ్రయించే ఆశ్రయణం జీవుడనే అధికారికి విశేషణమవుతుంది తప్ప ఫలానికి సాధనమై ఉండే స్థితి ఎప్పటికీ లేదు- అనే విషయాన్ని తెలుపడంకోసమే **"న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మ హి పరః"** (తైత్తిరీయ-నారా-49) (న్యాసం ఉపాయమని అనడం పరమాత్మ ఉపాయమని తెలుపడమే కాగలదు. పరమాత్మయే కదా గొప్ప ఉపాయం.) అని, **"న్యాస ఇత్యాహుర్మనీషిణో బ్రహ్మాణమ్"** (తైత్తిరీయ- నారా- 50) (జ్ఞానులు పరమాత్మయే న్యాసమని పల్కుతున్నారు) అనే వేదవాక్యాలు



ఘోషిస్తున్నాయి. అందువల్ల జీవుని ఆర్త ప్రపత్తి (ఆర్తశరణాగతి)యే మోక్షాన్ని ఇస్తుంది- అనేది ఆర్త ప్రపత్తి ఆలస్యం లేకుండా మోక్షాన్ని పొందిస్తుంది- అని చెప్పినట్లవుతుందని గ్రహించాలి.

**2. నరకుమ్ శువర్క్కమ్ నాణ్మలరాళ్కోనై,**
**పిరియుమ్ పిరియామైయుమాయ్, – తురిశఱ్ఱు**
**చ్చాతగమ్పోల్ నాదన్తనదరుళే పార్త్తిరుత్తల్,**
**కోదిలడియార్ కుణమ్**

నాణ్ మలరాళ్ కేళ్వన్ = తామరపూవును నివాసంగా కల లక్ష్మీదేవియొక్క నాథుని, పిరివు = విశ్లేషించడం, నరకుమ్ = నరకంవలె దుఃఖప్రదమై, పిరియామై= ఆ స్వామిని విశ్లేషించకుండా ఉండడం, శువర్క్కము మాయ్ = స్వర్గంవలె ఆనంద దాయకమై, తురిశు అఱ్ఱు = దోష రహితమై, శాతకమ్ పోల్ = చాతకపక్షి మేఘం వర్షబంధువులను విడవకపోతే ప్రాణాన్ని విడిచేటట్లుగా, నాదన్ తనదు= భగవానుని, అరుళ్ = కరుణను, పార్త్తిరుత్తల్ = ఎదురు చూస్తూ ఉండడం, కోదు ఇల్ అడియార్= దోషం లేని శేషభూతుల (దాసుల), కుణమ్ = స్వభావం.

శ్రియఃపతిని విశ్లేషించడం నరకంగా, ఆ స్వామిని సంశ్లేషించి ఉండడం స్వర్గంగా కల్గి, ఇటువంటి ప్రేమను ఉపాయంగా గ్రహించడమనే దోషం లేకుండా దానిని స్వయం ప్రయోజనంగా కల్గి ఉండి, చాతకపక్షి మేఘాన్ని ఎదురుచూచేటట్లే, భగవానుని కరుణను మాత్రమే నిరీక్షించడం – ఏ దోషం లేని శేషభూతుల స్వభావం.

ఇరణ్డామ్ పాట్టు :- అవతారికై - "ఆశైమికు శిన్దైయరాయ్" ఎన్ఱ విడత్తిల్ శొన్న ప్రాప్యరుచిదాన్ పరభక్త్యాదిరూపమాయితే యిరుప్పదు. అన్ద పరభక్తి పిఱన్దవర్కళ్ ఇరుక్కుమ్బడియై అరుళిచ్చెయ్కిఱార్- ఇప్పాట్టిల్.

వ్యాఖ్యానమ్ :- (నరకుమ్ శువర్క్కముమ్) స్వర్గనరకశబ్దఙ్గళ్ నామ్ పుణ్యాపాప ఫలానుభవభూమికళుక్కు వాచకఙ్గళాక ప్రసిద్ధఙ్గళాయిరుక్కచ్చెయ్దే, సుఖదుఃఖఙ్గళుక్కు వాచకమాయిరుక్కుమితే. ఆకైయితే "తున్బ మిన్బముమ్" ఎన్గిఱ పాట్టుకళుక్కు వ్యాఖ్యానమ్ శెయ్కిఱ పూర్వాచార్యర్కళ్ "ఇన్బమిల్ వెన్నరకాకి యినియ నల్వాన్ శువర్క్కఙ్గళుమాయ్" ఎన్ఱ విడత్తుక్కు

"ఉలకఙ్గళుమాయ్" ఎన్గిఱ ఇడమ్ ఆర్జనభూమియై చ్చొల్లి*ற்ற*ాకిల్ ఇవై భోగభూమికళ్ ఆకిన్దన. అన్ఱిక్కే, అఙ్గు భోగభూమియై చ్చొల్లి*ற்ற*ాకిల్, ఇఙ్గు సుఖదుఃఖఙ్గళే యాకిఱదు- ఎన్ఱు అరుళిచ్చెయ్‌దదు.

(నాణ్‌మలరాళ్ కోనైప్పిరివుమ్ పిరియామైయుమాయ్) - నాణ్ మలరాళ్ కోనైప్పిరివు నరకుమ్, పిరియామై స్వర్గముమాయ్- ఎన్ఱు అన్వయమ్. అదావదు- శెవ్వితామరైప్పూవై వాసస్థానమాక ఉడైయ పెరియపిరాట్టియారుక్కు వల్లభనానవనై విశ్లేషిత్తిరుక్కై - దుఃఖముమ్, సంశ్లేషిత్తిరుక్కై- స్వర్గమ్- ఎన్ఱై. పరభక్తియావదు- తత్సంశ్లేషవిశ్లేషైక సుఖదుఃఖత్వమితే. పెరుమాళ్ కాట్టుక్కు ఎ*ழு*న్దరుళుకిఱపోదు, పిరాట్టి "నానుమ్ కూడప్పోవేన్" ఎన్న, పురవాసత్తుక్కుమ్, వనవాసత్తుక్కుముణ్డాన విశేషత్తై దర్శిప్పిత్తు, "ఆనపిన్బు, కాట్టిలే పోమదు దుఃఖమ్, పడైవీట్టిల్ ఇరుక్కుమదు సుఖ"మెన్ఱు పెరుమాళ్ అరుళిచ్చెయ్య, పిరాట్టి "అఙ్గనల్ల. సుఖదుఃఖఙ్గళ్ వ్యక్తితోఱుమ్ వ్యవస్థితమాయ్ క్కాణుమిరుప్పదు. "య స్త్వయా సహ స స్వర్గో నిరయో య స్త్వయా వినా" ఎన్ఱు - యాదొన్ఱు ఉమ్మోడు పొరున్దుమదు సుఖమాకిఱదు; ఉమ్మై ఒ*ழி*య ప్పడైవీట్టిలే ఇరుక్కు మిరుప్ప దుఃఖమాకిఱదు.

(ఇతి జానన్) - తన్దాముక్కు ఇల్లాదవై పిఱర్ పక్కలిలే క*ற்ற*ఱియ వేణుమ్ కాణుమ్. (పరాం ప్రీతిమ్) - ఉమ్మైప్పోలే నిఱుత్తల్ల కాణుమ్ ఎన్నుడైయ ప్రీతి యిరుప్పదు ఎన్న, "గచ్ఛ రామ! మయా సహ", "అగ్రత స్తే గమిష్యామి" ఎన్ఱు నామ్ పుఱప్పట్టపడియే, ఎన్నై మున్నే పోకవిట్టు, పిన్నే వరప్పారుమ్ - ఎన్ఱాళితే. ఏకాయనై యాకైయాలే "త్వయా సహ" త్వయా వినా" ఎన్ఱాళితే. అల్లాదార్ ఎల్లారుమ్ మిథునాయనరాకైయాలే, నాణ్‌మలరాళ్ కోనైప్పిరివుమ్, పిరియామైయుమామ్ - ఎన్ఱరుళిచ్చెయ్‌కిఱార్, ఇవర్. "న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ!" ఎన్ఱు పిరాట్టియోడు సమభాక్కాక ఇళైయ పెరుమాళ్ తమ్మై అరుళిచ్చెయ్‌దదు- విశ్లేషాసహత్తై ఇరణ్డు తలైక్కుమ్ ఒక్కుమ్ - ఎన్ఱు తో*ற்ற*ుకైక్కాక. అల్లదు, అవళైప్పోలే ఏకాయనరాయ్ చ్చొన్నవరన్ఱే. "భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే" ఎన్నిరుక్కుమవరితే.



(తురిశ*ற்ற*ు) - అన్యపరత్తై యాకిఱ దోషమ*ற்ற*ు. అదావదు- ఇప్పడి యిరున్దుళ్ళ ప్రేమముణ్డానాల్, అత్తై ప్రాప్తిసాధనమాక క్కొళ్ళుమ్ ఉపాసకరై ప్పోలన్ఱిక్కే, భోజనత్తుక్కు క్షుత్తుప్పోలే, అత్తై ప్రాప్తిరుచియాక్కి, ఇదిన్ పక్కల్ ఉపాయత్వ ప్రతిపత్తి పణ్ణుకైయాకిఱ దోషమ*ற்ற*ిరుక్కై.

(చాతకమ్‌పోల్ నాదన్ఱనతరుళే పార్‌త్తిరుత్తల్) - అదావదు- వర్షధారై యల్లదు ధరియాత చాతకమ్ తృష్ణార్తమాయ్, నాక్కొట్టుమళవిలుమ్, భూగతమాన జలత్తై ప్పురిన్దు పారాతే, వర్షత్తైయే పార్‌త్తిరుక్కుమాపోలే, ప్రాప్తావుమ్, ప్రాపకనుమ్, ప్రాప్తిక్కు ఉకప్పానుమ్ అవనేయామ్బడి, ఇవ్వాత్మావుక్కు వకుత్త స్వామియాయిరుక్కుమ్ అవనుడైయ పరమకృపైయే ప్రాప్తిసాధనమెన్ఱు నిష్కర్షిత్తు, "తుణియేనిని నిన్నరుళల్లదు", "నిన్నరుళే పురిన్దిరున్దేన్' ఎన్ఱు అవనుడైయ అరుళైయే పార్‌త్తిరుక్కై- ఎన్నపడి. "ప్రపన్న శ్చాతకో యద్వత్ ప్రపత్తవ్యః కపోతవత్, రక్ష్యరక్షకయో రేతల్లక్ష్య లక్షణమేతయోః" ఎన్నక్కడవదితే.

(కోదిలడియార్‌కుణమ్)- అదావదు- అడియారెన్ఱు పేరిట్టు, ప్రాప్యాంతర ఙ్గళిలే యాదల్, ప్రాపకాంతరఙ్గళిలే యాదల్ సంగమ్ పణ్ణియిరుక్కుమ్ కు*ற்ற*మిన్ఱిక్కే, సంశ్లేషత్వానురూపమాక సాధ్యసాధనఙ్గళ్ ఇరణ్డుమ్ అవనే ఎన్నిరుక్కుమవర్‌కళుడైయ స్వభావ మెన్నపడి. ఆకైయాల్, ఇప్పాట్టిల్, పూర్వార్ధత్తాలే సాధ్యమవనెన్ఱు మిడముమ్ తో*ற்ற* చ్చొల్లి, ఇప్పడి యిరుక్కై కోదిలడియార్ కుణమ్ - ఎన్ఱు అరుళిచ్చెయ్‌దారాయ్*ற்ற*ు.

అవ : మొదటి పాశురంలో "ఆశై మికు శిన్దైయరాయ్" అని చెప్పబడిన ప్రాప్యంలోని అభినివేశం అనేది పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులనే మూడు విధాలుగా ఉంటుంది. ఆ పరభక్తి కల్గినవారు ఏవిధంగా ఉంటారు? అనే విషయాన్ని ఈ పాశురంలో తెల్పుతున్నారు.

వ్యాఖ్య : (నరకమ్ శువర్‌క్కమాకుమ్) - స్వర్గం, నరకం- అనే పదాలు వరుసగా- పుణ్యాన్ని, పాపాన్ని అనుభవించే చోట్లను తెల్పుతున్నవనే ప్రసిద్ధి ఉన్నా, ఆ పదాలే సుఖదుఃఖాలను తెల్పుతున్నవనికూడా గ్రహించడం ఉన్నదికదా! అందువల్లనే కదా "తున్బముమ్ ఇన్బము మాకియ శెయ్‌వినైయాయ్ ఉలకఙ్గళుమాయ్, ఇన్బమిల్ వెన్నరకాకి ఇనియ నల్ వాన్ శువర్‌క్కఙ్గళుమాయ్"

(తిరువాయ్-3-10-7) అనే పాశురానికి వ్యాఖ్యానం చేసే పూర్వాచార్యులు **"ఇన్బమిల్ వెన్నరకాకి ఇనియ నల్ వాన్ శువర్క్కజ్గళుమాయ్"** అనేచోట వ్యాఖ్యానాన్ని చేసేటపుడు **"ఉలకజ్గళుమాయ్-ఎన్గిఱ ఇడమ్ పుణ్యాపాపజ్గళై చ్చెయ్యుమ్ ఇడత్తై చ్చొల్లిఱ్ఱాకిల్, స్వర్గనరజ్గళ్ అన్ద పుణ్ణియ పాపజ్గళిన్ ఫలనై అనుభవిక్కుమ్ ఇడత్తై చ్చొల్లిఱ్ఱు. అప్పడి యల్లామల్, "ఉకలజ్గళు మాయ్" ఎన్బదు అనుభవిక్కుమ్ స్వర్గనరకజ్గళై చ్చొల్లిఱ్ఱాకిల్, "ఇన్బమిల్ వెన్నరకాకి ఇనియ నల్వాన్ శువర్క్కజ్గళుమాయ్" ఎన్గిఱ తొడర్ ఇన్బ తున్బజ్గళైయే శొల్లుకిఱదు"** (**"ఉలజ్గళుమాయ్"** - అనే పదం పుణ్యాపాపాలను చేసే చోట్లను తెల్పుతున్నది అయితే, స్వర్గనరకాలు ఆ పుణ్యాపాపాల ఫలాన్ని అనుభవించే చోట్లను తెల్పుతాయి. ఆ రీతిలో కాకుండా, **"ఉలకజ్గళుమాయ్"** అనే పదం అనుభవించే స్వర్గనరకాలను తెల్పితే, **"ఇన్బమిల్ వెన్నరకాకి ఇనియ నల్వాన్ శువర్క్కజ్గళుమాయ్"** అనే పదసందర్భం సుఖదుఃఖాలనే తెల్పుతుంది.) అని పలికారు.

**(నాణ్ మలరాళ్కోనై ప్పిరివుమ్ పిరియామైయుమాయ్)-** పద్మనివాసిని అయిన లక్ష్మీదేవీవల్లభుని విశ్లేషించడం నరకమై; విశ్లేషించకుండా ఉండడం స్వర్గమై- అని అన్వయించి అర్థం గ్రహించాలి. అంటే - అపుడే విరిసిన తామరపూవును నివాసంగా చేసికొన్న లక్ష్మీదేవికి వల్లభుడై ఉండేవానిని విశ్లేషించడమే దుఃఖం, అతనితో చేరి ఉండడమే సుఖం అవుతుంది- అని అర్థం. **"పరభక్తి"** అంటే- భగవానునితో కూడి ఉండడమే సుఖంగాను, విశ్లేషించి ఉండడమే దుఃఖంగాను కల్గి ఉండడమే కదా! శ్రీరాముడు అరణ్యానికి వెళ్ళేటపుడు సీతాదేవి "నేను కూడా నీతో వస్తాను'' అని అన్నది. అయోధ్యా నగరంలో నివసించడానికి, అరణ్యంలో నివసించడానికి మధ్య ఉండే వ్యత్యాసాన్ని గూర్చి వివరించి, ఆ కారణంవల్ల "అరణ్యానికి పోవడం దుఃఖం'' అని, "అయోధ్యానగరంలో ఉండడం సుఖం'' అని శ్రీరాముడు అన్నాడు. సీతాదేవి "ఆ విధంగాకాదు, సుఖదుఃఖాలు ఒక్కొక్కరి విషయంలో ఒక్కొక్క రీతిలో ఉంటాయి. **"య స్త్వయా స హ స స్వర్గో నరకో యస్త్వయా వినా, ఇతి జానన్ పరాం ప్రీతిం గచ్ఛ రామ! మయా సహ"** (రామా- అయో-30-18) (శ్రీరామా! నీతో కూడి ఉండడమే నాకు స్వర్గం. నిన్ను విశ్లేషించడం నరకం- అనే విషయాన్ని తెలిసికొన్నవాడవై, నాతోపాటు గొప్ప ఆనందాన్ని పొందు) అని అంటూ. "నీతో కలసి ఉండడమే నాకు సుఖం. నిన్ను విశ్లేషించి అయోధ్యానగరంలో ఉండడం నాకు దుఃఖం'' అని అన్నది.

**(ఇతి జానన్)-** తమ తమ అనుభవంద్వారా తెలియని విషయాలను వానిని తెలిసినవారిద్వారా గ్రహించి తెలిసికోవాలి.

**(పరాం ప్రీతిమ్) -** నీకు నాపట్ల ఉండే ప్రేమవలె నాకు నీ పట్ల ఉండే ప్రేమ పరిమితిని కల్గినది కాదు - అని (సీతాదేవి) అన్నది. "నాకంటే నీకు ప్రేమ అధికంగా ఉన్నది - అని అంటే మాత్రం దానికి నేను ఏం చేయను?'' అని శ్రీరాముని అభిప్రాయంగా తలచి, **(గచ్ఛ రామ మయా సహ)- "ధనురాదాయ సశరం ఖనిత్రపిటకాధరః, అగ్రతస్తే గమిష్యామి పంథాన మనుదర్శయన్"** (రామా-అయో-31-25) (విల్లంబులను ధరించి, గడ్డపారను, పూలబుట్టను మోసికొని, దారిని చూపిస్తూ నీకు ముందు వెడతాను) అని లక్ష్మణుడు పల్కినట్లే, "నీవు వెళ్ళేటపుడు నన్ను నీకు ముందు పంపించి, నీవు నా వెనుక రా'' అని సీతాదేవి పల్కినది కదా! భగవానుని ఒక్కని మాత్రమే తనకు శేషిగా కల్గినది కనుక, "నీతో కూడా నేను వస్తాను. నిన్ను విడచి ఉండలేను'' అని అన్నదికదా! మనవంటి సామాన్య జీవులం భగవానుడు, లక్ష్మీదేవి- అనే ఒక మిథునాన్ని శేషిగా కల్గినవారం కనుక, **"నాణ్ మలరాళ్ కోనై ప్పిరివుమ్ పిరియమైయుమాయ్"** అని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ అనుగ్రహించారు.

**"న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ!, ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివో ద్ధృతౌ"** (రామా-అయో- 53-34) (రాఘవా! నిన్ను విడచిన సీత బ్రతుకలేదు. నిన్ను విడచిన నేను కూడా జీవించలేను. ఒకవేళ జీవిస్తే, నీటినుండి బయటకు తీసివేసిన చేపలవలె ఒక ముహూర్తకాలం మాత్రమే జీవించగలం) అని శ్రీరాముని విడిచి ఉండే విషయంలో సీతాదేవిని పోలినవాడను, నేను - అని లక్ష్మణుడు తనను ఉద్దేశించి పల్కడం విశ్లేషాన్ని సహించలేకపోవడం ఇద్దఱికి సమానం'' - అని వ్యక్తం చేయడం కోసమే తప్ప,

ఆమెవలె శ్రీరాముని మాత్రం శేషిగా కల్గినవాడను నేను- అనే భావంతో చెప్పలేదు కదా! **"భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (రామా- అయో- 31-25) (నీవు వైదేహితో పాటు కొండచరియలలో విహరిస్తావు. అపుడు నేను, నీవు మేల్కొని ఉన్నపుడు, నిద్రించేటపుడు నీకు అన్నివిధాలైన కైంకర్యాలను చేస్తాను) అని ఇద్దరు (సీతారాములు) కలసి ఉండే సన్నివేశంలో కైంకర్యం చేస్తానని లక్ష్మణుడు స్వయంగా అన్నాడు కదా!

**(తురిశఱ్ఱు)**- అన్యవిషయాలలో అభినివేశాన్ని (ఆసక్తిని) పొందడమనే దోషం లేకుండా- అని అర్థం. అది ఏమంటే- ఇటువంటి పరభక్తిని కల్గి ఉన్నా, దానిని భగవానుని పొందడానికి సాధనంగా గ్రహించే ఉపాసకునివలె కాకుండా, భోజనాన్ని భుజించడానికి ఆకలి ఆవశ్యకమైనట్లు, ఆ పరభక్తిని భగవంతుని పొందడానికి అభిలాషగా (ఆసక్తిగా) చేసికొని- అని భావం. ఈ పరభక్తిలో ఉపాయత్వబుద్ధిని కల్గి ఉండడమనే దోషాన్ని లేకుండా ఉండడమే దీని సారం.

**(శాతకమ్‌పోల్ నాదన్ తన తరుళే పార్‌త్తిరుత్తల్)**- దీని భావం. ఏమంటే- వర్షం కురిసేటపుడు, ఆ నీటిని తాగకపోతే ప్రాణం నిలుపుకోలేని చాతకపక్షి, తనకు మిక్కిలి దాహం కల్గి, నాలుక పిడచకట్టినా, భూమిలో ఉండే నీటిని ఏమాత్రం కంటితో చూడకుండా, మేఘం కురిసే నీటికోసమే ఎదురు చూచేటట్లుగా, జీవాత్మను పొందేవాడు, పొందడానికి ఉపాయంగా ఉండేవాడు, పొందిన తరువాత ఆనందించేవాడు ఆ భగవంతుడే అయినట్లు, జీవాత్మయొక్క స్వరూపానికి తగిన స్వామి అయిన భగవంతుని కరుణనే అతనిని పొందడానికి సాధనమని నిశ్చయించుకొని, **"తుణియేనిని నిన్నరుళల్లదు ఎనక్కు"** (పెరియతిరు-11-8-8) (నీ కరుణ తప్ప ఇంకొకటిని నాకు రక్షకుడుగా విశ్వసించను) అని, **"నిన్నరుళే పురిన్దిరున్దేన్ ఇని ఎన్ తిరుక్కుఱిప్పే"** (పెరియాళ్వార్ తిరు-5-4-1) (నీ కరుణనే నేను కోరాను. ఇక నీ అభిప్రాయం ఏమి!) అని చెప్పబడిన రీతిలో భగవంతుని కరుణనే ఎదురు చూడడం అనేది ఈ ప్రయోగతాత్పర్యం. **"ప్రపన్న శ్చాతకో యద్వత్ ప్రపత్తవ్యః కపోతవత్, రక్ష్యరక్షకయోరేత ల్లక్ష్యం లక్షణ మేతయోః"** (పాంచ



రాత్రమ్) (చాతకపక్షి మేఘజలాన్ని ఎదురు చూచే రీతిలో, ప్రపత్తిని చేసేవాడు, సర్వేశ్వరుని కృపనే ఎదురుచూస్తాడు. శరణాగతి చేయబడేవాడు, కపోతోపాఖ్యానంలోని పావురంవలె, ప్రపన్నుని తన ప్రాణాలను విడచి అయినా రక్షిస్తాడు. రక్షింపబడే ప్రపన్నునకు, రక్షించే శరణ్యునకు ఇదే లక్షణం. చాతకపక్షి, పావురం- అనే ఇవే ఉదాహరణాలు) అని చెప్పబడ్డాయి.

**(కోదిలడియార్ కుణమ్)**- దీని భావం ఏమంటే- భగవద్దాసులనే పేరును పెట్టుకొని అన్యప్రాప్యప్రాపకాలలోగాని, అన్యోపాయాలలోగాని ఆసక్తిని, సంగాన్ని కల్గి ఉండే దోషం లేకుండా, తాను భగవంతునకు శేషమై ఉండడానికి తగినట్లుగా "ఉపాయం, ఉపేయం ఆ సర్వేశ్వరుడే'' అని తలచి ఉండేవారి స్వభావం - అని (భావం). అందువల్ల ఈ పాశురంలోని పూర్వార్ధంలో- "పొందదగిన ప్రాప్యం అతడే'' అని, ఉత్తరార్ధంలో- ప్రాప్యాన్ని పొందించే మార్గమైన ఉపాయం కూడా అతడే'' అనేది స్ఫురించేటట్లు చెప్పడంకోసమే "ఈవిధంగా ఉండడం దోషం లేని శేషభూతులస్వభావం'' అని చెప్పినట్లయింది.

**3. ఆనై యిడర్ కడిన్ద ఆఴియఙ్గై యమ్బుయత్తాళ్,**
**కోనై విడిల్ నీరిల్ కుదిత్తెఴున్ద, - మీనెనవే**
**అక్కై ముడియుమ్బడి పిఱత్తల్ అన్నవన్‌తాళ్,**
**నీక్కమెలా అన్బర్ నిలై**

ఆనై = గజేంద్రుని, ఇడర్ = (మొసలివల్ల ఏర్పడిన) దుఃఖాల్ని, కడిన్ద = పోగొట్టి, ఆఴి అమ్ కై = శ్రీసుదర్శన చక్రాన్ని అందమైన చేతిలో కల్గిన, అమ్బుయత్తాళ్ కోనై = లక్ష్మీవల్లభుని, విడిల్ = విశ్లేషిస్తే, నీరిల్ = నీటినుండి, కుతిత్తు ఎఴున్ద = గెంతి గట్టుపైబడిన, మీన్ ఎనవే = చేపవలె, ఆక్కై = శరీరం, ముడియుమ్బడి = నశించే స్థితి, పిఱత్తల్ = కల్గడం, అన్నవన్ తాళ్ = అటువంటి లక్ష్మీనాథుని శ్రీచరణాలను, నీక్కమ్ ఇలా అన్బర్ = విశ్లేషాన్ని సహించలేని రీతిలో భక్తిని కలవారి, నిలై = స్థితి.

గజేంద్రుని ఆర్తిని తీర్చిన శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో కల్గిన శ్రియఃపతిని విశ్లేషిస్తే, నీటినుండి బయటపడిన చేపవలె, శరీరవియోగం కలిగే రీతిలోని స్థితిని పొందడం, ఆ భగవానుని శ్రీచరణాలను విడచి ఉండలేని పరమభక్తుల స్వభావం.

మూన్ఱామ్‌పాట్టు :- అవతారికై : ఇదిల్, కీఴ్చ్చొన్న పరభక్తియినుడైయ ముఱ్ఱుదలాన పరమభక్తి పిఱన్దవర్‌కళుడైయ నిలైయై అరుళిచ్చెయ్‌కిఱార్.

వ్యాఖ్యానమ్ :- (ఆనై ఇడర్ కడిన్ద) - "పరమాపద మాపన్నో౽ మనసా చింతయద్ధరిమ్, స తు నాగవరః శ్రీమాన్ నారాయణపరాయణః" ఎన్గిఱపడియే, దేవసంవత్స రత్తిలే ఆయిరమ్ సంవత్సరమ్ ముదలై నీరుక్కిఴుక్క, తాన్ కరై-క్కిఴుక్క, అలైచ్చల్ పట్టు, అదుక్కు తన్నిలమాకైయాలుమ్ అభిమత సిద్ధియాలుమ్ బలమ్ వర్ధిక్కైయాలుమ్ తనక్కు త్తన్నిలమల్లామైయాలుమ్, అభిమతాలాభత్తాలుమ్ బలమ్ క్షయిక్కైయాలుమ్, తుతిక్కై ముఴుత్తుమ్బుడి యాన దశై విళైకై యాకైయాలే, ఇని ఇదుక్కు మేలిల్లై ఎన్నుమ్బుడియాన ఆపత్తై అడైన్దు, ఇత్తకైయిల్ విరోధినిరసనశీలనాన సర్వేశ్వరనే నమక్కు రక్షకన్ - ఎన్ఱు అనుసంధిత్తు, "నారాయణా! వో!" ఎన్గిఱపడియే కూప్పిట్ట గజేంద్రాఴ్వానుడైయ దుఃఖత్తై ప్పోక్కిన. ఇవనుక్కు దుఃఖమాకిఱదు- ముదలైయిన్ వాయిలే అకప్పడుకైయాలే. శరీరమఴికిఱదు - ఎన్ఱల్ల. కైయిలే పూ శెవ్వి అఴియామే తిరువడికళిలే శాఱ్ఱప్పెఱుకిఱిలోమ్- ఎన్నుమదు. "నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన!, కరస్థకమలాస్యేవ పాదయోరర్పితుం హరే" ఎన్ఱారిఱే! ఇప్పడి ఇరున్దుళ్ళ దుఃఖత్తై అవన్ నోవుపడుకిఱ దశైయిలే శెన్ఱు ముకమ్ కాట్టిప్పోక్కిన పడియై చ్చొల్లుకిఱదు.

(ఆఱ్ఱియఙ్గై) - తిరువాఴియై అఴకియ కైయిలే యుడైయ. కైయుమ్, తిరువాఴియుమాయ్ క్కొణ్డాయిఱ్ఱు, అప్పోదు శెన్ఱదు. "మఴుఙ్గాద వైనుతియ శక్కరనల్ పడైత్తయాయ్, తొఴుమ్ కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్‌న్దు తోన్ఱినైయే" ఎన్ఱారిఱే, ఆఴ్వార్. కైయిల్ తిరువాఴియై యిరున్దు అఱిన్దిలన్ అఱిన్దిరున్దానాకిల్, ఇరున్ద విడత్తిలే యిరున్దు, అత్తై ఏవి కార్యమ్ కొళ్ళలామిఱే. అఱిన్దిరున్దాలుమ్ అప్పడి శెయ్యప్పోకాదాయిఱ్ఱు. "తొఴుమ్ కాదల్ కళిఱు" ఎన్గిఱపడియే కైయుమ్ తిరువాఴియుమాన అఴకు కాణ ఆశైప్పట్టిరుక్కిఱవనాకైయాలుమ్, కైయిల్ పూ తిరువడికళిల్ శాత్త ఆశై పట్టిరుక్కిఱవనాకైయాలుమ్, శెన్ఱు అవనుడైయ దుఃఖత్తై త్తీర్‌క్కవేణ్డుకైయాలే. అవ్వళవు మన్ఱిక్కే, శెన్ఱవిడమ్ తన్నిల్ ఇవనుక్కు కాఱ్కట్టాన ముదలైయై



నిరసిత్తదుమ్ తిరువాఴియైక్కొణ్డిఱే, "కుట్టత్తుక్కోళ్ ముదలై తుఞ్జ కుఱిత్తు ఎఱిన్ద శక్కరత్తాన్" ఎన్గిఱపడియే.

(అమ్బుయత్తాళ్ కోనై) నళినవాసినియాన పెరియపిరాట్టియారుక్కు నాయకనానవనై. ఇదువుమ్ సాభిప్రాయమ్. "దేవీహస్తాంబుజేభ్యః" ఇత్యాదిప్పడియే పాదాబ్జసంవాహినిగళ్ తిరువడిగళ్ పిడిక్క, తిరువనందాఴ్వానాగిఱ పడుక్కైయిలే పెరియపిరాట్టియారైయుమ్ తిరుమార్బిలే అణైత్తిక్కొణ్డు పళ్ళికొణ్డరుళానిఱ్కచ్చెయ్‌దేయిఱే, ఇవనుడైయ ఆర్తనాదమ్ తిరుచ్చెవిప్పట్టదు. అప్పోదు అవర్‌గళ్‌కైయిల్‌నిన్ఱుమ్ తిరువడిగళై వాఙ్గి, తిరుప్పడుక్కైయిల్ నిన్ఱుమ్ శడక్కెన ఎఴున్దిరున్దు, తిరుక్కణ్‌గళై మలర విఴిత్తు, శుఱ్ఱుమ్ పార్‌త్తు, పిరాట్టియుడైయ తిరుములైత్తడత్తిల్ కుఙ్గుమక్కుఴమ్బిలే పఱ్ఱిక్కిడక్కిఱ తిరుమార్బైయుమ్ అదిల్ నిన్ఱుమ్ వాఙ్గి, పిన్నైయిఱే, "అతన్ద్రితచమూపతి ప్రహితహస్తమ్" ఇత్యాదిప్పడియే పెరియత్వరైయోడే ఎఴున్దరుళి, శ్రీగజేంద్రాఴ్వానుడైయ దుఃఖత్తై ప్పోక్కిఱ్ఱు. అత్తై ప్పఱ్ఱవుమ్, ప్రజారక్షణమ్ పణ్ణినాలల్లదు కణ్డుగక్కుమ్ మాతావైప్పోలే ఇదు కణ్డుకళిప్పళ్ - ఎన్ఱు శెయ్ దరుళుగైయాలుమ్ "అమ్బుయత్తాళ్‌కోన్" ఎన్గిఱదు. ఇత్తాల్- ఆశ్రితరుడైయ ఆపద్దశైగళిలే శెన్ఱు ఉదవి రక్షిక్కుమవనాయ్, అవర్‌గళ్ విరోధనిరసనత్తుక్కుమ్, అఴగుక్కుమ్ ఉడలాన తిరువాఴియై క్కైయిలే యుడైయనాయ్, అవర్‌గళై రక్షిత్తాలల్లదు తన్ పేఱాగ క్కొణ్డుగక్కుమ్ పెరియ పిరాట్టియార్‌క్కు వల్లభ నానవనై - ఎన్ఱై.

(విడిల్) ఇప్పడి యిరుక్కిఱవనై విశ్లేషిక్కిల్,

(నీరిల్ కుదిత్తెఴున్ద మీనెనవే) -నీరిలే నిన్ఱుమ్ కుదిత్తు క్కిళర్‌న్దు. అత్తై ప్పిరిన్ద మత్స్యమ్ పోలే.

(ఆక్కైముడియుమ్బడి పిఱత్తల్) - శరీరమ్ నశిక్కుమ్బడియాన అవస్థై పిఱక్కై. సంశ్లేషత్తిల్ సుఖముమ్, విశ్లేషత్తిల్ దుఃఖముమాయ్ చ్చెల్లుమ్ పరభక్తియై క్కాట్టిల్ పరమభక్తిక్కు విశేషమ్- విశ్లేషత్తిల్ సత్తాహాని పిఱక్కైయిఱే. అత్తై సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌దారాయిఱ్ఱు.

(అన్నవన్‌తాళ్ నీక్కమిలా అన్బర్ నిలై) - "కీழ் అమ్బుయత్తాళ్" కోన్ ఎన్టవనై అన్నవనెన్టు పరామర్శిక్కిఱార్. అన్నవనెన్టదు - అప్పడిప్పట్టవన్ - ఎన్టపడి. అథవా, మత్స్యత్తుక్కు జలమ్‌పోలే, ఇవ్వాత్మావుక్కు ధారకనాయిరుక్కుమవన్- ఎన్నవుమామ్. తాళ్ నీక్కమిలా అన్బావదు - అవన్ తిరువడిగళై ప్పిరియ సహియాదపడియాన ప్రేమమ్. ఇప్పడి ఇరుస్దుళ్ళ ప్రేమత్తై యుడైయరానవర్ కగళుడైయ స్వభావమ్, అవనై విశ్లేషిక్కిల్ జలాదుద్ధృతమాన మత్స్యమ్‌పోలే సత్తాహాని పిఱక్కుమ్బడియాగ - ఎన్టు కీழోడే సంబంధమ్. "న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ, ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివోద్ధృతౌ" ఎన్టారిఱే ఇళైయపెరుమాళ్.

మూడవ పాశురం :- అవతారిక : ఈ పాశురంలో పరభక్తియొక్క పండిన దశ అయిన పరమభక్తిని కలవారి స్థితిని తెల్పుతున్నారు.

వ్యాఖ్యానమ్ :- (ఆనై ఇడర్ కడిన్ద) - "పరమాపద మాపన్నో మనసాఽచింతయద్ధరిమ్, స తు నాగవరః శ్రీమాన్ నారాయణపరాయణః" (విష్ణు ధర్మమ్-69-47) (గొప్ప ఆపదను పొందినవాడు, భగవత్ కైంకర్యలక్ష్మిని కలవాడు, నారాయణునే గొప్ప గతిగా కలవాడైన ఆ గజేంద్రాழ్వాన్ మనస్సుతో హరిని (ప్రార్థించాడు) అనే రీతిలో దేవవర్షాలకాలం వేయి మొసలి మడుగులోకి లాగగా, గజేంద్రుడైన తాను తీరానికి లాగగా- ఈవిధంగా చిరకాలం క్లేశాన్ని పొందాడు. మొసలికి మడుగు స్వస్థానమైనందున, తన శాపవిమోచనంకోసం తాను ఎదురు చూచిన గజేంద్రుని కాలు తనకు దొరికినందున, మొసలిబలం అంతకంతకు వృద్ధి చెందింది. తీరంలో బలాన్ని కల్గిన గజేంద్రునకు, జలం స్వస్థానం కానందున, తాను భగవంతుని శ్రీచరణాలలో సమర్పించడంకోసం కోయాలని ఆశపడిన తామరపూవు అందనందున అతని బలం క్షీణించింది. అందువల్ల గజేంద్రుని తొండం మునిగిపోయే దశకు నీటిలో అది మునిగి పోయింది. అందుచేత గజేంద్రుడు ఇంతకు మించిన గొప్ప ఆపద లేదు- అనే రీతిలోని ఆపదను పొందాడు. ఆస్థితిలో విష్ణుభక్తిని కల్గిన గజేంద్రుడు "విరోధినిరసనాన్ని చేసే స్వభావాన్ని కల్గిన సర్వేశ్వరుడే మనలను రక్షించ గల్గినవాడు''- అని భావించి, "నారాయణా! ఓ! మణివణ్ణా!.... వారాయ్ ఎన్ ఆరిడరై నీక్కాయ్" (శిఱియ తిరుమడల్) (నారాయణా! మణివణ్ణా! రా! నా క్లేశాన్ని తీర్చు) అని పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుని పిలిచాడు. ఆ సమయంలో గజేంద్రుడనే ఆ ఏనుగు యొక్క ఆపదను స్వామి తీర్చాడు - అని ఈ ప్రయోగంలోని తాత్పర్యం. గజేంద్రుని క్లేశం ఏమంటే- మొసలి నోటిలో చిక్కుకొన్నందున శరీరం నశించిపోనున్నదే ! అని కాదు. తన చేతిలోని పూవు వాడిపోవడానికి ముందే భగవానుని శ్రీచరణాలలో సమర్పించలేక పోయానే! అనేదే అతని క్లేశం. "నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన!, కరస్థ కమలాన్యేవ పాదయో రర్పితుం హరే!" (విష్ణు ధర్మమ్) (మధుసూదనా! నేను ఈ శరీరాన్ని రక్షించుకోవడం కోసం నిన్ను ప్రార్థించలేదు. ఓ హరీ! నా తొండంలో ఉండే తామరలను, అవి వాడిపోవడానికి ముందే, నీ చరణాలలో సమర్పించడం కోసమే నిన్ను పిలిచాను) అని విష్ణుధర్మంలో చెప్పబడినదికదా! అటువంటి ఆపద కల్గిన దశలో కల్గిన దుఃఖాన్ని, అతడు దుఃఖించేటపుడే అతని దగ్గరకు పోయి, అతనికి తన దర్శనాన్ని అనుగ్రహించి, పోగొట్టిన విషయాన్ని ఈ ప్రయోగం ద్వారా తెల్పుతున్నారు.



(ఆழியజ్కై)- శ్రీసుదర్శనచక్రాన్ని అందమైన శ్రీహస్తంలో కలవాడు. అపుడు చేతిలో చక్రాన్ని ధరించే భగవానుడు వెళ్ళాడు. "మழుజ్గాద వైనుతియ శక్కర నల్వలత్తైయాయ్, తొழుమ్ కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్న్దు తోన్టినైయే" (తిరువాయ్-3-1-9) (మొక్కపోని పదునైన అంచును కల చక్రాన్ని కుడిచేతిలో కలవాడా! నిన్ను సేవించాలనే కోరిక కల గజాన్ని రక్షించడం కోసం గరుడుని అధిరోహించి ప్రత్యక్షమయ్యావు కదా!) అని నమ్మాழ్వార్లు ఈ విషయాన్ని పలికారు కదా! భగవానుడు గజేంద్రుని ఆర్తనాదాన్ని వినిన వెంటనే సుదర్శనచక్రం తన చేతిలో ఉండే విషయాన్ని కూడా తెలియకుండా పరుగెత్తి పోయాడు. తెలిసి ఉంటే శ్రీవైకుంఠంలో నుండే దానిని ప్రయోగించి, గజేంద్రరక్షణను చేసి ఉండవచ్చుకదా! ఒకవేళ తెలిసినా, ఆవిధంగా చేయడం సాధ్య పడదు. ఎందుకంటే, "తొழుమ్ కాదల్ కళిఱు" (తిరువాయ్-3-1-9) (సేవించాలనే ఆశను కల గజం) అనే రీతిలో భగవంతుడు సుదర్శనాన్ని శ్రీహస్తంలో ధరించిన అందాన్ని దర్శించాలని గజేంద్రుడు ఆశపడినందున,

తన తొండంలో ఉండే పూవును భగవానుని శ్రీచరణాలలో సమర్పించాలని అతడు ఆశపడినందున, అతడుండే చోటికి పోయి, అతని ఆపదను స్వామి తీర్చవలసి ఉన్నది కదా! అంతే కాకుండా, గజేంద్రుని రక్షించాలని వచ్చినపుడు, అతనికి (గజేంద్రునకు) క్లేశాన్ని కల్గించిన మొసలిని చంపడం కూడా చక్రాన్ని ప్రయోగించేకదా! చేశాడు. ఈ విషయాన్ని **"కుట్టత్తుక్కోళ్ ముదలై తుఞ్జ కుటిత్తెఱిన్ద శక్కరత్తాన్"** (మడుగులోని మొసలి నశించేటట్లుగా గుటి తప్పకుండా చక్రాన్ని ప్రయోగించినవాడు) (మూన్టామ్ తిరు-99) అనే పేయాళ్వార్లు తెలిపారు.

**(అమ్బుయత్తాళ్ కోనై)** - తామరపూవులో నిత్యవాసం చేసే లక్ష్మీదేవికి నాయకుడైనవానిని- అని అర్థం. ఈ ప్రయోగం ఈ క్రింద తెలుపబడిన భావాన్ని వ్యక్తం చేస్తున్నది. ఆ భావం ఏమంటే - **"దేవీహస్తాంబుజేభ్యః చరణకిసలయే సంవహద్భ్యో ఉపహృత్య, ప్రత్యస్యానంతభోగం ఝటితి చలపుటే చక్షుషీ విస్తృణానః, ఆక్షిప్యోరశ్చ లక్ష్మ్యాః స్తనకనక కనత్స్తోమపంకాత్.... దేవః శ్రీరంగధామా గజపతిఘుషితే వ్యాకులః స్తాత్ పురో నః"** (శ్రీరంగరాజస్తవం -56) (గజేంద్రుడు ఆక్రందించినపుడు, శ్రీచరణాలను సంవాహనం చేసే దివ్యదేవేరుల తామరలవంటి శ్రీహస్తాలవంటి చిగుళ్ళవంటి తన పాదాలను బలంగా విడిపించుకొని, ఆదిశేషుని తిరుమేని అనే శయ్యను తటాలున వీడి, తనను ఆలింగనం చేసికొని ఉండే లక్ష్మీదేవియొక్క బంగారు కలశాల వంటి స్తనాలలో అలంకారంగా అలదబడిన కుంకుమపంకం నుండి వక్షస్సును విడిపించుకొని, మిక్కిలి రెపరెపలాడే కంటిరెప్పలను కల నేత్రాలను రెండిటిని బాగా పెద్దవి చేసి చూస్తూ మిక్కిలి తత్తరపాటును పొందిన శ్రీరంగనాథుని రూపం మనకంటి ముందు సాక్షాత్కరించాలి) అనే రీతిలో శ్రీచరణ పద్మాలను ఒత్తే దివ్యదేవేరులు సంవాహనం చేస్తూ ఉండగా, ఆదిశేషుడనే పడుకలో లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో ఆలింగనం చేసికొని శయనించి ఉండేటపుడు కదా, గజేంద్రుని ఆర్తనాదం చెవిసోకింది. అపుడు దేవేరుల చేతుల నుండి తన శ్రీచరణాలను విడిపించుకొని, శయ్యనుండి వెంటనే పైకి లేచి, కళ్ళను విప్పారచూచి, చుట్టూ పరికించి చూచి, శ్రీదేవిస్తనతటంలోని కుంకుమపంకం



అంటుకొని ఉండే తన వక్షస్సును ఆ స్తనతటం నుండి విశ్లేషింపజేసి, ఆపిమ్మట కదా- **"అతంత్రిత చమూపతిప్రహితహస్త మస్వీకృత ప్రణీతమణిపాదుకం కిమితి చాకులాంతఃపురమ్, అవాహనపరిష్క్రియం పతగరాజమారోహతః కరిప్రవరబృంహితే భగవత స్త్వరాయై నమః"** (గజేంద్రుని ఆక్రందనను వినిన వెంటనే, విష్వక్సేనుడు ఇచ్చే కైదండను (సహాయంగా చాచిన చేతిని) పట్టించుకోకుండా, తీసికొనిరాబడిన రత్నపాదుకలను స్వీకరించకుండా, 'ఏమి జరిగింది?'' అని దివ్యదేవేరులు తికమకపడుతూ ఉండగా, వాహనానికి తగిన అలంకారం ఏమీ చేయని గరుడునిపై ఎక్కి వచ్చే భగవంతుని త్వరకు నమస్కారం) అనే రీతిలో గొప్ప వేగంతో వేంచేసి గజేంద్రుని ఆర్తిని తీర్చాడు, సర్వేశ్వరుడు. అందువల్ల, బిడ్డను రక్షిస్తే దానిని చూచి ఆనందించే తల్లివలె, దీనిని చూచి లక్ష్మీదేవి చాలా సంతోషిస్తుంది -అని ప్రకృతస్వభావం. **"అమ్బుయత్తాళ్ కోన్"** అనే ఈ ప్రయోగం ద్వారా- భక్తులకు ఆపద కల్గినపుడు అక్కడకు వచ్చి కాపాడేవాడై, వారిని రక్షిస్తే, దానిని తనకోసం చేసినట్లుగా ఆనందించే లక్ష్మీదేవికి వల్లభుడు- అని తెలుపబడింది.

**(విడిల్)** - ఈవిధంగా ఉండేవానిని (సర్వేశ్వరుని) విశ్లేషిస్తే- అని అర్థం.

**(నీరిల్ కుతిత్తెழுన్ద మీనెనవే)**- నీటిలోనుండి పైకి ఎగిరి, గట్టుపైకి వచ్చి, నీటినుండి దూరమైన చేపవలె,

**(ఆక్కై ముడియుమ్బడి పిఱత్తల్)**- శరీర విశ్లేషం (శరీరం నశించిపోయే) రీతిలోని స్థితి కల్గడం- అని అర్థం. భగవంతునితో చేరి ఉంటే ఆనందం, విశ్లేషిస్తే దుఃఖం పొందే స్థితి అయిన పరభక్తి కంటే పరమభక్తికి గల వైలక్షణ్యం ఏమంటే- భగవంతుని విశ్లేషిస్తే ప్రాణాలను కోల్పోవడమేకదా ! దానిని ఉదాహరణంతో వివరిస్తున్నారు- అని తెలుస్తున్నది.

**(అన్నవన్తాళ్ నీక్కమిలా అన్బర్నిలై)** - ఈ పాశురం ఆరంభంలో **"అమ్బుయత్తాళ్కోన్"** అని చెప్పబడిన (నిర్దేశింపబడిన) స్వామిని ఇక్కడ **"అన్నవన్"** అని తెలుపుతున్నారు. **"అన్నవన్"** అనే పదం "అటువంటివాడు''- అనే అర్థాన్ని ఇస్తుంది. చేపకు నీరు వలె, ఈ ఆత్మను ప్రాణధారణను చేసేటట్లు

చేసేవాడు- అని అర్థాన్ని ప్రకృతంలో గ్రహించవచ్చు. “తాళ్ నీక్కమిలా అన్బు”- అంటే- ఆ స్వామియొక్క శ్రీచరణాల విశ్లేషాన్ని సహించలేని రీతిలోని ప్రేమ (భక్తి)- అని అర్థం. ఇటువంటి భక్తిని కల్గినవారి స్వభావం భగవానుని విశ్లేషిస్తే నీటిలోనుండి బయటపడిన చేపవలె ప్రాణం పోతుంది- అనే పూర్వార్ధంతో అన్వయించి అర్థాన్ని చెప్పాలి. “న చ సీతా త్వయా హీనా న చాహ మపి రాఘవ!, ముహూర్తమపి జీవావ జలాన్మత్స్యాది వోద్ధృతౌ” (రామా-అయో- 53-54) (ఓ రాఘవా! నీ విశ్లేషాన్ని సీతాదేవి సహించలేదు. నిన్ను విడచి నేనుకూడా బతుకలేను. ఒక వేళ మేమిద్దరం బతికి ఉంటే, నీటిలో నుండి బయటకు తీసివేయబడిన చేపలవలె ఒక క్షణకాలం మాత్రమే జీవించి ఉండగలము) అని లక్ష్మణుడు పలికాడుకదా!

**4. మఱ్ఱొన్ఱై యెణ్ణాదే మాదవనుక్కాట్చెయలే,**
**ఉఱ్ఱదిదు ఎన్ఱుళమ్ తెళిన్దు, – పెఱ్ఱ**
**పెరుమ్పేఱ్ఱిన్ మేలుళదో పేఱొన్ఱిరుప్పార్,**
**అరుమ్పేఱు వానత్తవర్క్కు.**

మఱ్ఱు ఒన్ఱై = భగవానుని కైంకర్యం కంటే అన్యమైన ఇంకొక విషయాన్ని గూర్చి, ఎణ్ణాదే = ఫలంగా భావించకుండా, మాదవనుక్కు = లక్ష్మీనాథునకు, ఆళ్ శెయలే= దాస్యాన్ని (కైంకర్యాన్ని) చేయడంలో, ఇదు ఉఱ్ఱదు = ఇది స్వరూపాను రూపమైనది, ఎన్ఱు = అని, ఉళమ్ = మనస్సు, తెళిన్దు = తేటపడి (ఆ కైంకర్యాన్ని పొందితే), పెఱ్ఱ పెరుమ్ పేఱ్ఱిన్ మేల్ = మనం పొందిన ఈ గొప్ప ప్రాప్యానికి మించి, పేఱు ఉళదో = వేఱొక ప్రాప్యం ఉన్నదో, ఎన్ఱు ఇరుప్పార్= అని తలచేవారు, వానత్తవర్క్కు = నిత్యసూరులకు, అరుమ్ పేఱు= పొందడానికి అరుదైన ప్రాప్యమై ఉంటారు.

భగవత్కైంకర్యం తప్ప వేఱొక విషయాన్ని మనస్సుతో కూడా భావించకుండా, శ్రియఃపతికి కైంకర్యం చేయడమే స్వరూపానికి తగినది – అని తెలిసికొని, ఆ భగవత్కైంకర్యాన్ని పొందితే, ఆవిధంగా పొందిన మహాపురుషార్థానికి మించి ఇంకొక పురషార్థమున్నదా? – అనే దృఢనిశ్చయంతో ఉండేవారు నిత్యసూరులకు కూడా అలభ్య లాభమై ఉంటారు.



నాలావ్పాట్టు :- అవతారికై : కీழ் చొన్న మూన్ఱు పాట్టాలే ద్వయత్తిల్ పూర్వవాక్యత్తాల్ ప్రతిపాదిక్కప్పడుగిఱ ప్రపత్తియినుడైయ ముఖ్యవేషత్తైయుమ్, అదుక్కు హేతు, ఆర్తాధికారియాలే పణ్ణప్పడుగైయాలే అధికారియుడైయ ఆర్త్తిక్కు హేతువాన పరభక్తిదశైయిన్ నిలైయిరుక్కుమ్పడియైయుమ్ పరమభక్తిదశైయిన్ నిలైయిరుక్కుమ్పడియైయుమ్ అరుళిచ్చెయ్దార్. ఇని, ఉత్తర వాక్యత్తాల్ ప్రతిపాదిక్కప్పడుగిఱ పరమపురుషార్థమాన కైంకర్యత్తిన్ శీర్మైయై అఱిన్దు, ప్రయోజనాంతరసంగనివృత్తి పూర్వకమాగ స్వరూపాను రూపమాన అదిలే నిష్ఠరానవర్గళుడైయ వైభవత్తై అరుళిచ్చెయ్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (మఱ్ఱొన్ఱై ఎణ్ణాదే) - అదావదు- కైంక్యరూపపురుషార్థత్తుక్కు అన్యమానదొన్ఱై పురుషార్థమాగ గణియాదే- ఎన్ఱై. అన్యపురుషార్థమావదు- ఇహలోకభోగముమ్, పరలోకభోగముమ్, ఆత్మానుభవముమిఱే. అవైఱ్ఱిన్ పేర్ శొల్లుగైయుమ్ అసహ్యమాగైయాలే “మఱ్ఱొన్ఱై”- ఎన్ఱిఱదు. “విరుమ్పాదే” ఎన్నాదే, “ఎణ్ణాదే” ఎన్ఱదు- అవైతన్నై ఒరు పురుషార్థమాక నినైత్తాలిఱే విరుమ్పువదు ఎన్ఱదు. అవఱ్ఱై విరుమ్పువార్. దాస్యరసమఱియాదవర్గళిఱే. దాస్యరసజ్ఞరానవర్గళుక్కు అవై ఊషరజలసేవైపోలే విరసనమాయ్, హేయమాయిరుప్పదు. “భోగా ఇమే విధిశివాదిపదం చ కించ స్వాత్మాను భూతిరితి యా కిల ముక్తి రుక్తా, సర్వం తదూషజలజోష మహం జుషేయ హస్త్యద్రినాథ ! తవ దాస్యమహారసజ్ఞః” ఎన్ఱారిఱే ఆழ்వాన్.

(మాదవనుక్కాట్చెయలే)- శ్రియఃపతిక్కు అడిమై శెయ్గైయే. ఇత్తాల్- కైంకర్యప్రతిసంబంధి ఒరు మిథున మెన్నుమదువుమ్, కైంకర్యమే పురుషార్థ మెన్నుమదువుమ్ శొల్లుగిఱదు. కైంకర్యప్రతిసంబంధి ఒరు మిథునమెన్నుమిడమ్ ఉత్తరవాక్యత్తిల్ ప్రథమపదత్తిలే సుస్పష్టమాగ చ్చొల్లానిన్ఱదిఱే. తిరుమంత్రత్తిల్ తృతీయపదత్తిలుమ్, కైంకర్యప్రతిసంబంధి ఒరు మిథునమాయిరుక్కచ్చెయ్దే, అర్థమాగైయాలే అవిశదమాయిరుక్కుమ్. అత్తై ప్పఱ్ఱవిఱే, “ఇదిలే తిరుమంత్రత్తిల్ శొన్న ప్రాప్యత్తై విశదమాగ అనుసంధిక్కిఱ”దెన్ఱు పిళ్లైలోకాచార్యర్ అరుళిచ్చెయ్దదు. కైంకర్యమే పురుషార్థమెన్నుమదు తిరుమంత్రత్తిలుమ్, ఇజ్గు మొక్క చ్చొల్లుగైయాలే సుస్పష్టమ్. “సర్వేషు దేశ కాలేషు సర్వావస్థాసు చాచ్యుత!,

కింకరో! స్మి హృషీకేశ! భూయో భూయోఽస్మి కింకరః" ఎన్నక్కడవదిఱే. "ఒఴివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని, వఴువిలా వడిమై శెయ్య వేణ్డు నామ్" ఎన్ఱారిఱే ఆఴ్వార్.

(ఉఱ్ఱదిదువెన్ఱు) = శీరియదు ఇదు వెన్ఱు. "ఉఱువదిదు వెన్ఱు ఉనక్కాట్పట్టు" ఎన్ఱుమ్, "నీళ్కుడక్కూత్తను క్కాట్చెయ్‌వదే యుఱువదావదు" ఎన్ఱుమ్ ఇదువు మవర్‌తామే అరుళిచ్చెయ్‌దారిఱే. ఇదు ఉఱ్ఱదు - ఎన్నైయాలే, అల్లాదదు పురుషార్థఙ్గళ్ స్వరూపవిరుద్ధఙ్గళాగైయాలే ఉఱ్ఱాదెన్ను మిడముమ్ స్థిరమిఱే. ఆగ, ఇరణ్డు పదత్తాలుమ్, "తిరుమాలే! నాను మునక్కు ప్పఴవడియేన్" ఎన్గిఱ పడియే మిథునశేష భూతనానవనుక్కు, "అడిమైశెయ్‌వార్ తిరుమాలుక్కే" ఎన్ఱుమ్, "తిరుమాల్కురవు శెన్ఱాళ్కుడైయామ్" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే మిథున కైంకర్యమే పురుషార్థమెన్నుమిడముమ్, ఇవనుడైయ స్వరూపత్వనిబంధనమాన గౌరవముమ్ శొల్లిఱ్ఱాయిఱ్ఱు.

(ఉళన్దెళిన్దు) - ఇక్కైంకర్యన్దన్నిల్ స్వప్రయోజన బుద్ధిక్కడియాన అహంకారమమకారఙ్గళ్ పోగైయాలే, "తనక్కే యాగ ఎనై క్కొళ్ళుమీదే" ఎన్ఱుమ్, "ఉనక్కే నా మాట్చెయ్‌వోమ్" ఎన్ఱుమ్, పరప్రయోజనమెన్ఱు శెయ్యుమ్బడి హృదయమ్ తెళిన్దు. ఇత్తాల్- ఉత్తరవాక్యత్తిల్, నమశ్శబ్దార్థమ్ శొల్లప్పట్టదు.

(పెఱ్ఱపెరుమ్బేఱ్ఱిన్ మేలుళదో పేఱెన్ఱిరుప్పార్) అదావదు - కైంకర్య మాగిఱ పురుషార్థమ్ లబ్ధమానాల్, ఇప్పడి లబ్ధమాన ఇమ్మహా పురుషార్థ త్తుక్కు మేలు మొరు పురుషార్థముణ్డో? ఎన్ఱిరుక్కుమవర్‌గళ్ - ఎన్నై. పరమపదత్తై విరుమ్బుగిఱదు - నిత్యవిభూతియాగైయాలుమ్, శుద్ధసత్వ మాగైయాలే జ్ఞానానంద జనకమాగైయాలుమ్, ఇక్కైంకర్యమాగిఱ పురుషార్థత్తుక్కు విచ్ఛేద మఱ్ఱ దేశమెన్నుమత్తై ప్పఱ్ఱవిఱే. ఆగైయాలే, "మేలుళదో పేఱె"న్న త్తట్టిల్లై. ఆగ ఇప్పడి యిరుక్కుమవర్‌గళ్.

(అరుమ్బేఱు వానత్తవర్క్కు) - అదావదు- "అహ్రుతసహజ దాస్య"రాయ్, "కైంకర్యనిరతరాయ్, భగవదేకభోగరా యిరుక్కుమ్" పరమపదవాసిగళుక్కుమ్, పెఱుదఱ్కరియ పురుషార్థభూతరావర్- ఎన్నై. ఇత్తాల్- "సదా పశ్యన్తి"ప్పడియే,



"అప్పాఴుదైక్కప్పాఴుదు ఎన్నారావముద" మాగ అనుభవిక్కిఱ విషయత్తై ప్పాట్టిలుమ్, తఙ్గళై, దుర్లభపురుషార్థమాగ నినైత్తు అనుభవిక్క ఆశైప్పడుమ్బడి యానవర్‌గళ్ - ఎన్ఱదాయిఱ్ఱు. "యే బ్రహ్మన్! భగవద్దాస్యభోగైకనిరతా స్సదా, తే ప్రియాతిథయః ప్రోక్తా శ్శ్రీవైకుంఠనివాసినామ్" ఎన్ఱివ్వర్థమ్ శ్రీశాస్త్రత్తిల్ శొల్లప్పట్టదిఱే.

నాల్గవ పాశురం:- అవతారిక : ఇంతవరకు, గడచిన మూడు పాశురాలతో, (1) ద్వయంలోని మొదటి వాక్యంతో చెప్పబడ్డ ప్రపత్తియొక్క ముఖ్యమైన స్థితి- అనే ఆర్త ప్రపత్తిని, (2) ఆ ఆర్తప్రపత్తి మిక్కిలి ఆర్తిని కలవానిచే చేయబడి నందున, అతని ఆర్తికి కారణమైన పరభక్తి దశయొక్క లక్షణాన్నిగూర్చి, (3) పరమభక్తి దశయొక్క లక్షణాన్నిగూర్చి పలికారు. ఇకపై, ద్వయంలోని ఉత్తరవాక్యంతో చెప్పబడే గొప్ప ఫలమైన కైంకర్యంయొక్క గొప్పతనాన్ని తెలిసికొని, అన్యప్రయోజనాలలో సంగం లేకుండా, స్వరూపానురూపమైన కైంకర్యంలో స్థిరంగా నిలచి ఉండేవారి గొప్పతనాన్నిగూర్చి ఇందులో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (మఱ్ఱొన్ఱై ఎణ్ణాదే)- ఈ ప్రయోగంలోని భావం ఏమంటే- భగవత్ కైంకర్యమనే ప్రయోజనం కంటే అన్యఫలాన్ని దేనినీ ప్రయోజనంగా భావించకుండా - అని భావం. అన్యప్రయోజనమంటే - ఇహలోకంలో అనుభవించే భోగాలు, పరమపదానికి పోయి ఆత్మను అనుభవించడమనే కైవల్యమోక్షమే. వాటి పేరును ప్రస్తావించడంకూడా వీరికి సహించలేనిది అయినందున "మఱ్ఱొన్ఱై" - అని అంటున్నారు. "విరుమ్బాదే" -అని అనకుండా "ఎణ్ణాదే" అని అనడానికి ఏమి కారణం? అంటే, వాటిని ఒక ప్రయోజనంగా లెక్కించినపుడు కదా, వాటిని కోరడానికి అవకాశం ఉంటుంది. వాటినికోరేవారు భగవత్కైంకర్యంలోని భోగ్యతను తెలియనివారే కదా! భగవత్కైంకర్యరుచిని తెలిసినవారికి అవి ఉప్పు నీరువలె రసహీనాలై, అధమాలుగా కదా తోస్తాయి "భోగా ఇమే విధిశివాదిపదం చ కించ స్వాత్మాను భూతి రితి యా కిల ముక్తిరుక్తా, సర్వం తదూషజలజోష మహం జుషేయ హస్త్యద్రినాథ! తవ దాస్య మహారసజ్ఞః" (వరదరాజస్తవం-81) (హస్తిగిరినాథా! నీ కైంకర్యంలోని భోగ్యతను తెలిసిన నేను ఈలోకంలో పొందే భోగ్యాలు, పరలోకంలోని బ్రహ్మరుద్రాదుల

పదవులు, వానికి మించినదైన ఆత్మానుభవం - అనబడే మోక్షం - అనే ఇవి అన్నిటిని ఉప్పునీరువలె రసహీనాలుగా భావిస్తాను) అని కూరేశులు కూడా పలికారు కదా!

**(మాదవనుక్కాట్చెయలే)**- శ్రీమన్నారాయణునకు కైంకర్యం చేయకుండా- అని అర్థం. దీనివల్ల కైంకర్యాన్ని శ్రీమన్నారాయణుడు, లక్ష్మీదేవి - అనే దంపతులను ఉద్దేశించే చేయాలి - అని, కైంకర్యమే పరమపురుషార్థమని చెప్పబడుతున్నది. కైంకర్యాన్ని పరిగ్రహించేవారు ఒక మిథునం అనే విషయం ద్వయంలోని ఉత్తరవాక్యంలో గల **"శ్రీమతే"** అనే మొదటి పదం ద్వారా చాలా స్పష్టంగా చెప్పబడింది కదా! అష్టాక్షరి మహామంత్రంలో **"నారాయణాయ"** అనే మూడవ పదంలో, కైంకర్యాన్ని పరిగ్రహించేది ఒక మిథునం - అనే విషయం చెప్పిడినప్పటికీ, అది తాత్పర్యార్థంగా స్ఫురిస్తున్నందున, స్ఫుటంగా ప్రకాశించదు. అందువల్లనే కదా, **"ఇదిలే తిరుమంత్రత్తిల్ శొన్న ప్రాప్యత్తై విశదమాక అనుసంధిక్కిఅదు"** (ఇందులో తిరుమంత్రంలో చెప్పబడిన ప్రాప్యం వివరంగా అనుసంధింపబడుతున్నది) (ముముక్షుప్పడి-167) అని శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు పలికారు. భగవత్కైంకర్యమే ప్రయోజనమనే విషయం అష్టాక్షరాత్మకమైన తిరుమంత్రంలోను, ద్వయమంత్రంలోను ఒక విధంగా చెప్పబడినందున అది సుస్పష్టమవుతుంది. **"సర్వేషు దేశకాలేషు సర్వావస్థాసు చాచ్యుత!, కింకరోఽస్మి హృషీకేశ! భూయో భూయోఽస్మి కింకరః"** (జితంతే-19) (ఓ హృషీకేశా! అచ్యుతా! అన్ని దేశాలలోను, కాలాలలోను, అన్ని సన్నివేశాలలోను నీకు సదా కైంకర్యాన్ని చేస్తాను) అని జితంతేస్తోత్రంలో చెప్పబడింది కదా! **"ఒழివిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని వழువిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"** (తిరువాయ్-3-3-1) (కాలవిచ్ఛేదం లేకుండా నీతో స్థిరంగా కలసి ఉండి అంతరాయంలేని కైంకర్యాన్ని మేము నీకు చేయాలి) అని నమ్మాழ్వార్లు కూడా పలికారు కదా!

**(ఉఱ్ఱదు ఇదు ఎన్ఱు)** - ఇది గొప్పది అని - అర్థం. **"ఉఱువదు ఇదు ఎన్ఱు ఉనక్కాట్పట్టు"** (తిరువాయ్-9-4-4) (ఈ శేషత్వం నాకు తగినదని నీకు దాసుడనై) అని, **"నీళ్కుడకూత్తను క్కాట్చెయ్‌వదే ఉఱువదావదు"** (తిరువాయ్ 4-10-10) (కుంభనృత్యాన్ని చేసినవానికి కైంకర్యం చేయడమే తగినది) అని ఈ అర్థాన్ని ఆ నమ్మాழ్వార్లే అనుగ్రహించారు కదా! **"ఇదు ఉఱ్ఱదు"** అని అన్నందున అన్యప్రయోజనాలు భగవానునకు శేషభూతమైన జీవుని స్వరూపానికి విరుద్ధాలైనందున గొప్పవి కావు- అని తెలుస్తున్నది. అందువల్ల ద్వయంలోని ఉత్తరవాక్యంలోని చివరి రెండు పదాలద్వారా **"తిరుమాలే! నానుమ్ ఉనక్కు ప్పழవడియేన్"** (తిరుప్పల్లాండు-11) (ఓ శ్రియ! పతీ నేను నీకు అనాదిగా దాసుడను) అనే రీతిలో శ్రీమన్నారాయణులనే దంపతులకు శేషమై ఉండేవారికి **"అడిమై శెయ్‌వార్ తిరుమాలుక్కు"** (తిరువాయ్-6-5-11) అని, **"తిరుమాఱ్కు అరవు శెన్ఱాల్ కుడైయామ్"** (ముదల్ తిరు-53) అని చెప్పబడినందున, శ్రీమన్నారాయణులనే దివ్యదంపతులకు కైంకర్యాన్ని చేయడమే ప్రయోజనం - అనే విషయం, అదే జీవాత్మస్వరూపానికి అనుగుణమైనది, కనుక గొప్పది - అనే విషయం చెప్పబడినదని తెలుస్తున్నది.

**(ఉళన్దెళిన్దు)** - ఈ కైంకర్యమనేది "నా ఆనందంకోసం చేయబడుతున్నది" అనే భావనకు హేతువులైన 'నేను, నాది' (అహంకారం, మమకారం) అనే దోషాలు తొలగినందున, **"తనక్కేయాక ఎనై క్కొళ్ళుమీదే"** (నీ కోసంగానే నన్ను స్వీకరించు) (తిరువాయ్-2-9-4) అని, **"ఉనక్కే నా మాట్చెయ్‌వోమ్"** (తిరుప్పావై-29) (నీకే మేము కైంకర్యం చేస్తాము) అనే గొప్ప ప్రయోజనమనే భావనతో చేసే రీతిలో మనస్సులో తేటదనాన్ని (స్పష్టతను) పొంది-అని భావం. దీనిద్వారా ద్వయంలోని ఉత్తరవాక్యంలో ఉండే **"నమః"** అనే పదం యొక్క అర్థం చెప్పబడింది.

**(పెఱ్ఱ పెరుమ్ పేఱ్ఱిన్ మేలుళదో పేఱు ఎన్ఱు ఇరుప్పార్)**- దీని భావమేమంటే - ఈ కైంకర్యమనే ప్రయోజనాన్ని పొందితే, గొప్పదైన ఫలం ఇంకొకటి ఒకటి ఉంటుందా? అని భావించేవారు- అని. ఆ విధంగా అయితే, పరమపదం గొప్ప ఫలమేకదా! - అని అంటే, పరమపదాన్ని అభిలషించడం ఎందుకంటే - అది ఎప్పటికీ నిలచి ఉండే నిత్యవిభూతి అయినందున, శుద్ధసత్త్వద్రవ్యాత్మకమైనందున, అక్కడ ఉండేవారికి జ్ఞానానందాలను కల్గిస్తుంది కనుక, ఈ కైంకర్యమనే ప్రయోజనానికి మధ్యలో అంతరాయం లేని దేశమనే

కారణంచేతనే. అందువల్ల కైంకర్యానికి మించి ఏ పురుషార్థం లేదు- అని అనడంలో అడ్డు లేదు. అందువల్ల ఈ రీతిలో ఉండేవారి గొప్పతనాన్ని గూర్చి ఇక పల్కుతున్నారు-

**(అరుమ్ పేఱు వానత్తవర్క్కు)** -అని అంటూ. దీని భావమేమంటే- జీవాత్మకు, సహజమైన శేషత్వమనే దానిని కోల్పోనివారై, భగవత్కైంకర్యంలోనే గొప్ప అభినివేశాన్ని కలవారై, భగవానునే గొప్ప భోగంగా కల్గినవారైన పరమపదవాసులకు పొందడానికి అరుదై ఉండేవారు - అని. ఇందువల్ల **"సదా పశ్యంతి"** (విష్ణుసూక్తమ్) (పరమపదంలో నిత్యసూరులు ఎల్లప్పుడు పరమాత్మను దర్శిస్తూ ఆనందిస్తూ ఉంటారు) అనే రీతిలో **"అప్పొழுదైక్కు అప్పొழுదు ఎన్ ఆరావముదమే"** (తిరువాయ్ 2-5-4) (ఏ సమయానికి ఆ సమయం నాకు అతృప్తామృతమై ఉండేవాడా!) అని అంటూ ఆழ்వార్లు అనుభవించే భగవద్విషయం కంటే తమను పొందడానికి అరుదైన ఫలంగా తలచి, అనుభవించాలని ఆశ పడే రీతిలో కాగలరు- అని చెప్పబడినట్లయినది. **"యే బ్రహ్మన్! భగవద్దాస్యభోగైక నిరతా స్సదా, తే ప్రియాతిథయః ప్రోక్తాః శ్రీవైకుంఠనివాసినామ్"** (పాంచరాత్రమ్) (ఓ బ్రాహ్మణా! భగవానునకు కైంకర్యం చేయడంలోనే ఎల్లప్పుడు అభినివేశాన్ని పొందినవారు శ్రీవైకుంఠంలో నివసించేవారికి భోగ్యభూతులుగా చెప్పబడుతున్నారు) అనే ఈ అర్థం పాంచరాత్రశాస్త్రంలో చెప్పబడింది కదా!

5. **తీర్త్త ముయన్ఱాడువదుమ్ శెయ్ తవఙ్గళ్ శెయ్వనవుమ్,**
**పార్త్తనై మున్ కాత్తపిరాన్ పార్ప్పదన్ మున్, - శీర్త్తువరై**
**మన్ననడియో మెన్నుమ్ వాழ்వు నమక్కీన్దదఱ్పిన్,**
**ఎన్న కుఱై వేణ్డు మిని.**

మున్ = పూర్వం భారత సంగ్రామంలో, పార్త్తనై = అర్జునుని, కాత్త పిరాన్= రక్షించిన స్వామిని, పార్ప్పదన్ మున్ = కటాక్షించడానికి ముందు, తీర్త్తమ్= పుణ్యతీర్థాలలో, ముయన్ఱు = గొప్ప ప్రయత్నాన్ని చేసి, అడువదుమ్ = స్నానం చేయడం, శెయ్ తవఙ్గళ్ = శరీరాన్ని క్లేశపెట్టే తపస్సులను, శెయ్వనవుమ్= చేయడం (ఆవశ్యకాలు), కాని, శీర్ త్తువరై మన్నన్ = సంపద నిండుగా కల్గిన ద్వారకకు నాథుడైన శ్రీకృష్ణుని, నమక్కు = మనకు, అడియోమ్ ఎన్నుమ్ వాழ்వు= దాస్యమనే సంపదను, ఈన్దదఱ్పిన్ = అనుగ్రహించిన తరువాత, ఇని = ఇకపై, ఎన్న కుఱై వేణ్డుమ్ = మనకేమి కొఱత ఉన్నది?

పలు క్షేత్రాలకు పోవడమనే ప్రయత్నాన్ని చేసి, పుణ్యతీర్థాలలో స్నానం చేయడం అనేది అర్జునుని కాపాడిన శ్రీకృష్ణుడు తనను కటాక్షించటానికి ముందు భక్తునకు తగిన స్థితి. శ్రీమద్ద్వారకానాథుడైన ఆ శ్రీకృష్ణుడు తన కైంకర్యాన్ని మనకు అనుగ్రహించిన తరువాత ఇక ఏమి కొఱత ఉన్నది? ఏ తీర్థాలలోను స్నానమాన నక్కఱలేదు; తపస్సును చేయనక్కఱ లేదు.

అఙ్గామ్బాట్టు -: అవతారికై : పూర్వవాక్యత్తాల్ ప్రతిపాదిక్కప్పడుగిఱ సిద్ధోపాయవరణమ్, ఇతరోపాయపరిత్యాగత్తై అఙ్గమాగ ఉడైత్తా యిరుక్కు మెన్నుమత్తై, చరమశ్లోక ముఖత్తాలే అఱిన్దు, ఉపాయరూపప్రవృత్తిగళిల్ అన్వయమఱ్ఱు, స్వరూపాను రూపమాగ అవన్ పక్కలిలే న్యస్తభరరాయ్, స్వీకారకార్యత్తై అనుసంధిత్తిరుక్కు మవర్గళ్ పడియై స్వనిష్ఠానురూపేణ అరుళిచ్చెయ్గిఱార్.

వ్యాఖ్యానమ్ : **(తీర్త్తముయన్ఱాడువదుమ్)**- గంగా, యమునా, సరస్వతీ, ప్రభృతిగళాన తీర్థఙ్గళిలే, పాపక్షయార్థమాగ పెరియ ఉద్యోగత్తోడే అవగాహిక్కు మదువుమ్. తీర్థఙ్గళానవై- పావనజలఙ్గళ్. ముయఱ్చియావదు- ఉద్యోగమ్. ఆడుగైయావదు- అవైఱ్ఱిలే మఱు ననైయ పుగున్దు ముழுగుగై.

**(శెయ్ తవఙ్గళ్ శెయ్నవుమ్)**- "ఊన్ వాడవుణ్ణాదు", "పొరుప్పిడైయే నిన్ఱుమ్", "వీழ்కని మూழ்ఇలైయు మెన్నుమివైయే నుగర్న్దు" ఇత్యాదిగళిలే శొల్లుగిఱపడియే, కాయశోషణార్థమాగ చ్చెయ్యప్పడుమ్ తపస్సుకళై చ్చెయ్యు మవైయుమ్, ఇదుదాన్, దానయాగాదిగళుక్కు ముపలక్షణమ్.

**(పార్త్తనై మున్ కాత్త పిరాన్ పార్ప్పదన్మున్)** - అదావదు - ఉపాయాంతరఙ్గళ్ ఎల్లా ముపదేశిక్క క్కేట్టు, అవైఱ్ఱినుడైయ దుష్కరత్వ త్తైయుమ్, స్వరూపవిరుద్ధత్వత్తైయుమ్ అనుసంధిత్తు, శోకావిష్టనాన అర్జుననై,

"సర్వధర్మాన్" ఇత్యాదిగళాలే, "పూర్వోక్తజ్గళాయిరున్దుళ్ల సాంగమాన సకల ధర్మజ్గళైయుమ్ సవాసనమాగవిట్టు, సౌలభ్యాదిగుణవిశిష్టనాన ఎన్నైయే నిరపేక్షో పాయమాగ ప్పఱ్ఱు," సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టనాన నాన్, ఉన్నుడైయ అజ్ఞత్వాదిగళై అనుసంధిత్తు, ఎన్ పక్కలిలే న్యస్తభరనాన ఉన్నై, మత్ప్రాప్తి ప్రతిబంధకసకలపాపజ్గళిల్ నిన్డుమ్ విడువిక్కక్కడవేన్. ఆనపిన్బు, శోకియాదే కొళ్" - ఎన్డు ఉపదేశిత్తు, మున్బు రక్షిత్తరుళిన మహోపకారకనానవన్ కటాక్షిత్తరుళువదఱ్కు మున్బు - ఎన్దై. ఇత్తాల్ - చరమశ్లోకార్థమ్ నెఞ్జిల్ పడువదఱ్కు మున్బు- ఎన్దపడి.

(శిర్ త్తువరై మన్నన్)- "పదినాఱాయిరవర్ తేవిమార్ పణి శెయ్యు త్తువరై ఎన్నుమదిళ్ నాయకరాగి వీఱ్ఱిరున్ద మణవాళర్" ఎన్గిఱపడియే, తనక్కు అనన్యార్హరాయ్, అన్యోపాయోపేయజ్గళిల్ అన్వయమఱ్ఱిరున్ద దివ్యమహిషి గళుక్కు నాయకనాయ్ క్కొణ్డు శ్రీద్వారకైక్కు నిర్వాహకనానవన్.

(అడియోమెన్ను వాழ్వు నమక్కేన్దప్పిన్)- అవనుక్కు నామ్ శేషభూతర్- ఎన్దఱిన్దు, స్వరక్షణార్థమాగ స్వప్రవృత్తియిల్ అన్వయమఱ్ఱిరుక్కై యాగిఱ సంపత్తై నమక్కు త్తన్దరుళిన పిన్బు "అడియో మె"న్దైయాలే, జ్ఞానానందజ్గళిలు జ్గాట్టిల్ ఆత్మావుక్కు శేషత్వమే అంతరంగనిరూపక మెన్నుమిడముమ్- "వాழ్వె"న్దైయాలే, ఇత్తై యఱియవే స్వయత్ననివృత్తి, స్వప్రయోజననివృత్తి సిద్ధిక్కైయాల్, ఇదువే ఆత్మావుక్కు సంపత్తు ఎన్నుమిడముమ్, "నమక్కేన్ద దప్పిన్" - ఎన్దైయాలే, అనాదికాల మిస్సంబంధమ్ ఉణ్డాయిరుక్కచ్చెయ్దే, ఇత్తై యిழన్దు కిడన్దనమక్కు, ఇప్రతిపత్తి పిఱన్దదుమ్ అవనరుళాలే ఎన్నుమిడముమ్ శొల్లుగిఱదు. ఇప్పడి అవన్ ఇవ్వాழ్వై నమక్కు త్తన్దరుళిన పిన్బు.

(ఎన్న కుఱై వేణ్డు మిని) - అదావదు - ఇని మేలుళ్ళ కాలమ్, ఉపాయో పేయజ్గళిల్ ఒన్డు నిమిత్తమాగక్కుఱై పడవేణుమో? ఎన్దై. ఇత్తాల్ అవన్ "మా శుచః" ఎన్దరుళిచ్చెయ్దపడియే, నజ్కారియత్తిల్ నామ్ కరైచ్చల్ అఱ్ఱు, నిర్భరరాయిరుక్కుమత్తనైయన్డో - ఎన్దదాయిఱ్ఱు. "తావద్గచ్ఛేత్తు తీర్థాని



సరితశ్చ సరాంసి చ, యావన్నాభూచ్చ భూపాల! విష్ణుభక్తిపరం మనః" ఎన్డు శ్రీవిష్ణుధర్మత్తిల్ శొల్లప్పట్ట వచనముమ్, "కిం తస్య దానైః కిం తీర్థై కిం తపోభిః కి మధ్వరైః, యో నిత్యం ధ్యాయతే దేవం నారాయణమనన్యధీః' ఎన్డు ఇతిహాస సముచ్చయత్తిల్ శొల్లప్పట్ట వచనముమ్, ఇప్పాట్టిల్ పూర్వవాక్యత్తిల్ శొల్లప్పట్ట అర్థత్తుక్కు సంవాదమాగ అనుసంధేయమ్. ఇదఱ్కు ప్పొరుళ్ - "నిన్ద వానిల్లా నెఞ్జు" ఎన్గిఱపడియే ఒన్డిలుమ్ నిలై నిల్లామల్ ఓడిత్తిరియు మనస్సానదు, యాదోరళవు మివ్వాత్మావుక్కు ప్రాప్యముమాయ్, ప్రాపకముమాయిరుక్కు వన్‌పక్కల్, భక్తియిల్ ఊఱ్ఱముడైత్తాగాదు, అవ్వళవుమ్, సరిత్తుక్కళుమ్ సరస్సుక్కళుమాయ్‌క్కొణ్డు, పావనమాన తీర్థజ్గళై క్కుఱిత్తు ప్పోవానెన్డుమ్- యావనొరువన్, అన్యవిషయత్తిల్ మనస్సఱ్ఱు, ద్యోతమానాది-గుణయుక్త నాయ్, నారశబ్దవాచ్యమాన చేతనసమూహత్తుక్కు ఉపాయోపేయజ్గళిరణ్డుమ్ తానాగైయాలే, నారాయణ శబ్దవాచ్యనానవనై సార్వకాలము మప్పడియే అనుసంధియా నిఱ్కుమవనుక్కు, దాన, తీర్థ, తపోధ్వరజ్గళాల్ ఎన్న ప్రయోజన ముణ్డు? ఎన్డుమ్ శొల్లిఱ్ఱితే. ఆగైయాల్ ఇవై సంవాదమాగ క్కుఱై యిల్లై.

ఐదవ పాశురం :- అవతారిక : ద్వయంలోని పూర్వవాక్యంలో చెప్పబడ్డ సిద్ధోపాయమనే భగవంతుని ఉపాయంగా ఆశ్రయించడం అన్యోపాయాలను విడచిపెట్టడమనే దానిని అంగంగా కల్గినదనే విషయాన్ని గీతంలోని చరమశ్లోకంలోనే (18-36) తెలిసికొని, అన్యోపాయాలనే కర్మ జ్ఞాన భక్తి యోగాల సంబంధం లేకుండా స్వరూపానికి తగినట్లుగా భగవానునివద్ద స్వరక్షణభారాన్ని సమర్పించినవారై, తాము భగవానుని ఉపాయంగా ఆశ్రయించి ఉండడమనే శరణాగతియే చాలు (పర్యాప్తం) - అని భావించేవారి స్వభావాన్ని తాము అందులో నిష్ఠ కల్గి ఉన్న విషయాన్ని తెలుపడంద్వారా ఈ పాశురాన్ని పల్కుతున్నారు.

వ్యాఖ్య : (తీర్త్త ముయన్ఱాడువదుమ్)- గంగ, యమున, సరస్వతి మొదలైన పుణ్యానదులలో పాపాలు తీరడంకోసం గొప్ప ప్రయత్నంతో స్నానం చేయడం కూడా - అని అర్థం. తీర్థాలంటే- మానవుని పరిశుద్ధునిగా చేసే జలప్రదేశాలు. "ముయఱ్చి"- అంటే- ప్రయత్నం. అంటే- ఆ తీర్థాలుండే

చోటుకు పోవాలని ప్రయత్నించడం. **"ఆడుకై"** అంటే -వాటిలో లోతుగా దిగి మునగడం.

**(శెయ్దవర్కళ్ శెయ్వనవుమ్)- "ఊన్ వాడ ఉణ్ణాదు ఉయిర్ కావలిట్టు ఉడలిల్ ప్పిరియా ప్పులనైన్దుమ్ నొన్దు తామ్ వాడ వాడ త్తవమ్ శెయ్యవేణ్డా"** (పెరియ తిరు-3-2-1) (శరీరం కృశించేటట్లుగా భుజించడం మానివేసి, ప్రాణాలకు కావలిపెట్టి, శరీరాన్ని విడువకుండా ఉండే పంచేంద్రియాలు క్లేశపడి, తాము క్లేశపడేటట్లు తపస్సు చేయనక్కరలేదు. అని, **"పొరుప్పిడైయే నిన్ఱుమ్ పునల్ కుళిత్తుమ్.... ఐన్దు నెరుప్పిడైయే నిఱ్కవుమ్ నీర్ వేణ్డా"** (మూన్ఱామ్ తిరువన్దాది-70) (పర్వతాలపై నిలచి, జలంలో స్నానమాడి... పంచాగ్నుల మధ్య మీరు నిలువనక్కరలేదు) అని, **"ఓర్ వన్నెఞ్జైమై వేణ్డువోర్ వీழ్కనియుమ్ ఊழ్లైయుమ్ ఎన్నుమ్ ఇవైయే నుకర్న్దు ఉడలుమ్ తామ్ వరున్ది"** (పెరియ తిరుమడల్-12) (అద్వితీయమైన మోక్షమార్గాన్ని పొందదలచినవారు చెట్టునుండే రాలే పండ్లను, రాలే ఆకులను మాత్రమే భుజించి, శరీరాన్ని కృశింపచేసికొని) అని చెప్పే రీతిలో శరీరాన్ని శ్రమపెట్టుకొని చేయబడే తపస్సు లను చేయడం - అని భావం. ఇక్కడ తపస్సులనుగూర్చి పల్కడం- దానం, యాగం మొదలైన వానినికూడా ఉపలక్షణ ప్రక్రియలో తెల్పుతుంది.

**(పార్త్తనైతన్ కాత్తపిరాన్ పార్ప్పదన్ మున్)**- దీని భావం ఏమంటే- అన్యోపాయాలైన కర్మయోగం, భక్తియోగం మొదలైన సాధ్యోపాయాలు అన్నిటిని ఉపదేశించదానికి, అవి అనుష్ఠించడానికి అరుదైనవి- అని, పరమాత్మకు శేషమై ఉండే జీవాత్మ స్వరూపానికి విరుద్ధమైనవి- అని తలచి, మనస్సులో మిక్కిలి విషాదాన్ని పొందిన అర్జునునకు **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః"** (గీత-18-66) (పలు సాధనాల రూపంలోని ధర్మాలను అన్నిటిని సవాసనగా విడచి, నన్ను ఒక్కని మాత్రమే ఉపాయంగా ఆశ్రయించు. (నిశ్చయించుకో) నేను నిన్ను అన్ని పాపాలనుండి విడిపిస్తాను. శోకించకు) - అనే చరమశ్లోకంలో, "గీతలో ఇంతవరకు చెప్పబడ్డ కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం మొదలైన సాధనాలను, వాటి అంగాలను పూర్తిగా విడచి పెట్టి, సౌలభ్యసౌశీల్యాది గుణాలతో కూడిన నన్నే దేనిని ఎదురు చూడని నిరపేక్షోపాయంగా ఆశ్రయించు. సర్వజ్ఞత్వ (అన్నిటిని తెలిసి ఉండడం), సర్వశక్తిత్వ (ఏ కార్యాన్ని అయిన చేయగల్గిన శక్తిని కల్గి ఉండడం) మొదలైన మహిమలను కల్గిన నేను, అజ్ఞత్వ- అశక్తత్వాది లోపాలను కల్గిన నిన్ను తలచి, నన్ను శరణు పొందిన నిన్ను, నన్ను పొందడానికి అంతరాయంగా ఉండే అన్ని పాపాలనుండి విడిపిస్తాను. అందువల్ల నీవు శోకించకు- అని ఉపదేశించి, పూర్వం రక్షించి, గొప్ప ఉపకారం చేసినవాడు కటాక్షించడానికి ముందే -అని భావం. చరమశ్లోకార్థం మనస్సులో నిలువడానికి ముందు - అని సారం.



**(శీర్త్తువరై మన్నవన్)- "పదినాఱాయిరవర్ దేవిమార్ పణి శెయ్య, తువరై యెన్నుమ్ అదిల్ నాయకరాకి వీఱ్ఱిరున్ద మణవాళర్"** (పెరియాழ్వార్ తిరు-4-9-4), (పదహారువేల మంది దేవేరులు కైంకర్యం చేయగా, ద్వారక- అనే నగరంలో నాయకుడై వేంచేసి ఉండే పెండ్లికొడుకు) అని పల్కిన రీతిలో, తదేకశేషభూతులై, అన్యోపాయాలలో, అన్యప్రయోజనాలలో సంబంధం లేకుండా ఉండే దివ్యదేవేరులకు నాయకుడై, గొప్ప సంపద నిండి ఉండే ద్వారకానగరికి నాయకుడై ఉండేవాడు.

**(అడియోమెన్నుమ్ వాழ్వు నమక్కు ఈన్దదఱ్పిన్)**- అతనికి మనం శేషభూతులమై ఉన్నాము - అనే విషయాన్ని తెలుసుకొని, తమను కాపాడు కోవడంకోసం తమకు ప్రయత్నించకుండా ఉండడమనే సంపదను మనకు అనుగ్రహించిన తరువాత - అని భావం. **"అడియోమ్"** అని అన్నందున జ్ఞానం, ఆనందం మొదలైనవాని కంటే జీవాత్మకు భగవానుని పట్ల శేషభూతుడై ఉండడమే ముఖ్యమైన లక్షణం - అనే అర్థం, **"వాழ్వు"** అని అన్నందున దీనిని తెలిసిన తరువాత, తమ కోసంగా ఏదయినా ఒక ప్రయోజనాన్ని అపేక్షించడం, దాని కోసం ప్రయత్నించడం - అనేది తొలగినందున, ఇదే ఆత్మకు సంపద - అనే అర్థం, **"నమక్కు ఈన్దదఱ్పిన్"** అని అన్నందున భగవానునితో ఉండే సంబంధం అనాదికాలంగా ఉన్నప్పటికీ, దానిని పోగొట్టు కొన్న మనకు ఆ (శేషత్వ) భావన కల్గడం కూడా ఆ స్వామి అనుగ్రహంవల్లనే-

అనే అర్థం చెప్పబడుతున్నవి. ఈ రీతిలో భగవానుడు ఈ ఉజ్జీవనాన్ని మనకు అనుగ్రహించిన తరువాత- అని ఈ ప్రయోగతాత్పర్యం.

**(ఎన్న కుఱై వేణ్డుమ్ ఇని)** - దీని భావం ఏమంటే- ఇక రాబోయే కాలం అంతా ఉపాయాన్ని గూర్చి, ప్రాప్యాన్నిగూర్చి మనం కొఱతపడవలసి ఉన్నదా? అని. దీనివల్ల అతడు చరమశ్లోకంలో **"మా శుచః"** అని పల్కిన రీతిలోనే, మన కార్యంలో మనం ఏమాత్రం విచారం లేకుండా, ఏ బాధ్యతను వహించకుండా ఉండవలసినదే- అని భావం. **"తావద్గచ్ఛేత్తు తీర్థాని సరిత శ్చ సరాంసిచ, యావన్న భూచ్చ భూపాల. విష్ణుభక్తిపరం మనః"** (విష్ణుధర్మమ్) - (రాజా! మనస్సు ఎంతవరకు విష్ణుభక్తిలో ఆసక్తి లేకుండా ఉంటుందో అంతవరకే పుణ్యతీర్థాల లోను, నదులలోను, మడుగులలోను స్నానమాడడానికి వెళ్ళాలి) అని విష్ణుధర్మంలో చెప్పబడిన వాక్యం, **"కిం తస్య దానైః కిం తీర్థైః కిం తపోభిః కిమధ్వరైః, యో నిత్యం ధ్యాయతే దేవం నారాయణ మనన్యధీః"** (ఇతిహాస సముచ్చయమ్)- (ఎవడు నారాయణునే, వేఱు దేనిలోను మనస్సు నిలుపకుండా, ఎల్లప్పుడు ధ్యానిస్తున్నాడో, అతనికి దానాలు, తీర్థస్నానాలు, తపస్సులు, యజ్ఞాలు మొదలైనవానితో ఏమి పని?) అని ఇతిహాస సముచ్చయంలో చెప్పబడిన వాక్యం, ఈ పాశురంలోని పూర్వవాక్యంలో చెప్పబడిన అర్థానికి ప్రమాణంగా అనుసంధేయం. దీనికి అర్థం ఏమంటే - **"నిన్ఱవా నిల్లా నెఞ్జినై యుడైయేన్, ఎన్ శెయ్‌కేన్?"** (స్థిరంగా నిలచి ఉండని మనస్సును కలవాడను. ఏమి చేయను?) (పెరియతిరుమొழி-1-1-9) అని తిరుమంగై ఆழ்వార్లు పల్కినట్లుగా, దేనిలోను స్థిరంగా నిలచి ఉండకుండా, ఎల్లప్పుడు చలిస్తూ ఉండే మనస్సు, ఎంతవరకు ఈ ఆత్మకు ప్రాప్యమై ఉపాయమై ఉండే భగవంతుని పట్ల భక్తిని, గౌరవాన్ని **(ఊనికను)** కల్గి ఉన్నదో, అంతవరకే నదులు, మడుగుల రూపంలో పరిశుద్ధతను కల్గించే తీర్థాలను ఉద్దేశించిపోవాలి - అని, ఎవనికి విషయాంతరాలలో మనస్సు ఆసక్తిని పొందకుండా, దేవశబ్దానికి అర్థమైన ప్రకాశించడం మొదలైన గుణాలతో కూడినవాడై, నారాలనబడే జీవసమూహానికి ఉపాయమై, ప్రాప్యమై ఉండేవాడు తానే కనుక, నారాయణుడనబడేవానిని అన్ని కాలాలలోను ఉపాయంగా, ఉపేయంగా భావించేవానికి దానం, తీర్థం, తపస్సు, యాగం మొదలైన వానితో



ఏ ప్రయోజనం లేదు - అని తెలిపింది కదా! అందువల్ల, ఇక్కడ ప్రస్తావింపబడిన విష్ణుధర్మవచనం, ఇతిహాససముచ్చయ వాక్యం మొదలైనవి ఈ పాశురంలోని అర్థానికి ప్రమాణాలు కావడంలో అడ్డు లేదు.

6. **పుణ్డరీకైక్కేళ్వనడియార్, అప్పూమిశైయోన్**
**అణ్డమొరు పొరుళా ఆదరియార్, - మణ్డి**
**మలఙ్గ వొరు మీన్ పురణ్డమాత్తిరత్తాల్, ఆర్త్తు**
**క్కలఙ్గిడుమో మున్నీర్ క్కడల్.**

పుణ్డరీకై క్కేళ్వన్ = లక్ష్మీవల్లభుని, అడియార్ = దాస్యంలో అభినివేశాన్ని కలవారు, అప్పూ మిశైయోన్ = శ్రియఃపతియొక్క తిరునాభీకమలంలో నుండి జన్మించిన బ్రహ్మయొక్క, అణ్డమ్ = బ్రహ్మాండాన్ని, ఒరు పొరుళా = ఒక వస్తువుగా (ప్రాప్యంగా), ఆదరియార్ = ఆదరించరు, ఒరు మీన్ = ఒకచేప, మణ్డి = మిక్కిలి ప్రయత్నించి, మలఙ్గ = స్థితి చెడి క్షోభను పొందేటట్లు, పురణ్డ మాత్తిరత్తాల్= పొర్లినంతమాత్రంలో మున్నీర్ క్కడల్ = వర్షపు నీరు, సముద్ర జలం, ఊట నీరు - అనే మూడు విధాలైన నీటిని కల్గిన సముద్రం, ఆర్త్తు = పెద్ద శబ్దంతో ఘోషించి, కలఙ్గిడుమో = కలతను పొందుతుందా?

లక్ష్మీనాథుని దాసులైన భాగవతోత్తములు ఆ బ్రహ్మయొక్క బ్రహ్మాండాన్ని కూడా ఒక ద్రవ్యంగా లెక్కించరు. ఒక చేప గంభీరంగా చూచి, "తన కింద, పైన ఉండే నీరు కలగి పోవాలి" అని పొర్లినంతలో మున్నీటిని (నదీజలం, ఊటనీరు, వర్షజలమనే మూడు విధాలైన నీటిని) కల సముద్రం తన స్థితిని పోగొట్టుకొని కలత పొందుతుందా?

ఆఱాయిప్పాట్టు -: అవతారికై : ఇప్పడి దుష్కరత్వాదిదోషదర్శనత్తాలే ఉపాయాంతరసంగ మఱ కూడిற்றாకిలుమ్, అనాదికాలమ్ శబ్దాదిగళిలే వాసనై పణ్ణిప్పోన్ద ఆత్మావుక్కు, ఉపేయాంతరమాన ఐశ్వర్యత్తై క్కణ్డాల్ ఆశై శెల్లాదొழிయుమో! అన్ద ఐశ్వర్యోద్రేకన్దాన్ ఇవనెఞ్జై క్కలఙ్గ పణ్ణాదో? ఎన్న, భగవద్దాస్యరసజ్ఞరానవర్ గళ్, ఐశ్వర్యత్తుక్కు మేలెల్లై యాన బ్రహ్మపదత్తైయుమ్ ఒరు పురుషార్థమాగ విరుమ్బార్‌గళ్. అదుదాన్ ఇవర్‌గళ్ నెఞ్జై కలక్కవుమాట్టాదు - ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ : (పుణ్డరీగైక్కేళ్వనడియార్) - పద్మోద్భవైయాయ్, పద్మవాసినియా యిరుక్కైయాలే, "పద్మినీ" యెన్ఱు తిరునామత్తై యుడైయవళాన పెరియ పిరాట్టియారుక్కు వల్లభనానవనుడైయ తిరువడిగళిల్ః శేషత్వమే తజ్గళుక్కు నిరూపమాగ ఉడైయవర్గళ్. ఇత్తాల్- "పణ్డైనాళాలే నిన్తిరువరుళుమ్ పజ్గయత్తాళ్ తిరువరుళుజ్గొణ్డు" ఎన్గిఱపడియే అవర్గళ్ ఇరువరుడైయవుమ్ విశేషకటాక్షత్తాలే తిరున్ది, తచ్ఛేషత్వైకనిరూపకరాయ్, తద్దాస్యైకరసరా యిరుక్కుమవర్గళ్-ఎన్ఱై.

(అప్పూమిశైయో నణ్డమొరుపొరుళా వాదరియార్) ఐశ్వర్యత్తుక్కు మేలెల్లైయాగ ప్రసిద్ధమాయ్, తిరునాభీకమలోద్భవనాన బ్రహ్మవినుడైయ ఆనందత్తుక్కు హేతువాయ్, చతుర్దశభువనాత్మకమాన అణ్డత్తై ఒరు శరక్కాగ ఆదరియార్గళ్. దేహాత్మాభిమానిగళుక్కుమ్, స్వతంత్రరుక్కుమిఱే, ఐశ్వర్యమ్ రసావహమాయ్క్కొణ్డు పురుషార్థమా యిరుప్పదు. భగవద్దాస్య మఱిన్దవర్గళుక్కు, విరసమాయ్, జుగుప్సావిషయమాయిరుక్కుమిఱే. ఆగైయాల్ అత్తై యాదరిప్పార్గళో!

అప్పడి శొల్లలామో? అన్ద ఐశ్వర్యత్తినుడైయ కిళర్ప్పమ్ తన్దన్నై ఆశైప్పడుమ్బడి ఇవర్గళ్ నెఞ్జై క్కలజ్గప్పణ్ణాదో? ఎన్ను మాకాంక్షైయిలే అరుళిచ్చెయ్గిఱార్, మేల్.

(మణ్డియిత్యాది) ఒరు మత్స్యమానదు, తన్ శక్తి ఎల్లావఱ్ఱోడుజ్గూడి, తళ్ళిక్కొణ్డు నిలైక్కొలైన్దు కలజ్గుమ్బడి, ఇడమ్ వలజ్గొణ్డు పురణ్డమాత్రత్తాల్, ఆఱ్ఱు నీర్, ఊఱ్ఱు నీర్, వర్షజల మెన్గిఱ జలత్రయయుక్తమాన సముద్రమానదు నిలైకొలైన్దు ఉకళిత్తుక్షుభితమామో! అన్ద మత్స్యత్తినుడైయ స్ఫురణత్తాల్. "అప్రమేయో మహోదధిః" ఎన్గిఱ సముద్రమ్ కలజ్గిలన్ఱో, ఐశ్వర్యత్తినుడైయ కిళర్త్తినుడైయ కిళర్త్తి కణ్డాల్ గంభీరమాన ఇవర్గళుడైయ హృదయమ్ కలజ్గువదెన్ఱు కరుత్తు. "బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం కిం లోభాయ మనస్వినః, శఫరీస్ఫురితేనాబ్ధేః క్షుబ్ధతా నైవ జాయతే" ఎన్నక్కడవదిఱే.



ఆఱవ పాశురం :- అవతారిక : ఈ విధంగా అనుష్ఠించడానికి అరుదై ఉండడం మొదలైన దోషాలను చూచి, అన్యోపాయాలలో సంబంధాన్ని తెంచుకొన్నా, అనాది కాలంగా శబ్దాదిలౌకిక విషయాలలో అలవాటుపడిన ఆత్మకు ఈ లోకంలో ప్రయోజనమై ఉండే సంపదను చూస్తే ఆశ కలుగకుండా ఉంటుందా? ఆ సంపత్తులోని పౌష్కల్యం ఇతని (ప్రపన్నుని) మనస్సును కలతను పొందించకుండా ఉంటుందా? అనే ప్రశ్న రాగా, భగవంతుని కైంకర్యం చేయడంలోని భోగ్యతను తెలిపినవారు ఆ సంపదకు మించిన బ్రహ్మాది పదవుల రూపంలోని సర్వైశ్వర్యా లను ఒక ఫలంగా లెక్కించరు. వారి మనస్సు కలత పొందదు కూడా'' అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (పుండరీకైక్కేళ్వన్ అడియార్) తామరపూవులో పుట్టినదై, అక్కడే నివసించేదై ఉన్నందున "పద్మినీ" (పుండరీకై) అనే తిరునామాన్ని కల్గినదైన లక్ష్మీదేవి యొక్క ప్రియవల్లభుని శ్రీచరణాలలో శేషభూతులై ఉండడమనే దానిని తమకు అసాధారణ లక్షణంగా కలవారు - అని అర్థం. దీనివల్ల "పణ్డై నాళాలే నిన్ తిరువరుళుమ్ పజ్గయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డు" (తిరువాయ్-9-2-1) (చిరకాలంగా నీ కరుణను, లక్ష్మీదేవి కరుణను పురస్కరించుకొని) అనే రీతిలో వారు వీరి (దివ్యదంపతుల) విశేష కటాక్షంవల్ల సంస్కరింపబడి, వారిద్దరికి శేషభూతులై ఉండడమే అసాధారణ లక్షణంగా కలవారై, దానినే భోగ్యంగా భావించేవారు - అని భావం.

(అప్పూమిశైయోన్ అణ్డమ్ ఒరు పొరుళా ఆదరియార్)- ఇహలోక సంపదకు, పరమావధి అనే కీర్తిని పొందినదై, భగవంతుని తిరునాభీకమలంలో జన్మించినవాడైన బ్రహ్మయొక్క ఆనందానికి కారణమైనదై, పధ్నాలుగు లోకాలను కల్గినదైన అండాన్ని కూడా ఒక వస్తువుగా లెక్కించరు. దేహాన్నే ఆత్మగా భావించేవారికి, తమ ఆత్మ స్వతంత్రమైనది- అని తలచేవారికిని కదా, ఈ లోకంలోని సంపద భోగ్యతను కల్గించేదై, ప్రయోజనమై ఉంటుంది. భగవానునకు శేషభూతుడై ఉండడాన్ని తెలిసినవారికి ఆ లౌకికసంపద రసహీనమై (భోగ్యత లేనిదై), గర్హించదగినదై ఉంటుంది కదా! అందువల్ల దానిని ఆశపడతారా?

ఆ విధంగా చెప్పవచ్చునా? ఆ సంపదయొక్క గొప్పతనం తాము ఆశపడేటట్లుగా వీరి మనస్సును కలత పొందించదా? అనే ప్రశ్న రాగా, దానికి బదులు పల్కుతున్నారు.

**(మణ్ణి మలఙ్గ ఒరు మీన్ పురణ్డ మాత్తిరత్తాల్ ఆర్త్తు క్కలఙ్గిడుమో మున్నీర్ క్కడల్)** - ఒక చేప, తన శక్తి అంతటితో సముద్రంలో పొర్లి, అటు ఇటు దొర్లినంత మాత్రంతో నదీజలం, ఊటనీరు, వర్షపు నీరు- అనే మూడు విధాలైన నీటిని కల్గినందున **"మున్నీర్"** అనే పేరును కల్గిన సముద్రం తన స్థితిలో కలత చెంది క్షోభను పొందుతుందా?, ఆ చేప పొర్లినందున **"సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి, ఖానితః సగరేణాయ మప్రమేయో మహోదధిః"** (రామా-యుద్ధ-19-31) (ప్రభువైన రాఘవుడు సముద్రాన్ని శరణాగతి చేయదగినవాడు. ఈ గొప్ప సముద్రం సగరునిచే తవ్వబడినది) అనే సముద్రం కలత పొందునపుడు కదా, లౌకిక ఆసంపదయొక్క గొప్పతనాన్ని చూచి, మిక్కిలి గంభీరమైన వీరి మనస్సు కలతను పొందుతుంది- అని భావం. **"బ్రహ్మాండమండలీమాత్రం కిం లోభాయ మనస్వినః, శఫరీస్ఫురితేనాబ్ధేః క్షుబ్ధతా నైవ జాయతే"** (భాగవతమ్-10-20-15) (బ్రహ్మాండాన్ని అంతటిని ఇచ్చినప్పటికీ, భగవానునిపట్ల అభినివేశాన్ని పొందిన మనస్సును కలవారు దానిని ఆశపడరు. ఒక చేప తుళ్ళినంత మాత్రంలో సముద్రం ఏమాత్రం క్షోభను పొందదు) అని చెప్పబడింది కదా!

7. **తోళార్ శుడర్త్తికిరి శఙ్గుడైయ శున్దరనుక్కు<br>ఆళానార్ మఱ్ఱొన్ఱిల్ అన్బు శెయ్యార్, - మీళా<br>ప్పొరువఱియ విణ్ణాట్టిల్ పోగమ్ నుగర్వార్క్కు,<br>నరకన్తో ఇన్దిరన్తన్ నాడు.**

తోళ్ ఆర్ = బాహువులలో నిండుగా చేరి ఉండే, శుడర్ తికిరి = జ్యోతి స్వరూపమైన చక్రాన్ని, శఙ్గుడైయ = పాంచజన్య శంఖాన్ని కల్గినవాడైనందున, శున్దరనుక్కు= కల్గిన అందాన్ని కలవానికి, ఆళానార్ = (ఆ అందంలో పరాజితులై), దాసులైనవారు, మఱ్ఱు ఒన్ఱిల్ = ఆ దాస్యం కంటే వేఱుదేనిలోను, అన్బు శెయ్యార్ = ఆశను కల్గి ఉండు, మీళా = ఈ లోకానికి తిరిగి రావడమనే పునరావృత్తి లేనిది, పొరు అరియ = ఉపమానరహితమైన, విణ్ణాట్టిల్ = పరమపదంలోని, పోకమ్ = మహానందాన్ని, నుకర్ నార్క్కు = అనుభవించాలనే ఆశను కల్గినవారికి, ఇన్దిరన్ తన్నాడు = ఇంద్రుని స్వర్గం, నరకమ్ అన్తో = నరకంతో సమానం కదా.

స్వామి భుజాలలో పొందికగా వేంచేసి ఉండి వెలిగే శ్రీసుదర్శనుని పాంచజన్యాన్ని కల్గిన సుందరునకు దాసులైనవారు ఆ దాస్యానికి మాఱుగా ఉండే ఏవిషయం లోను ఆదరాన్ని చూపరు. పునరావృత్తి లేనిది, సాటి లేనిది, అరుదైనది అయిన పరమపదంలో మహానందాన్ని అనుభవించడంలో కుతూహలాన్ని కలవారికి స్వర్గలోకం నరకంతో సమానం కదా!

ఏఴ్హామ్‌పాట్టు :- అవతారికై : దాస్యచ్చువడఱిన్దవర్గళ్, ఐశ్వర్యత్తుక్కు ఎల్లైయాన బ్రహ్మపదత్తై, విరుమ్బార్గళ్ - ఎన్ఱార్, కీఴ్. అవనఴ్హగిలే తోఱ్ఱు అడిమైపుక్కవర్గళ్, అన్యవిషయఙ్గళై ఆదరియార్గళ్- ఎన్గిఱార్, ఇదిల్.

వ్యాఖ్యానమ్ : **(తోళార్ శుడర్త్తికిరి శఙ్గుడైయ శున్దరనుక్కు)** - తిరుత్తోళోడే శేర్న్దిరున్దుళ్ళ తేజోరూపమాన తిరువాఴ్హియైయుమ్, శ్రీపాంచజన్యత్తైయు ముడైయనా గైయాలే వన్ద అఴ్హగైయుడైయవనుక్కు. "మనైప్పాల్ పిఱన్దార్ పిఱన్దెయ్‌దుమ్ పేరిన్బ మెల్లామ్ తుఱన్దార్, తొఴ్హుదార్ అత్తోళ్" ఎన్గిఱపడియే వెఱుమ్ పుఱత్తిలే ఆలత్తి వఴ్హిక్కవేణ్డుమ్బడి యిరుక్కిఱ తన్నఴ్హగాలే, ప్రాకృత సకలవిషయ సంగత్తైయుమ్ అఱుక్కవఱ్ఱాన తిరుత్తోళ్గళోడే, "అణియా రాఴ్హియుమ్ శఙ్గముమ్" ఎన్గిఱపడియే సర్వాభరణఙ్గళుమ్ తామేయాయ్ ప్పోరుమ్బడి యిరుక్కిఱ తిరువాఴ్హియైయుమ్, శ్రీపాంచజన్యత్తైయుమ్ ఏన్దుగైయాల్ వన్ద అఴ్హగుజమ్ కూడినాల్, అఴ్హగు ఇరట్టిత్తిరుక్కుమిఱే.

**(శున్దరనుక్కాళానార్)**- ఇప్పడి యిరున్దుళ్ళ అఴ్హగై యుడైయవనుక్కు. అవ్వళగుక్కు త్తోఱ్ఱు అడిమైయానవర్గళ్. "పుణ్డరీగై క్కేళ్వనడియార్"- ఎన్గిఱ విడత్తిలే శొన్న దాస్యమ్ స్వరూపప్రయుక్తమ్. ఇదు గుణకృతమ్, శున్దరనుక్కు"- ఎన్నుమ్, "ఆళానార్" - ఎన్నుమ్ శొల్లుగైయాలే, స్వరూప ప్రయుక్తమాన దాస్యత్తిలే నిఱ్కుమవర్గళైయుమ్, అప్పోదైక్కప్పోదు- అఴ్హగుక్కుత్తోఱ్ఱు, ఎఴ్హుదిక్కొడుక్కుమ్బడి పణ్ణుమిఱే, విషయవైలక్షణ్యమ్ ఆగైయాల్, ఇప్పోదు అఴ్హగుక్కు త్తోఱ్ఱు, అడిమైపుక్కవర్గళై చ్చొల్లుగిఱదు.

**(మఱ్ఱొన్ఱిల్ అన్బు శెయ్యార్)** అదావదు - అప్పడి యడిమై యానవర్గళ్. అవ్విషయత్తుక్కు అన్వయమాయిరుక్కుమ్ ప్రాకృత విషయఙ్గళిల్ ఒన్ఱిలుమ్, స్నేహమ్ పణ్ణార్గళ్ ఎన్ఱె. అప్రాకృతమాయ్, అతిమనోహరమా యిరుక్కుమ్ విషయత్తిల్ వాశి అఱిన్దు, అదిలే తోఱ్ఱిరుక్కుమవర్గళ్, అత్యాభాసమాయ్, అవిలక్షణమాన ప్రాకృతవిషయఙ్గళై విరుమ్బువార్గళో!

ఐహికవిషయఙ్గళిల్ అప్పడి యిరున్దాలుమ్, ఇత్తై ప్పఱ్ఱ అతివిలక్షణ మాన స్వర్గాద్యాముష్మిక విషయఙ్గళై క్కణ్డాల్, అదిల్ అన్బు శెల్లాదో? ఎన్ను మా కాంక్షైయిలే అరుళిచ్చెయ్గిఱార్, మేల్.

**(మీళా ప్పారువరియ విణ్ణాట్టిల్ పోగమ్ నుగర్వార్క్కు)** అదావదు- "న చ పునరావర్తతే న చ పునరావర్తతే" ఎన్గిఱపడియే పునరావృత్తి రహితమాయ్, అప్రాకృతమాయ్, శుద్ధసత్త్వమయమాయ్, నిరవధికతేజోరూపమా యిరుక్కై యాలే ఉపమానరహితమాయ్, "తదక్షరే పరమే వ్యోమన్" ఎన్గిఱ పడియే, పరమాకాశశబ్దవాచ్యమాన తిరునాట్టిళే భోగత్తై భుజిక్కవేణు మెన్నుమ్ అశై యుడైయవర్గళుక్కు.

**(నరకన్డో విన్దిరన్దన్ నాడు)** - అదావదు. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" ఎన్గిఱపడియే, పుణ్యక్షయమ్ పిఱన్దవాఱే ముగమ్ కీழ్ ప్పడ త్తళ్ళివిడుమ్బడి యిరుప్పదాయ్, ప్రాకృతమాన స్వసదృశలోకఙ్గళ్ పలవఱ్ఱైయు ముడైత్తాయ్, కర్మవశ్యచేతననాన ఇంద్రనుక్కు, భోగస్థానమాన నాడాయిరున్దుళ్ళ స్వర్గలోకమ్, నరకప్రాయమన్డో-ఎన్ఱె. ఇత్తాల్ ఇన్ద విభూతియిల్ భోగమ్, దుఃఖావహమా యిరుక్కుమెన్ద దాయిఱ్ఱు. "తత్పదం ప్రాప్తుకామా యే విష్ణో స్తేషాం మహాత్మ నామ్, భోగాః పురన్దరాదీనాం తే సర్వే నిరయోపమాః" ఎన్డు ఇవ్వర్థమ్ బ్రహ్మాణ్డ పురాణత్తిలే శొల్లప్పట్టదిఱే.

**ఏడవ పాశురం :-** అవతారిక : భగవంతునకు దాసభూతులై ఉండడంలోని భోగ్యతను తెలిసినవారు ఈ లౌకికసంపదకు చరమావధి అయిన బ్రహ్మపదవిని సైతం ఆశపడరు - అని గడచిన పాశురంలో పలికారు. అతని అందంలో జితులై, అతనికి దాసులైనవారు ఈ లీలావిభూతిలో ఉండే ఏ విషయాన్ని ఆశించరు- అని ఈ పాశురంలో అంటున్నారు.



వ్యాఖ్యానం :- **(తోళార్ త్తికిరి చ్చఙ్గుడైయ శున్దరనుక్కు)** చతుర్బాహువులను కల్గి ఉండి, జ్యోతిస్సమూహమైన శ్రీసుదర్శనచక్రాన్ని, శ్రీపాంచజన్యాన్ని కల్గినవాడైనందున కల్గిన అందాన్ని కల్గినవానికి - అని అర్థం. **"మనైప్పాల్ పిఱన్దార్ పిఱన్దెయ్దుమ్ పేరిన్బ మెల్లామ్ తుఱన్దార్ తొழுదార్ అత్తోళ్"** (ఇరణ్డామ్ తిరు-42) (భగవానుని ఆ బాహువులను నమస్కరించే వారు, సంసారంలో జన్మించినవారు పొందే అల్పానందాలని అన్నిటినీ గర్హిస్తారు) అనే రీతిలో శంఖచక్రాలను ధరించకపోయినా, (సహజంగా ఉండే అందంవల్ల కలిగే) దృష్టిదోషాన్ని పరిహరించవలసినట్లుండే తన అందంతో ప్రాకృతమైన (ఈలోకంలోని) అన్ని విషయాలలోని సంగాన్ని ఛేదించగల్గిన బాహువులతో **"అణియా రాழிయుమ్ శఙ్గముమ్"** (తిరువాయ్-8-3-6) (అందమైన ఆభరణంవంటి చక్రం, శంఖం) అనే రీతిలో అన్ని ఆభరణాల అందాన్ని వాటికి తానే కల్గించగల్గిన శంఖచక్రాలను ధరించినందున ఏర్పడిన అందం కూడా కలిస్తే, ఇక అందం రెండింతలుగా ఉంటుంది కదా!

**(శున్దరనుక్కు ఆళానార్)**- ఈవిధంగా ఉండే అందాన్ని కలవానికి ఆ అందంవల్ల పరాజితులై, వశులై, దాసులైన వారు- అని భావం. గడచిన ఆఱవ పాశురంలో **"పుణ్డరీకైక్కేళ్వన్ అడియార్"** అని మాత్రం పల్కినందున ఈ దాస్యం భగవానుడు శేషియై ఉండే స్వరూపంవల్ల కల్గినది. (భగవచ్ఛేషత్వ ప్రయుక్తమైనది.) **"శున్దరనుక్కు"** అని, **"ఆళానార్"** అని విశేషించి పల్కినందున, ఇక్కడ చెప్పబడే దాస్యం గుణాలను చూచి, దానికి జితులై, దాసులై ఉండే విషయాన్ని తెల్పుతున్నది. స్వరూపంతో శేషభూతులై ఉండే వారిని కూడా, అప్పటికప్పుడు కొత్తకొత్తగా స్ఫురించే తన అందంతో పరాజితులను చేసి తనకు దాసులుగా చేసికొంటుంది కదా! - భగవానుని వైలక్షణ్యం. అందువల్ల, ఇపుడు అందానికి పరాజితులై, దాసులైన వారిని ఈప్రయోగం తెల్పుతున్నది.

**(మఱ్ఱొన్ఱిల్ అన్బు శెయ్యార్)**- దీని భావం ఏమంటే? - ఆవిధంగా సర్వేశ్వరుని కల్యాణగుణాలను దర్శించి దాసులయ్యేవారు, ఆ స్వామిని తప్ప, మిగిలిన ప్రాకృత విషయాలలో దేనిలోని ఆసక్తిని కల్గి ఉండరు - అని. ప్రకృతిసంబంధం తీరినవారై, మిక్కిలి అందంగా ఉండే భగవద్విషయం యొక్క

గొప్పతనాన్ని తెలిసికొని, దానిచే జితులై ఉండేవారు, పైపైన తోచే గొప్పతనాన్ని కల్గినదై, వాస్తవానికి ఏమాత్రం గొప్పతనం లేనిదైన ఇహలోకవిషయాలను ఆశపడతారా?

ఈ లోకంలోని విషయాలను ఆశపడకపోయినా, వాటికంటే మిక్కిలి గొప్పవి అయిన స్వర్గాదిపారలౌకికఫలాలని చూస్తే, వాటిలో ఆశ కలుగదా ? అనే సందేహం కలుగగా, దానికి అనంతర భాగంలో బదులిస్తున్నారు.

**(మీళా ప్పారువరియ విణ్ణాట్టిల్ పోకమ్ నుకర్వార్క్కు)**- దీని తాత్పర్యమేమంటే - **"న చ పునరావర్తతే, న చ పునరావర్తతే"** (ఛాందోగ్య-8-15-1) (ఈ ముక్తపురుషుడు మళ్ళీ తిరిగి ఈలోకంలో రాడు. మళ్ళీ తిరిగి ఈ లోకంలోకి రాడు) అనే రీతిలో ఈలోకానికి మళ్ళీ తిరిగి రావడం అనేది లేనిదై, ప్రకృతిసంబంధం లేనిదై, శుద్ధ సత్త్వద్రవ్యంలో రూపొందినదై, సాటి లేని జ్యోతిస్స్వరూపమై ఉన్నందున ఉపమానరహితమై, **"యస్మిన్నిదం సంచ విశైతి విశ్వం యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః, తదేవ భూతం తదుభవ్యమా ఇదమ్ యదక్షరే పరమే వ్యోమన్"** (తైత్తి-నారా-1-2) (దేనిలో ఈ లోకం అంతా సంహారకాలంలో లోపల అణగి ఉన్నదో, సృష్టికాలంలో వ్యక్తమవుతున్నదో, దేవతలందఱు దేనిని ఆశ్రయిస్తున్నారో, ఆ పరబ్రహ్మమే పూర్వం ఉన్న వస్తువులకు అంతర్యామి. తరువాత ఉండబోయే వస్తువులకు అంతర్యామి, అదే నశించని పరమపదంలో ఉన్నది) అనే రీతిలో పరమాకాశమనబడే తిరునాడులో మహానందాన్ని అనుభవించాలి- అనే ఆశను కలవారికి.

**(నరకన్జో ఇన్దిరన్తన్నాడు)** - దీని భావం ఏమంటే - **"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి, ఏవం త్రయీధర్మ మను ప్రపన్నాః గతాగతం కామకామా లభంతే"** (గీత-9-21) (వారు, ఆ విశాలమైన స్వర్గసుఖాలను అనుభవించి, పుణ్యం నశించగానే మళ్ళీ తిరిగి మానవలోకాన్ని చేరుతారు. ఈ విధంగా (వేదాంతమైన ఉపనిషత్తులలోని అర్థాలను తెలియక) వేదం పూర్వభాగంలో తెలుపబడిన యాగాదిధర్మాలను మాత్రం అనుష్ఠించి, దానివల్ల పొందే స్వర్గం మొదలైనవానినే కోరి, అల్పమైనది, అస్థిరమైనది అయిన స్వర్గాదిసుఖాలను అనుభవించి, తిరిగివస్తున్నారు) అనే రీతిలో స్వర్గసుఖాలకు కారణమైన పుణ్యం తీరిపోగానే తలక్రిందులుగా కిందకు తోయబడేటట్లున్నదై, ప్రకృతిసంబంధం కల్గినలోకాలను పెక్కింటిని కల్గినదై, తనలో కల్గినదై, కర్మవశ్యుడైన ఇంద్రునకు పాలించి, ఆనందించే చోటైన స్వర్గలోకంకూడా నరకంతో సమానమైనది కదా - అని భావం. దీనివల్ల ఈ లీలావిభూతిలోని అనుభవం ఏదయినా అది దుఃఖాన్ని కల్గించేదై ఉంటుందని తెలుపబడింది. **"తత్పదం ప్రాప్తు కామాయే విష్ణో స్తేషాం మహాత్మనామ్, భోగాః పురందరాదీనాం తే సర్వే నిరయోపమాః"** (బ్రహ్మాండపురాణమ్) - విష్ణువుయొక్క పరమపదాన్ని పొందాలని కోరే మహాపురుషులకు ఇంద్రాదుల భోగాలన్నీ నరకప్రాయాలు) అని ఈ అర్థం బ్రహ్మాండపురాణంలో కూడా చెప్పబడింది కదా !

**8. ము*ఱ్ఱ* ప్పువన మెలా ముణ్ణ ముగిల్వణ్ణన్**
**క*ఱ్ఱై* త్తు*ళ్ళా*య్ శేర్ క్క*ళ*లన్ఱి, - మ*ఱ్ఱొ*న్ఱై**
**ఇచ్చియా అన్బర్ తనక్కెజ్ఞనే శెయ్దిడినుమ్,**
**ఉచ్చియాల్ ఏఱ్కు ముగన్దు**

పువనమ్ ఎల్లామ్ = అన్ని లోకాలను, ము*ఱ్ఱ* ఉణ్ణ = ప్రళయకాలంలో అంతటిని గ్రహించిన, ముకిల్ వణ్ణన్ = మేఘవర్ణుని, క*ఱ్ఱ* తు*ళ్ళా*యాయ్ శేర్= దట్టంగా ఉండే తులసి చేరిన (సమర్పింపబడిన), క*ళ*లన్ఱి = శ్రీచరణాలు తప్ప, మ*ఱ్ఱు* ఒన్ఱై = వేఱొక ప్రయోజనాన్ని, ఇచ్చియార్ అన్బర్ = ఆశించని భక్తిని కలవారు, తనక్కు= స్వామి అయిన తనకు, ఎజ్ఞనే శెయ్దిడినుమ్ = ఏవిధంగా చేసినా (సమర్పించినా), ఉకన్దు = తాను ఆనందాన్ని పొంది, ఉచ్చియాల్ ఏఱ్కుమ్= శిరస్సుతో గ్రహిస్తాడు.

సకలలోకాలను పూర్తిగా తన ఉదరంలో పెట్టుకొని రక్షించినవాడు, నల్లని మేఘవర్ణంవంటి వర్ణాన్ని కలవాడైన భగవానుని తులసీమాలికలచే అలంకరింపబడ్డ శ్రీచరణాలను తప్ప వేఱు దేనినీ కోరకుండా ఉండే భక్తులు, స్వామి అయిన అతడు తనకు వారు ఏసేవను ఏవిధంగా చేసినా దానిని మనస్సులో ఆనందించి శిరసా వహిస్తాడు.

ఎట్టామ్పాట్టు :- అవతారిగై : అనన్యప్రయోజనరాయ్క్కొణ్డు, తన్ పక్కల్ ప్రేమయుక్త రానవర్గళ్ అడిమై శెయ్యుమిడత్తిల్, యేదేను మొరుపడి శెయ్దాలుమ్, అవన్ అత్తై ఉగన్దు శిరసావహిక్కు మెన్గిఱార్.

వ్యాఖ్యానమ్:- (ము***ఱ్ఱ*** పువనమెల్లా ముణ్డ ముగిల్వణ్ణన్)- ప్రళయత్తిల్ అ***ழి***యామే, సకలలోకఙ్గళైయు మొన్టు మొ***ழి***యామల్ తిరువయి***ఱ్ఱి***లే వైత్తు నోక్కిఱదు, తన్ పేఱెన్నుమిడమ్ వడివిల్ పుగరిలే తో***ఱ్ఱు***మ్బడి యిరున్ద కాళమేఘనిభమాన వడివైయుడైయవన్. ఇప్పోదు ఇదై చ్చొల్లుగిఱదు, "తాయిరుక్కుమ్ వణ్ణమే ఉమ్మైత్తన్ వయి***ఱ్ఱి***రుత్తి యుయ్యక్కొణ్డాన్" ఎన్గిఱపడియే ఆపద్దశైయిలే అఖిలలోకఙ్గళైయుమ్, అవై యఱియాదిరుక్క, త్తాన్ అఱిన్ద సంబంధమే హేతువాగ వయి***ఱ్ఱి***లే వైత్తు రక్షిత్తదు, తన్ పేఱెన్ను మిడమ్ తన్ వడివిలే తో***ఱ్ఱు***మ్బడి యిరున్దవన్. ఇత్తాల్ - అనన్యప్రయోజన రాయ్, త్తన్ పక్కల్ ప్రేమయుక్తరానవర్గళ్, స్వవిషయత్తిల్ పణ్ణుమ్ శేషవృత్తిగళై ఆదరిత్తుక్కైక్కొళ్ల మెన్నుమిడమ్ తో***ఱ్ఱు***గైక్కాగ.

(క***ఱ్ఱై*** త్తు***ழా***య్ శేర్ క్క***ழ***లన్ఱి)- తన్నిలత్తిలుఙ్గాట్టిల్, తిరుమేనియోట్టై స్పర్శత్తాలే, "త***ழை***క్కుమ్ తు***ழా***య్" ఎన్గిఱపడియే, త***ழై*** త్తిరున్దుళ్ళ తిరుత్తు***ழా***యోడే శేర్న్దిరున్దుళ్ళ తిరువడిగళై యొ***ழి***య. ఇదుదాన్ తిరువడి గళిల్ ఒప్పనైక్కెల్లామ్ ఉపలక్షణమ్.

(మ***ఱ్ఱొ***న్ఱై యిచ్చియా వన్బర్)- ఇప్పడి పరమభోగ్యమాన ఇత్తిరువడిగళై యొ***ழి***య, వేఱొరు ప్రయోజనత్తై ఇచ్చియాదపడియాన ప్రేమముణ్డానవర్గళ్. ప్రయోజనాంతరపరరాయ్, కించిత్కరిప్పార్. "దేహి మే దదామి తే" ఎన్గిఱ పడియే, కొడుత్తు క్కొళ్ళుగైక్కిఱే కించిత్కరిప్పదు. అఙ్గనన్నిక్కే, "ఇన్దు వన్దిత్త నైయుమ్"ఇత్యాదిప్పడియే కొణ్డత్తుక్కు క్కైక్కూలి క్కొడుక్కుమ్బడియాన అనన్యప్రయోజన భక్తిరానవర్గళ్.

(తనక్కెఙ్గనే శెయ్దిడినుమ్)- వగుత్త శేషియాన తనక్కు అడిమై శెయ్యు మిడత్తిల్, ప్రేమపరవశరాయ్క్కొణ్డు, అక్రమమాగవాదల్, సక్రమమాగవాదల్- ఎప్పడి శెయ్యిలుమ్.



(ఉచ్చియాలేఱ్కు ముగన్దు) - ప్రీతనాయ్ క్కొణ్డు శిరసావహిక్కుమ్. ఎఙ్గనే శెయ్దిడినుమ్ ఉచ్చియాలేత్క్కొయావదు- ఇవన్ కాలాలే పొగట్టవ***ఱ్ఱై***, అవన్ తలైయాలే యేత్కై, "యాః క్రియా స్సంప్రయుక్తాస్స్యు రేకాంతగతబుద్ధిభిః, తా స్సర్వా శ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్" (భారతే-మోక్షధర్మే) ఎన్నక్కడ వదిఱే.

ఎనిమిదవ పాశురం :- అవతారిక : అన్యప్రయోజనాలను వేనినీ కాంక్షించనివారై, తనపట్ల ప్రేమను (భక్తిని) కలవారు, దాస్యం చేసేటపుడు దానిని ఏరీతిలో చేసినా, భగవానుడు ఆ సేవను ఆనందంతో శిరస్సుతో పరిగ్రహిస్తాడు- అని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (మ***ఱ్ఱ*** పువనమెల్లామ్ ఉణ్డ ముకిల్వణ్ణన్)- ప్రళయజలం లోకాలను ముంచి వేయబోయినపుడు, లోకాలను అన్నిటిని, అవి నశించని రీతిలో, దేనినీ విడువకుండా, మింగి, తన ఉదరంలో పెట్టుకొని రక్షించడం అనేది స్వప్రయోజనం- అని తన తిరుమేనిలోని కాంతిద్వారా స్ఫురించేటట్లుగా ఉండే (మెఱిసే) కాలమేఘంవంటి తిరుమేనిని కలవాడు - అని భావం. ఇపుడు ఈ వృత్తాంతాన్ని ప్రస్తావించడం - **"తాయిరుక్కుమ్ వణ్ణమే ఉమై త్తన్ వయి*ఱ్ఱి*రుత్తి ఉయ్యక్కొణ్డాన్"** (పెరియతిరుమొళి-11-6-6) (తల్లివలె మిమ్ములను తన కడుపులో పెట్టుకొని రక్షించాడు) అనే రీతిలో ఆపత్కాలంలో అన్ని లోకాలను, అవి తన సొత్తు అనే విషయాన్ని అవి తెలియక పోయినా, తాను ఆ విషయాన్ని గ్రహించి, ఆ స్వస్వామి భావసంబంధం కారణంగా తన ఉదరంలో పెట్టుకొని రక్షించడం అనేది తన ప్రయోజనం- అని తన తిరుమేనిలో స్ఫురించేటట్లుగా ఉండేవాడు - అనే భావాన్ని స్ఫురింప జేయడంకోసం ఇందువల్ల, అన్యప్రయోజనాన్ని ఆశించనివారై, తనపట్ల భక్తిని కలవారు తన విషయంలో చేసే కైంకర్యాలను ఆదరంతో సర్వేశ్వరుడు స్వీకరిస్తాడు -అని తెలుస్తున్నది.

**(క*ఱ్ఱై*త్తు*ழా*య్శేర్ క*ழ*లన్ఱి)**- తాను మొలిచిన చోట కంటే భగవానుని తిరుమేనిలో మాలగా రూపొందిననాడు **"త*ழై*క్కుమ్ తు*ழా*య్"** (పెరియ

తిరువన్దాది-39) (ఏపుగా పెరిగే తులసి) అనే రీతిలో మిక్కిలి వికాసాన్ని పొందే తులసితో చేరి ఉండే శ్రీచరణాలను తప్ప - అని భావం. ఇక్కడ తులసిని పల్కడం భగవానుని శ్రీచరణాలలో ఉండే మిగిలిన భూషణాలకు అన్నిటికి ఉపలక్షణం.

**(మ*ఱ్ఱొ*న్ఱై ఇచ్చియా అన్బర్)** - ఈవిధంగా చాలా భోగ్యమైన శ్రీచరణాలను తప్ప, వేఱొక ప్రయోజనాన్ని ఆశపడని రీతిలోని భక్తిని కలవారు. అన్యప్రయోజనాలను ఆశించేవారై, భగవత్కైంకర్యాన్ని చేసేవవారు **"దేహి మే దదామి తే"** (యజుర్కాండమ్-**1-50**) (దేవా! నీవు నాకీ ఫలాన్ని ప్రసాదించు. నేను నీకు యాగంలో హవిస్సును సమర్పిస్తాను) అనే రీతిలో, ఒక వస్తువును గ్రహించడం కోసం కదా ఇంకొక వస్తువును ఇచ్చి కైంకర్యాన్ని చేస్తారు. ఆ రీతిలో కాకుండా, **"ఇన్ఱు వన్దు ఇత్తనైయుమ్ అముదుశెయ్దిడప్పెఱిల్, నాన్ ఒన్ఱు నూఱాయిరమాక క్కొడుత్త ప్పిన్ను మాళుమ్ శెయ్వన్"** (నాచ్చియార్-తిరు-**9-7**) (నేనిపుడు సమర్పించే దీనిని అంతా ఆరగిస్తే, నేను దీనికి నూరురెట్లుగా సమర్పించి ఇంకా కైంకర్యం చేస్తాను) అనే క్రమంలో తన కైంకర్యాన్ని స్వామి స్వీకరించడానికి కూలిగా, ఇంకా ఇంకా పలు విధాలైన సేవలను చేసే రీతిలోని ఏ ప్రయోజనాన్ని కోరని భక్తిని కలవారు.

**(తనక్కు ఎజ్గనే శెయ్దిడినుమ్)-** స్వరూపానుగుణమైన స్వామియైన తనకు కైంకర్యం చేసేటపుడు భక్తితో కూడినవారై, సంబంధం లేకుండానో, లేక సంబంధపూర్వకంగానో- ఏవిధంగా చేసినా,

**(ఉచ్చియాల్ ఏఱ్కుమ్ ఉకన్దు)-** ఆనందంతో కూడినవాడై, శిరస్సుతో పరిగ్రహిస్తాడు. ఏవిధంగా చేసినా శిరస్సుతో పరిగ్రహించడమంటే - ఇతడు కాలితో ఇచ్చినవానిని కూడా అతడు తలతో స్వీకరించడం. **"యా క్రియాః సంప్రయుక్తా స్స్యు రేకాంతగతబుద్ధిభిః, తా స్సర్వాః శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్"** (భారతం-మోక్ష- **353-44**) (భగవానుని ఒక్కని విషయంలోనే మనస్సు లగ్నమై ఉండేవారు చేసే మంచి కార్యాలను అన్నిటిని భగవానుడు స్వయంగా తన శిరస్సుతో స్వీకరిస్తాడు) అని చెప్పబడిందికదా !



**9. ఆశిలరుళాల్ అనైత్తులగుమ్ కాత్తళిక్కుమ్,**
**వాశ మలరాళ్ మణవాళన్, – తేశు పొలి**
**విణ్ణాట్టిల్ శాల విరుమ్బుమే, వేఱొన్ఱై**
**ఎణ్ణాదార్ నెఞ్జత్తిరుప్పు**

ఆశుఇల్ = దోషం లేని, అరుళాల్ = కరుణతో, అనైత్తు ఉలకమ్ = అన్ని లోకాలను, కాత్తు = రక్షించి, అళిక్కుమ్ = (వారు వారుకోరిన) మనోరథాలను అనుగ్రహించే, వాశ మలరాళ్ మణవాళన్ = సువాసవను కల తామరపూవును నివాసస్థానంగా కల లక్ష్మీదేవి వల్లభుడు, వేఱు ఒన్ఱై = తనకంటే వేఱొక ప్రాప్యాన్ని, ఎణ్ణాదార్ = కోరనివారి, నెఞ్జత్తు = హృదయంలో, ఇరుప్పు = ఉండడం, తేశు పొలి= జ్యోతిర్మయమైన, విణ్ణాట్టిల్ = పరమపదంలో కంటే, శాల = ఎక్కువ, విరుమ్బుమ్= ఆశపడతాడు.

ఏ దోషం లేని (సహజమైన) కరుణతో లోకాలను అన్నిటిని రక్షించేవాడు, సువాసనను నిండుగా కల తామరపూవులో అవతరించిన లక్ష్మీదేవికి వల్లభుడైన భగవానుడు తనను తప్ప వేఱొక విషయాన్ని భావించని పరమైకాంతుల మనస్సులో నివసించడం– పరమపదంలో నివసించడంకంటే మిక్కిలి ఆనందకరంగా భావిస్తాడు.

**ఒన్బదామ్ పాట్టు :- అవతారికై - అనన్యప్రయోజనరాయ్ అడిమైశెయ్యుమవర్గళ్ విషయత్తిల్, అవరుక్కుణ్డాన ఆదరత్తై అరుళిచ్చెయ్దార్, కీ*ழ்*. అవ్వళవన్ఱిక్కే, అనన్య ప్రయోజనరానవర్గళుడైయ హృదయత్తిల్ ఇరుప్పిల్, అవనుక్కుణ్డాన విరుప్ప మిరుక్కుమ్బడియై అరుళిచ్చెయ్కిఱార్, ఇదిల్.**

**వ్యాఖ్యానమ్ :- (ఆశిలరుళాల్) - నిర్హేతుకకృపైయాలే. ఆశు - కు*ఱ్ఱ*మ్, ఇల్ - అదిల్లామై. అరుళుక్కు క్కు*ఱ్ఱ*మావదు- సహేతుకమాన పోదొ*ழ்*ియ కార్యకరమాగామల్ ఇరుక్కై.**

(అనైత్తులగుమ్) - సమస్తలోకత్తైయుమ్. సహేతుకకృపైయాలే శెయ్యుమ్బోదిఱే, గుణాగుణనిరూపణమ్ పణ్ణి వరైన్దు రక్షిప్పదు. ఇవ్విడత్తిల్ లోకశబ్దమ్- జనవాచి. "లోక స్తు భువనే జనే" ఎన్నక్కడవదిఱే.

**(కాత్తళిక్కుమ్)-** అనిష్టఙ్గళైప్పోక్కి రక్షిత్తు అభిమతఙ్గళై క్కొడుక్కుమ్.

**(వాశమలరాళ్ మణవాళన్)**- "వేరి మాఱాద పూమేలిరుప్పాళ్" ఎన్గిఱ పడియే, ఎప్పోదు మొక్క చ్చెవ్వి మాఱామైయాలే పరిమళమ్ అలై ఎఱిగిఱ పుష్పత్తై ఇరుప్పిడమాగవుడైయ పెరియపిరాట్టియార్క్కు వల్లభనానవన్- కీழ్ చ్చొన్నపడియే, రక్షిప్పదుదాన్ అవళోడే కూడియిరున్దాయిత్తు. "లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా, రక్షక స్సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే" ఎన్నక్కడవదిఱే. రక్షణత్తుక్కు అరియాన కృపైయై కిళప్పుగైయుమ్, రక్షిత్తాల్ అదు కణ్డుగక్కుగైయుమ్ అవళుడైయ కూఱాయిఱే యిరుప్పదు.

ఇప్పడి ఇరుక్కిఱ శ్రియఃపతియానవన్, తాన్ పణ్ణిన కృషి ఫలిత్తు, అనన్య ప్రయోజనరా నవర్గళుడైయ హృదయత్తిల్ ఇరుప్పిల్ పణ్ణుమ్ ఆదరవిశేషత్తై అరుళిచ్చెయ్ గిఱార్, మేల్.

**(తేశు పొలి విణ్ణాట్టిల్)**- "అత్యర్కానలదీప్తం తత్ స్థానమ్" ఎన్గిఱపడియే తేజఃప్రచురమాయ్, "వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, అస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై భాగవతై స్సహ" ఎన్గిఱపడియే, పెరియపిరాట్టి యారోడుమ్, నిత్యసూరిగళోడుమ్ కూడ రసోత్తరమాగ ఎழున్దరుళియిరుక్కిఱ పరమపదత్తిల్కాట్టిల్.

**(శాలవిరుమ్బుమే)**- మిగవు మాదరియానిఱ్కుమే.

**(వేఱొన్ఱై యెణ్ణాదార్ నెఞ్జత్తిరుప్పు)**- "వాసుదేవ స్సర్వమ్" ఎన్ఱుమ్, "ఎల్లామ్ కణ్ణన్" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే సకలప్రయోజనముమ్ తానేయాగ నినైత్తు, వేఱొరు ప్రయోజనత్తై గణియాదే యిరుక్కుమవర్గళుడైయ హృదయత్తిల్ ఇరుప్పై ఇత్తాల్ - అప్రాకృతమాన దేశవిశేషత్తిలుఙ్గాట్టిల్, ఇవర్గళ్ హృదయత్తిల్ ఇరుప్పు, తనక్కు అత్యంతరసావహమా యిరుక్కైయాలే, ఇదిలే అత్యాదరత్తై ప్పణ్ణుమెన్ఱదాయిత్తు. "యేఽనన్యమనస శ్శుద్ధాః యే దాస్యైకమనోరథాః, తేషాం మే హృదయం విష్ణో ర్వైకుంఠాత్పరమం పదమ్" ఎన్ఱు తానే అరుళిచ్చెయ్దానిఱే.

తొమ్మిదవ పాశురం :- అవతారిక : అన్యప్రయోజనాలను ఆశించనివారై, భగవత్కైంకర్యాన్ని చేసేవారి విషయంలో భగవంతునకుండే ఆదరాతిశయాన్ని గడచిన పాశురంలో పలికారు. అంతమాత్రమేకాకుండా, వారి హృదయంలో



స్థిరంగా నిలచి ఉండడంలో ఆ స్వామికి ఉండే మిక్కిలి ఆదరాన్ని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : **(ఆశిల్ అరుళాల్)** నిర్హేతుకకృపతో- అని అర్థం. "ఆశు" అనే పదం దోషాన్ని తెల్పుతుంది. "ఇల్" అనేది ఆ దోషం లేని స్థితిని (దోషరాహిత్యాన్ని) తెల్పుతుంది. దయకు దోషమేమంటే- ఏదైనా ఒక హేతువు ఉంటే తప్ప కార్యకరం కాకుండా ఉండడం.

**(అనైత్తులకమ్)** - అన్నిలోకాలను- అని అర్థం. ఏదో ఒక కారణాన్ని పురస్కరించుకొని దయ చూపినపుడు కదా, "ఇతడు మంచివాడా ? లేక, చెడ్డవాడా?'' అని గమనించి దయచూపవలసి ఉంటుంది. ఇక్కడ "ఉలకు" అనే పదం అందఱు జనులను సూచిస్తుంది. "లోక స్తు భువనే జనే" (అమరకోశం-3-3-2) (లోకశబ్దం లోకంలోని జనసమూహాన్ని సూచిస్తుంది) అని చెప్పబడింది కదా!

**(కాత్తళిక్కుమ్)** - ఆశపడదగనివానిని పోగొట్టి, ఆశపడిన వానిని ఇచ్చి రక్షిస్తుంది.

**(వాశమలరాళ్ మణవాళన్)** - "వేరి మాఱాద పూమేలిరుప్పాళ్ వినై తీర్క్కుమే" (తిరువాయ్-4-5-11) (పరిమళం తగ్గని తామరపూవువై నిత్యవాసం చేసే లక్ష్మీదేవి పాపాలను తీరుస్తుంది) అనే రీతిలో ఎల్లప్పుడు వికాసం మాఱనందున పరిమళం వీచే తామరపూవును నివాసస్థానంగా కల లక్ష్మీదేవికి వల్లభుడై ఉండేవాడు- అని భావం. ఇంతకు ముందు మూడవ పాశురంలో పల్కినట్లుగా, లక్ష్మీదేవితో కూడి ఉండే జీవుని స్వామి రక్షిస్తాడు. "లక్ష్మ్యా సహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా, రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే" (లక్ష్మీతంత్రమ్- 28-14) కరుణయే మూర్తీభవించిన లక్ష్మీదేవితో కూడి ఉండే హృషీకేశుడే (పాంచరాత్రంలో ఉండే మంత్రాగమ, తంత్ర, తంత్రాంతరాలు అనబడే) అన్ని సిద్ధాంతాలలోను, వేదాంతాలలోను రక్షకంగా చెప్పబడు తున్నాడు.) అని చెప్పబడింది కదా! భగవంతుడు జీవుని రక్షించడంకోసం కారణమైన కరుణను ఉద్బుద్ధం చేయడం (పైకి వ్యక్తమై వృద్ధి అయేటట్లు చేసేది)

భగవంతుడు చేసే జీవుని రక్షణను చూచి ఆనందించేవి లక్ష్మీదేవియొక్క భాగమై ఉన్నదికదా!

ఈ విధంగా ఉండే లక్ష్మీవల్లభుడు, తాను చేసిన ప్రయత్నం ఫలించి, అన్యప్రయోజనాలను కోరనివారై ఉండేవారి హృదయంలో నివసించడం చాలా ఇష్టపడతాడు- అనే విషయాన్ని పాశురంలోని ఉత్తరార్ధంలో పల్కుతున్నారు.

**(తేశు పొలి విణ్ణాట్టిల్)**- **"అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః, తత్ర గత్వా పునర్నేమం లోక మాయాంతి భారత!"** (భారతమ్-ఆరణ్య- 136-18-23) (మహాత్ముడైన విష్ణువుయొక్క ఆస్థానం సూర్యుని యొక్క అగ్నియొక్క కాంతిని మించినది. రాజా! అది తన తేజస్సుతో దేవతలకు అసురులకు దర్శించడానికి వీలుకానిది. భరతవంశంలో పుట్టినవాడా! అక్కడకు పోయిన తరువాత ఈ లోకానికి తిరిగి రావడం లేదు) అనే రీతిలో జోతిర్మయమై, **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః ఆస్తే విష్ణురచింత్యాత్మా భక్తైః భాగవతైః సహ"** (శివపురాణమ్) (వైకుంఠమనే గొప్ప లోకంలో లోకాలకు అన్నిటికి స్వామి, భావించడానికి సాధ్యం కాని స్వరూపాన్ని కలవాడైన విష్ణువు గుణనిష్ఠులైన భక్తులతో, కైంకర్యనిష్ఠులైన భాగవతులతో కూడినవాడై, లక్ష్మీదేవితో కలసి వేంచేసి ఉంటాడు) అనే రీతిలో లక్ష్మీదేవితో, నిత్యసూరులతో కూడి ఉండి మహానందాన్ని అనుభవిస్తూ వేంచేసి ఉండే పరమపదంకంటే -అని భావం.

**(శాల విరుమ్బుమే)**- ఎక్కువ మిక్కిలిగా కోరతాడు. దేనిని? అంటే,

**(వేఱొన్ఱై ఎణ్ణాదార్ నెఞ్జత్తిరుప్పు)**- **"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే, వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః"** (గీత-7-19) (పలు పుణ్యాజన్మలు గడచిన తరువాత పరిణతిని చెందినన జ్ఞానాన్ని కల యోగి "వాసుదేవుడే నాకు పరమప్రాప్యమై, ప్రాపకమై, ధారకపోషక భోగ్యాది సమస్తమై ఉన్నాడు"- అని తలచి, నన్ను శరణు పొందుతున్నాడు. అతడు విశాలమైన ఉదారమైన మనస్సును కలవాడు. లోకంలో నాకు లభించడానికి అరుదైనవాడు) అని, **"ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్"** (తిరువాయ్-6-7-1) (భుజించే అన్నం, తాగే నీరు, ఆస్వాదించే తాంబూలం అన్నీ కృష్ణుడే) అని పల్కిన రీతిలో ఆదరాన్ని ఆశను కల్గి ఉంటాడు- అని తెలుపబడింది. **"యేఽనన్యమనసః శుద్ధాః యే తద్దాస్యైక మనోరథాః, తేషాం మే హృదయం విష్ణోః వైకుంఠాత్ పరమం పదమ్"** (భగవంతునిలో తప్ప వేఱు దేనిలోను మనస్సునిలుపని పరిశుద్ధతను కలవారై, నా దాస్యాన్ని ఒక్కటిని మాత్రమే పొందాలని ఆశపడేవారైన భక్తుల మనస్సు విష్ణువు అనబడే నాకు వైకుంఠం కంటే కూడా చాలా గొప్ప స్థానం) అని భగవానుడే స్వయంగా అన్నాడుకదా!



**10. నాళు ములగై నలిగిన్ఱ వాళరక్కన్,**
**తోళు ముడియుమ్ తుణిత్తవన్ఱన్, - తాళిల్**
**పొరున్దాదార్ ఉళ్ళత్తిల్ పూమడన్దై కేళ్వన్**
**ఇరున్దాలుమ్, ముణ్మేల్ ఇరుప్పు.**

నాళుమ్ = ప్రతిదినం, ఉలకై = లోకాన్ని అంతటిని, నలికిన్ఱ = బాధిస్తున్న, వాళ్ అరక్కన్ = ఖడ్గాన్ని చేతపట్టిన రావణుని, తోళుమ్ = బాహువులను, ముడియుమ్ = శిరస్సులను, తుణిత్తవన్ = ఖండించినవాడైన, పూ మడన్దై కేళ్వన్ తన్= లక్ష్మీవల్లభుని, తాళిల్ = శ్రీచరణాలలో, పొరునీతాతార్ = పొందికగా నిలువనివారి, ఉళ్ళత్తిల్ = హృదయంలో, ఇరున్దాలుమ్ = ఉన్నా (ఆ స్థితి), ముళ్ మేల్ ఇరుప్పు = ముళ్ళపై ఉండే స్థితివంటింది.

లోకాలను అన్నిటిని నిరంతరం బాధించే ఖడ్గహస్తుడైన రావణుని బాహువులను, శిరస్సులను ఖండించిన లక్ష్మీనాథుడైన భగవానుడు తన శ్రీచరణాల పట్ల అభిముఖ్యాన్ని కల్గి ఉండని పాపుల హృదయంలో ఉన్నప్పటికీ, ఆ స్థితి అతనికి ముళ్ళపై ఉన్నట్లుగా ఉంటుంది.

**పత్తామ్బాట్టు :- అవతారికై - శ్రియఃపతియానవన్, ప్రయోజనాంతర పరరుడైయ హృదయత్తిల్ ఇరున్దాలుమ్, అవ్విరుప్పు అవనుక్కు దుఃఖావహమాగైయాలే, అసహ్యమాయిరుక్కుమ్బడియై అరుళిచ్చెయ్‌గిఱార్.**

వ్యాఖ్యానమ్ : (నాళుములగై నలిగిన్ఱ) - కాదాచిత్కమాగవన్ఱిక్కే, నాళ్దోఱుమ్. ఒరువరై ఇరువరై యన్ఱిక్కే, లోకత్తై యడైయ. ఒరుక్కాల్ ఇడైవిడుగై యన్ఱిక్కే నలియానిఱ్కిఱ.

(వాళరక్కన్) మున్బే రుద్రనై ఉపాసిత్తు, అవన్పక్కలిలే పెఱ్ఱ ఒరు వాళై తనక్కు బలమాగ ప్పిడిత్తుక్కొణ్డిరుక్కుమ్ రాక్షసనుడైయ.

(తోళు ముడియుమ్ తుణిత్తవన్)- తోళ్గళైయుమ్, తలైగళైయు మఱుత్తవన్. "తోళ్గళ్ తలై తుణి శెయ్దాన్" ఎన్ఱానిఱే ఆళ్వార్. అదావదు- అవనై క్కొల్లుగిఱవళవిల్, అగప్పడాదవన్ అగప్పట్టాన్; తప్పామల్ కొన్ఱువిడువో మెన్ఱు పారాదే, తోళ్గళై క్కళిత్తు, తలైగళై చ్ఛేదిత్తు. పోదుపోక్కాగ నిన్ఱు కొన్ఱపడి.

(పూమడన్దై కేళ్వన్) పుష్పనివాసినియాయ్, "యువతి శ్చ కుమారిణీ" ఎన్గిఱపడియే నిత్యయౌవన స్వభావైయాన పెరియపిరాట్టియార్క్కు నాయగనానవన్. కీళ్చ్చొన్న రావణవధన్దనక్కు, నాట్టై నలిన్దవళవన్ఱిక్కే, ఇవళై ప్పిరిత్తదిఱే ప్రధానహేతు. "శురికుళఱ్కనివాయ్ త్తిరువినై ప్పిరిత్త కొడుమైయిఱ్కడువిశై యరక్కన్ ఎఱి విళిత్తిలఙ్గు మణిముడి పొడి శెయ్దిలఙ్గై" ఎన్ఱారిఱే, తిరుమఙ్గైయాళ్వార్. ఇప్పడి దివ్యమహిషియాన పిరాట్టియున్దాను మాయ్ రసోత్తరమాగ ఎళున్దరుళియిరుక్కుమవన్.

(తన్దాళిల్ పొరున్దాదారుళ్ళత్తిల్) - తిరువడిగళై ఆశ్రయిత్తిరుక్కచ్చెయ్దే, ప్రయోజనాంతరఙ్గళిల్ విరుప్పత్తై ప్పణ్ణి, తన్ తిరువడిగళిలే పొరుత్త మఱ్ఱిరుక్కుమవర్గళుడైయ హృదయత్తిల్.

(ఇరున్దాలుమ్)- ముదలిలే యిరుక్క త్తాన్ కూడాదు, ఉపాసనకరాన వర్గళుడైయ నిర్బంధత్తుక్కాగ ఇరున్దాలుమ్.

(ముణ్మేలిరుప్పు)- కంటకాగ్రత్తిల్ ఇరుప్పుప్పోలే, దుఃఖావహమా యిరుక్కు మెన్ఱపడి. "భగవచ్చరణద్వంద్వే భక్తి ర్యేషామ్ న విద్యతే, తేషాం హృది స్థితో దేవః కణ్టకాగ్ర ఇవ స్థితః" ఎన్గిఱ బ్రహ్మాణ్డపురాణ వచనత్తై ఇవ్వర్థత్తుక్కు ప్రమాణమాగ అనుసంధిప్పదు.



పదవపాశురం :- అవతారిక : శ్రియఃపతి తనకంటే వేఱయిన అన్యప్రయోజనాలను కోరే వారి హృదయంలో ఉన్నా, ఆ ఉపస్థితి అతనికి దుఃఖాన్ని కల్గిస్తుంది కనుక, పొసగనిదై ఉండే రీతినిగూర్చి ఇందులో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (నాళుమ్ ఉలకై నలికిన్ఱ) - ఏదో ఒకసమయంలో క్లేశపెట్టేదిగా కాకుండా, ఎల్లప్పుడు, ఒకరిని, ఇద్దఱినిగా కాకుండా సమస్తలోకాన్ని నిరంతరంగా క్లేశపెట్టే - (అని అర్థం.)

(వాళరక్కన్) - పూర్వమే శివుని ఆరాధించి, అతని వద్దనుండి పొందిన "వాళ్" అనే ఆయుధాన్ని తనకు బలాన్ని చేకూరుస్తుందని తలచి దానిని ధరించి పట్టుకొని ఉండే రావణునియొక్క,

(తోళుమ్ ముడియుమ్ తుణిత్తవన్)- బాహువులను, శిరస్సులను ఖండించినవాడు. "తోళ్కళ్ తలై తుణి శెయ్దాన్" (తిరువాయ్-1-6-7) (బాహువులను, శిరస్సులను ఖండించాడు) అని నమ్మాళ్వార్లు అనుగ్రహించారు కదా! దీని భావమేమంటే - అతనిని వధించే టపుడు "లోకంలో ఎవరివల్ల వధించడానికి సాధ్యం కానివాడు వచ్చాడు. అతనిని వెంటనే వధించి వేద్దాం"- అని భావించకుండా, ఖండించే కొద్ది మొలిచే శిరస్సు లను, బాహువులను ఖండించి, ''అపుడయినా అతడు మాఱతాడా?'' అని పరిశీలించి చూడడంకోసం అతనికి అవకాశాన్ని ఇచ్చి, చాలాసేపు వేచిచూచాడని తాత్పర్యం.

(పూమడన్దై కేళ్వన్తన్)- తామరపూవులో నివసించేదై, "యువతి శ్చ కుమారిణీ" (లక్ష్మీదేవి కౌమారదశను పరిపూర్ణంగా పొంది, యౌవనదశ ఆరంభంలో ఉన్నది) అనే రీతిలో ఎల్లప్పుడు యౌవనాన్ని స్వభావసిద్ధంగా కల్గినదైన లక్ష్మీదేవికి వల్లభుడై ఉండేవాడు. పూర్వం తెల్పిన రీతిలో రావణవధకు, అతడు లోకాలను బాధించడం మాత్రమే కాక, సీతాదేవిని విడదీయడమే ముఖ్యమైన కారణం. "శురికుళల్ కనివాయ్ త్తిరువినై పిరిత్త కొడుమైయి ఱ్కడువిశై యరక్కన్ ఎరివిళిత్తిలఙ్గు మణిముడి పొడి శెయ్దు ఇలఙ్గై పాళ్ పడుప్పదఱ్కు ఎణ్ణి" (పెరియ తిరుమొళి- 5-7-7) (అందమైన కేశాలను, దొండపండు వంటి అధరాన్ని కల సీతాదేవిని విడదీసిన, కాఠిన్యంలో మిక్కిలి

వేగాన్ని కల రావణుని అగ్నివలె జ్వలించే మణులు పొదిగిన కిరీటాన్ని పొడిచేసి, లంకను పొడుచేయాలని సంకల్పించి) అని తిరుమంగై ఆ*ళ్వా*ర్లు అన్నారు కదా! ఈ విధంగా సాటి లేని పట్టపురాణి అయిన లక్ష్మీదేవి, తాను కలసి ఆనందంగా వేంచేసి ఉండేవాడు.

**(తాళిల్ పొరున్దాదార్ ఉళ్ళత్తిల్)**- అటువంటి సర్వేశ్వరుని శ్రీచరణాలను శరణు పొందేటపుడు భగవత్కైంకర్యం కంటే వేఱయిన అన్యప్రయోజనాలను ఆశపడి, ఆ శ్రీచరణాలలో పొందికగా ఉండనివారి హృదయంలో,

**(ఇరున్దాలుమ్)** - అటువంటి వారి హృదయంలో భగవంతుడు ఉండడమే తగదు. తనను (ఏదో ఒక కారణంచేత) ఉపాసించేవారైనందున, ఆ నిర్బంధం కోసంగా ఉన్నా, అది -

**(ముళ్మేల్ ఇరుప్పు)** ముళ్ళపై ఉన్నట్లుగా క్లేశాన్ని కల్గిస్తుంది- అని భావం. "భగవచ్చరణ ద్వంద్వే భక్తిర్యేషాం న విద్యతే, తేషాం హృది స్థితో దేవః కంటకాగ్ర ఇవ స్థితః" (బ్రహ్మాండపురాణమ్) (భగవానుని శ్రీచరణాలలో ఎవరికి భక్తి లేదో, వారి మనస్సులో ఆ స్వామి ఉన్నా, ముళ్ళపై ఉన్నట్లుంటాడు) అనే బ్రహ్మాండపురాణ వాక్యాన్ని ఈ అర్థానికి ప్రమాణంగా అనుసంధించాలి.

**11. తన్పొన్నడి యన్ఱి మ*ఱ్ఱొ*న్ఱిల్ తా*ళ్వు* శెయ్యా,**
**అన్బర్ ఉగన్దిట్టదు అణువెనినుమ్, - పొన్ పిఱ*ళు*మ్**
**మేరువాయ్క్కొళ్ళుమ్ విరైయార్ తు*ళా*యలఙ్గల్,**
**మారిమాక్కొణ్డల్ నికర్ మాల్.**

విరై ఆర్ = సువాసనను నిండుగాకల, తు*ళా*య్ అలఙ్గల్ = తులసీ మాలికచే అలంకరింపబడినది, మారి మా కొణ్డల్ నికర్ = వర్షించే వల్లని మేఘం వంటి తిరుమేనిని కలవాడైన, మాల్తన్ = భక్తవ్యామోహాన్ని కల స్వామియొక్క, పొన్ అడి అన్ఱి = అందమైన శ్రీచరణాలు తప్ప, మ*ఱ్ఱు* ఒన్ఱిల్ = వేఱొక ప్రాప్యంలో, తా*ళ్*వు శెయ్యా = అభినివేశాన్ని పొందని, అన్బర్ = భక్తిని కలవారు, ఉకన్దు ఇట్టదు= ఆనందంతో సమర్పించినది, అణు ఎనినుమ్ = చాలా చిన్నదై ఉన్నా,



(దానిని), పొన్ పిఱ*ళు*మ్ = బంగారుమయంగా ఉండే, మేరువాయ్ = మేరు పర్వతం వలె గొప్పగా భావించి, కొళ్ళుమ్ = స్వీకరిస్తాడు.

పరిమళాన్ని మెండుగా కల్గిన తులసీమాలికను అలంకరించుకొన్నవాడు, వర్షాకాలంలో ఆకాశంలో కన్పించే కారుమబ్బుతో పోలినవాడైన భగవానుడు తన శ్రీచరణాలలో తప్ప వేఱు ఏ విషయంలోను ఆభిముఖ్యాన్ని లేని అనన్యభక్తులు తనకు భక్తితో సమర్పించే ద్రవ్యం అణువైనా, దానిని స్వర్ణమయంగా వెలిగే మేరుపర్వతంగా మనస్సులో గ్రహిస్తాడు.

పదినోరామ్పాట్టు :- అవతారికై - కీ*ళ్* ఇరణ్డు పాట్టాలే, శ్రియఃపతియాన సర్వేశ్వర నుక్కు, అనన్యప్రయోజనరుడైయ హృదయత్తిల్ ఇరుప్పిళ్ళ విరుప్పత్తైయుమ్, ప్రయోజనాంతరపరరుడైయ హృదయత్తిల్ ఇరుప్పిల్ ఉళ్ళ దుఃఖత్తైయుమ్ అరుళిచ్చెయ్దార్. ఇప్పాట్టిల్- తన్ తిరువడిగళిల్ అనన్య ప్రయోజనభక్తికరా నవర్గళ్ సాదరమాగ సమర్పిత్త ద్రవ్య మత్యల్పమాగిలుమ్, అవనత్తై అతిమహత్తాగ నినైత్తు, అఙ్గీకరిక్కుమ్బడియై అరుళిచ్చెయ్గిఱార్.

వ్యాఖ్యానమ్ : **(తన్ పొన్నడియన్ఱి)**- నిరుపాధికశేషియాన తన్నుడైయ స్పృహణీయమాన తిరువడిగళై యొ*ళి*య. "తన్నడి" ఎన్గైయాలే, తిరువడిగళి నుడైయ స్వరూప ప్రాప్తత్తైయుమ్, "పొన్నడి" ఎన్గైయాలే, అదినుడైయ శ్లాఘ్యతైయుమ్, భోగ్య తైయుమ్ శొల్లుగిఱదు.

**(మ*ఱ్ఱొ*న్ఱిల్ తా*ళ్వు* శెయ్యా వన్బర్)**- ఇప్పడి ప్రాప్తముమాయ్, భోగ్యముమాన తిరువడిగళై యొ*ళి*య, వేఱొరు ప్రయోజనత్తిల్ ప్రావణ్యమ్ పణ్ణాద ప్రేమత్తై యుడైయవర్గళ్. మ*ఱ్ఱొ*న్నైన్ఱు ఐశ్వర్యాదిగళై చ్చొల్లుగిఱదు. తా*ళ్వా*వదు- తా*ళ్*చ్చి. ఇత్తాల్ ప్రావణ్యత్తై చ్చొల్లుగిఱదు; "శదిరిళ మడవార్ తా*ళ్*చ్చియై" ఎన్గిఱ విడత్తిల్పోలే. ఆగ, ఇప్పడి అనన్యప్రయోజన భక్తిమాన్ కళానవర్గళ్.

**(ఉగన్దిట్టదు)** - "అకించత్కరస్య శేషత్వానుపపత్తిః" ఎన్గిఱపడియే, శేషివిషయత్తిల్ కించిత్కారమిల్లాదపోదు శేషత్వసిద్ధియిల్లామైయాలే. నమక్కిదు అవశ్యమ్ శెయ్యవేణుమెన్ఱు వైధమాగ చ్చెయ్గైయన్ఱిక్కే, "ఉగన్దు పణి శెయ్దు"

ఎన్గిఱపడియే, రాగప్రాప్తమాగ అడిమై శెయ్యుమవర్గళాగైయాలే, ప్రీతిప్రేరిత రాయ్క్కొణ్డు సమర్పిత్త ద్రవ్యమ్.

(అణువెనిలుమ్)- అత్యల్పమాయిరున్దదేయాగిలుమ్.

(పొన్ పిఱఴు మేరువాయ్ క్కొళ్లుమ్)- అదావదు- స్వర్ణ రూపమాయ్ క్కొణ్డు విళఙ్గానిన్దుళ్ళ మహామేరువైప్పోలే అతిమహత్తాగ నినైత్తు, అఙ్గీకరియా నిఱ్కుమ్ - ఎన్గై. ఇవన్ ఇట్టదు కొణ్డు తృప్తనాగవేణ్డుమ్ కుఱైవాళనాకిలిఱే, సమర్పిత్త ద్రవ్యత్తినుడైయ లాఘవమ్ పార్త్తాదరిప్పదు. అఙ్గనన్ఱిక్కే, సమర్పిక్కు మవనుడైయ ప్రేమత్తైయే పార్క్కు మవనాగైయాలే, ఇవన్ ప్రేమత్తోడే సమర్పిత్త ద్రవ్యత్తై, ఇప్పడి అఙ్గీకరిక్కుమవన్ ఎన్ఱారాయిఱ్ఱు. ఇప్పడి అఙ్గీకరిక్కు మవన్దాన్ ఆర్? ఎన్నిల్,

(విరైయార్ తుఴాయలఙ్గళ్ మారిమాక్కొణ్డల్ నిగర్మాల్)- అదావదు- పరిమళప్రచురమాన తిరుత్తుఴాయ్మాలైయాలే అలఙ్కృతనాయ్, వార్షుకమాన మహామేఘమ్పోలే యిరుక్కిఱ వడివఴగైయుడైయనాన సర్వేశ్వరన్. విరై- పరిమళమ్, అలఙ్గల్ - మాలై, మారి-వర్షమ్, మా-మహత్తు, ఇత్తాల్- అనన్య ప్రయోజన భక్తిమాన్గళాయ్, తన్ పక్కల్ మనస్సై వైత్తవర్గళుక్కు, అనవరతాను భావ్యమాయ్, భక్తివర్ధకమాన ఒప్పనై యఴకైయుమ్, వడివఴగైయు ముడైయవన్- ఎన్ఱదాయిఱ్ఱు. "విరైయార్ తుఴాయలఙ్గల్ మారిమాక్కొణ్డల్ నిగర్మాల్, తన్ పొన్నడి" ఎన్ఱు తుడఙ్గి, "మేరువాయ్క్కొళ్లు" మెన్ఱన్వయమ్, "భక్త్యా రణ్వప్యుపానీతం ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్, భూర్యప్య భక్తోపహృతం న మే తోషాయ కల్పతే" ఎన్ఱు పౌష్కరసంహితైయిల్ తానే అరుళిచ్చెయ్దానిఱే.

పదకొండవ పాశురం :- అవతారిక : ఈ విధంగా ఇంతవరకు రెండు పాశురాలలో (9వ, 10వ పాశురాలలో) లక్ష్మీవల్లభుడైన భగవంతునివద్ద ప్రయోజనాంతరాలను కోరనివారి హృదయంలో అతడు ఆదరంతో ఉంటాడు- అని, ప్రయోజనాంతరాలను కోరేవారి హృదయంలో దుఃఖంతో ఉంటాడని పలికారు. ఇక, ఈ పాశురంలో, ప్రయోజనాంతరాలను కోరని భక్తిని కలవారు ప్రేమతో సమర్పించిన వస్తువు ఏదయినా, చాలా చిన్నది అయినా, దానిని భగవంతుడు చాలా గొప్పదిగా తలచి స్వీకరిస్తాడని అంటున్నారు.



**వ్యాఖ్యానం :- (తన్ పొన్నడి యన్ఱి)** సహజబంధువైన తనయొక్క, అందఱు ఆశపడే శ్రీచరణాలను తప్ప - అని భావం. "తన్ అడి" - అని పల్కినందున స్వామి శ్రీచరణాలు, తమకు శేషమైన జీవాత్మల స్వరూపానికి తగినవి- అనే విషయం, "పొన్ అడి" - అని పల్కినందున వాని గొప్పతనం, భోగ్యత చెప్పబడు తున్నది.

**(మఱ్ఱొన్ఱిల్ తాఴ్వు శెయ్యా అన్బర్)**- ఈ విధంగా స్వరూపానికి తగినవై, భోగ్యమైన శ్రీచరణాలను తప్ప వేఱు ఏ ప్రయోజనాన్ని ఆశపడని భక్తిని కలవారు - అని భావం. "**మఱ్ఱొన్ఱు**" - అని ఇహలోక సంపదలు, కైవల్యమోక్షం తెలుపబడ్డాయి, "**తాఴ్వు**" - అనే పదం నైచ్యాన్ని (తక్కువ దనాన్ని) తెలిపేది. ఇది ఇక్కడ అభినివేశాన్ని తెల్పుతున్నది. "**శదిరిళ మడవార్ తాఴ్చ్చియై మదియాదు**" (తిరువాయ్-2-10-2) (చాతుర్యాన్ని కల లేత వయస్సులోని కాంతల నైచ్యాన్ని భావించకుండా) అనేచోట నమ్మాఴ్వార్లు కూడా ఈ అర్థంలో ఈ పదాన్ని ప్రయోగించారుకదా! ఈవిధంగా, ఈ ప్రయోగం ప్రయోజనాంతరాలను భావించని (ఆశపడని) భక్తిని కలవారిని తెల్పుతుంది.

**(ఉకన్దిట్టదు)** - "అకించిత్కరస్య శేషత్వానుపపత్తిః" (ఏ కైంకర్యాన్ని చేయనివానిని శేషత్వం సిద్ధించదు) అనే లౌకికన్యాయాన్నిబట్టి భగవంతునకు కైంకర్యాన్ని చేయనపుడు శేషత్వం సిద్ధించదు కనుక, "తప్పక చేయాలి'' అనే విధిని అనుసరించి చేయడం కాకుండా, "**ఉకన్దు పణి శెయ్దు**" (తిరువాయ్-10-8-10) (ఆనందించి సేవచేసి) అనే రీతిలో ఆనందంతో, ప్రీతితో కైంకర్యం చేసే వారు కనుక, ప్రీతితో ప్రేరేపింపబడినవారై, సమర్పించిన ద్రవ్యం.

**(అణు ఎనినుమ్)** - అది మిక్కిలి చిన్నది అయినా,

**(పొన్ పిఱఴుమ్ మేరువాయ్ క్కొళ్ళుమ్)** - దీని భావం ఏమంటే- బంగారుకొండగా పురాణాలలో వర్ణింపబడే మేరుపర్వతంవలె చాలా గొప్పదిగా తలచి, స్వీకరించే భగవంతుడు - అని భావం. అతడు సమర్పించినదానిని స్వీకరించి తృప్తిని పొందాలి - అనే కొఱతను (ఆశను) కలవాడై ఉన్నపుడు

కదా, సమర్పించిన వస్తువులోని తక్కువదనాన్ని చూచి దానిని పక్కకు తొలగడం జరుగుతుంది. ఆవిధంగా కాకుండా, ద్రవ్యాన్ని సమర్పించేవాని ప్రేమను, భక్తినే చూచేవాడు కనుక, ఇతడు ప్రేమతో సమర్పించిన ద్రవ్యాన్ని ఈవిధంగా అంగీకరిస్తాడు - అని అంటున్నారు ఈ రీతిలో పరిగ్రహించేవాడెవరు? అనేదానికి తరువాత గల ప్రయోగంతో సమాధానం పల్కుతున్నారు.

(విరైయార్ తుழాయలజ్గల్ మారిమా క్కొణ్డల్ నికర్మాల్)- దీని తాత్పర్యం ఏమంటే - మిక్కిలి పరిమళాన్ని కల తులసీమాలచే అలంకరింప బడినదై, వర్షం కురిసే గొప్ప (వార్షుక) మేఘంవలె ఉండే తిరుమేనిని అందాన్ని కలవాడు - సర్వేశ్వరుడు అని. 'విరై" అనే పదం పరిమళాన్ని తెల్పుతుంది. "అలజ్గల్" అనే పదం మాలికను తెల్పుతుంది. "మారి" అనే పదం వర్షాన్ని తెల్పుతుంది. "మా" అనే పదానికి - గొప్ప - అని అర్థం. దీనిద్వారా, ప్రయోజనాంతరాలను ఆశించని (గొప్ప అనన్య) భక్తిని కలవారై, తనపట్ల మనస్సును నిలిపినవారికి ఎల్లప్పుడు భోగ్యమై, వారి భక్తిని వర్ధిల్లజేసేవైన భూషణాల, అలంకారాల అందాన్ని రూపసౌందర్యాన్ని కలవాడు- అని చెప్పినట్లయింది. "విరైయార్ తుழాయలజ్గల్ మారిమా క్కొణ్డల్ నికర్మాల్ తన్పొన్నడి" అని ఆరంభించి, "మేరువాయ్ క్కొళ్ళుమ్" అని అన్వయించి అర్థాన్ని చెప్పాలి. "భక్త్యై రణ్వప్యుపానీతం ప్రేమ్ణా భూర్యేవమే భవేత్, భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే" (పౌష్కరసంహిత) (నా భక్తులచే సమర్పింపబడినది చాలా చిన్నది అయినా, ప్రేమతో అది నాకు చాలా గొప్పది అవుతుంది. భక్తి లేనివాడు చాలా పెద్ద వస్తువును సమర్పించినా, అది నాకు సంతోషాన్ని కల్గించదు) అని భగవానుడు స్వయంగా పలికాడు కదా!

**12. మాఱా యిణైన్ద మరుదమిఱ త్తవழ్న్ద,**
**శేఱారరవిన్ద చ్చేవడియై, - వ్వేఱాగ**
**ఉళ్ళాదార్ ఒణ్ణిదియై యీన్దిడినుమ్, తానుగన్దు**
**కొళ్ళాన్ మలర్మడన్దై కోన్**

మలర్ మడన్దై కోన్ = తామరపూవును నివాసంగా కల లక్ష్మీదేవికి స్వామి, మాఱాయ్ ఇణైన్ద = తనను ఎదురై నించిన, మరుదమ్ ఇఱ = మద్దిచెట్లను



భంజించి (కూలగొట్టి), తవழ్న్ద = దోగాడుతూ పోయిన, శేఱు ఆర్ అరవిన్దమ్= పంకంలో (బురదలో) మొలచిన ఎఱ్ఱ తామరపూవు వంటి, శే అడియై = అందమైన శ్రీచరణాలను, వేఱు ఆక = విలక్షణమైనదిగా గొప్ప (ప్రాప్యంగా), ఉళ్ళాదార్= భావించనివారు, ఒళ్ నిదియై = గొప్ప సంపదను, ఈన్దిడినుమ్ = సమర్పించినా, తాన్ = అన్ని మనోరథాలు నిండిన ఆ సర్వేశ్వరుడు, ఉకన్దు కొళ్ళాన్ = దానిని ఆశపడి గ్రహించడు.

తనపట్ల విరోధ భావాన్ని కల్గి, ఒకటిగా చేరి ఉండే మద్దిచెట్ల జంట విరిగి కూలేటట్లుగా దోగాడిన లక్ష్మీవల్లభుడైన భగవానుడు, తన శ్రీచరణపంకజాలను విషయంలో గొప్పగా చింతించనివారు (భక్తి లేనివారు) గొప్ప నిధిని సమర్పించినా దానిని తాను సంతోషంతో గ్రహించడు.

పన్నిరణ్డామ్పాట్టు :- అవతారికై - ప్రయోజనాంతరపరరానవర్గళ్ శీరియ ధనత్తై సమర్పిక్కిలుమ్, శ్రియఃపతియానవన్, అత్తై విరుమ్బి అజ్గీకరియాన్- ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (మాఱా యిణైన్ద మరుదమిఱ త్తవழ్న్ద)- తన్ పక్కల్ శాత్రవయుక్త మాయ్, నిర్వివరమామ్పడి చ్చేర్న్దునిన్ఱ యమళార్జునమానదు, ముఱిన్దు విழుమ్పడి తవழ్న్దుపోన. "చిక్షేప చరణా వూర్ధ్వం స్తన్యార్థీ ప్రరురోద హ" ఎన్గిఱపడియే, ములైవరవు తాழ్న్దవాఱే శీఱి యழుదు, తిరువడిగళై నిమిర్క్క, అదు పట్టు శకటమ్ ముఱిన్దు విழున్దాప్పోలే యాయిற్ఱు, వెణ్ణెక్కళవిలే యముదుశెయ్దానెన్ఱు పెற్ఱ తాయానవళ్ ఉరలోడే కట్ట, అదైయు మిழుత్తుక్కొణ్డు, మౌగ్ధ్యత్తాలే, ఇదిన్నడువే నుழైన్దు తవழ్న్దు పోగానిఱ్క, తిరుత్తొడైగళినుడైయ స్పర్శత్తాలే మరుదమ్ ముఱిన్దు విழున్దపడి. ఇవన్ అన్యార్థమాగ చ్చెయ్దాలుమ్, ప్రతికూలిత్తు క్కిట్టినార్, ముడియుమ్పడి యాయిఱే వస్తు స్వభావ మిరుప్పదు.

(శేఱారరవిన్దచ్చేవడియై) తన్నిలత్తిలే అలర్న్ద శెవ్విత్తామరైపోలే శివన్దిరుక్కిఱ తిరువడిగళై. శివప్పై చ్చొన్న ఇదు తిరువడిగళిల్, వికాసమ్. శెవ్వి, కుళిర్చ్చి, పరిమళమ్ - ఇవైற్ఱుక్కెల్లాముపలక్షణమ్. "యమళార్జు

నయోర్మధ్యే జగామ కమలేక్షణః" ఎన్ఱు, మరుదుగళిన్ నడువే తవழ்న్దు పోన పోదు, అవై ముఱిన్దు విழுగిఱ ఓశైయై క్కేట్టు ప్పురిన్దు పార్త్తు, అపూర్వ దర్శనత్తాలే శివన్దు మలర్న్ద తిరుక్కణ్గళిల్ అழగై వర్ణిత్తార్ ఋషి. తవழ்న్దు పోగిఱపోదు, ముఱిత్తిట్టుప్పోన్ద తిరువడిగళిలழగై వర్ణిక్కిఱారివర్. "పొరున్దియ మామరుదినిడై పోయ వెమ్బెరున్దకాయున్ కழల్ కాణియ పేదుఱ్ఱు" ఎన్ఱు ఆழ்వ్వారుమనుభవిక్క ఆశైప్పట్టదు తిరువడిగళైయిఱే.

(పేఱాగ వుళ్ళాదార్) వ్యావృత్తమాగ అనుసంధియాదవర్గళ్. అదావదు- ప్రయోజనాంతర సఙ్గమఱ్ఱు, ఇత్తిరువడిగళే, నమక్కు పరమప్రాప్యమెన్ఱు అనుసంధియాదవర్గళ్ - ఎన్ఱై. అవన్, మరుదుగళిన్ కైయిల్ అగప్పడామల్, తన్న నోక్కిత్తన్దాల్, అవన్ తిరువడిగళే పరమప్రాప్యమెన్ఱు అనుభవిత్తుక్కొణ్డు కిడక్కవిఱే యడుప్పదు. అదిల్ మనస్సిన్ఱిక్కే, ప్రయోజనాంతరపరరా యిరుక్కు మవర్గళ్.

(ఒణ్ణిదియై యీన్దిడినుమ్) - ఒఱ్ఱై - అழగు, శీరియ నిధియై సమర్పిక్కిలుమ్.

(తానుగన్దు కొళ్ళాన్ మలర్మడన్దై కోన్)- శ్రియఃపతియాగైయాలే అవాప్తసమస్తకామనానవన్, అత్తై విరుమ్బి అఙ్గీకరియాన్ - ఎన్ఱై. అపూర్ణ నాగిలిఱే ద్రవ్యగౌరవమ్ పార్త్తఙ్గీకరిప్పదు. అఙ్గనన్ఱిక్కే, అధికారియినుడైయ భక్తియిల్లాద ప్రయోజనాంతరపరర్ ఇట్టత్తై, సర్వసమాశ్రయణీయ నాగైయాలే నమక్కిదు కైక్కొళ్ళవేణుమే - ఎన్ఱు, తేవైయాగ చ్చెయ్యుమదొழிయ, ఉగన్దు కొళ్ళానా యిఱ్ఱు. "పృథివీం రత్న సంపూర్ణామ్ యః కృష్ణాయ ప్రయచ్ఛతి, తస్యాప్యన్య మనస్కస్య సులభో న జనార్దనః" ఎన్నక్కడవదిఱే. కీழ் ప్పాట్టిల్ శొన్న సంవాద శ్లోకత్తిల్, ఉత్తరార్ధత్తాలే ఇవ్వర్థత్తై త్తానే యరుళిచ్చెయ్దానిఱే.

పన్నెండవ పాశురం :- అవతారిక : ప్రయోజనాంతరాలను ఆశించేవారు ఎంత గొప్ప సంపదను భగవానునకు సమర్పించినా, లక్ష్మీవల్లభుడు దానిని ప్రీతితో స్వీకరించడు - అని అంటున్నారు.



వ్యాఖ్యానం :- (మాఱాయ్ ఇణైన్ద మరుదమ్ ఇఱ త్తవழ்న్ద)- శ్రీకృష్ణునకు విరోధి అయిన అసురుని ఆవేశాన్ని కల్గినదై, జంటగా కలసి ఉండే రెండు మద్దిచెట్లు విరిగి కూలేటట్లుగా దోగాడుతూ పోయిన- అని అర్థం. "కదాచిత్ శకటస్యాధః శయనో మధుసూదనః, చిక్షేప చరణా వూర్ధ్వం స్తన్యార్థీ ప్రరురోద హ" (విష్ణుపురాణమ్- 5-6-1) (ఒకనాడు ఒకబండి కింద శయనించి ఉండే శ్రీకృష్ణ బాలకుడు, పాలు తాగాలని ఆశపడినవాడై, తన కాళ్ళను పైకి చాచి విదలిస్తూ రోదించాడు) అనే రీతిలో తల్లి స్తన్యక్షీరాన్ని ఇవ్వడానికి చేసిన ఆలస్యం వల్ల కోపాన్ని పొంది ఏడ్చి, శ్రీచరణాలను పైకి చాచగా, ఆ పాదాలు తగిలి దగ్గరలో ఉండే శకటం భగ్నమైనది. దానిలో ఆవేశించి ఉండే అసురుడు కిందపడి మరణించాడు. అదే రీతిలో, "వెణ్ణెయై త్తిరుడి ఉణ్డాన్" (వెన్నను దొంగిలించి ఆరగించాడు) అని కన్నతల్లి యశోద కోపించి రోటికి బంధించగా, ఆ రోటిని లాగుతూ, బాల్యంవల్ల ఈ రెండు మద్దిచెట్ల మధ్య దోగాడుతూ పోయినపుడు, శ్రీకృష్ణుని ఊరువుల స్పర్శ కల్గినందున ఆ మద్దిచెట్లు నేలకూలాయి. శ్రీకృష్ణునకు అసురులను వధించాలి -అనే అభిప్రాయం లేకుండా పోయినా, అతనికి శత్రువులై దగ్గరకు వస్తే అసురులు నశించేటట్లుగా కదా అతని లీల సంభవించాయి.

(శేఱార్ అరవిన్ద చ్చేవడియై)- తామరపూవు మొలిచే చోటు అయిన బురదలో మొలిచే ఎఱ్ఱతామర పూవువలె ఎఱ్ఱగా ఉండే శ్రీచరణాలను "శెన్దామరై" అని అంటూ ఉపమానానికి ఎఱ్ఱదనాన్ని పల్కడం- తామరపూవు యొక్క వికాసం, నూతనత్వం, చల్లదనం, సౌగంధ్యం అనే గుణాలు శ్రీచరణాలకు ఉన్నాయి- అని ఉపలక్షణాక్రమంలో సూచిస్తున్నది. "వ్యగ్రాయా మథ తస్యాం స కర్షమాణ ఉలూఖలమ్, యమళార్జునయో ర్మధ్యే జగామ కమలేక్షణః" (విష్ణుపురాణమ్-5-6-16) (యశోదాదేవి కార్యాంతరాలలో నిమగ్నురాలైనపుడు పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు రోటిని రెండు మద్దిచెట్ల నడుమ లాగుకొంటూ పోయాడు) అని చెప్పిన రీతిలో రెండు మద్దిచెట్ల మధ్య దోగాడుతూ పోయినపుడు, ఆ చెట్లు విరిగి కూలిపోయే ధ్వనిని విని తిరిగిచూచి, నూతనమైన దానిని చూచినందున ఎఱ్ఱనిదై, వికసించిన తిరునేత్రాల అందాన్ని

"కమలేక్షణః" అనే పదంతో పరాశరమహర్షి వర్ణించారు. దోగాడుతూ పోయినపుడు, భగ్నం చేస్తూ పోయిన శ్రీచరణాల అందాన్ని ఈ ప్రయోగంతో వర్ణిస్తున్నారు, వీరు. **"పొరున్దియ మామరుదినిడై పోయ ఎమ్బెరున్దకాయ్! ఉన్ కழల్ కాణియ పేదునఱ్ఱు"** (తిరువాయ్-3-8-10) (దగ్గరగా ఉండే మద్దిచెట్ల మధ్యలో దోగాడుతూ పోయిన గొప్ప ప్రభావాన్ని కలవాడా! నీపాదాలను దర్శించాలని ఆశను పొంది) అని ఆழ్వార్లు కూడా దర్శించి అనుభవించాలని ఆశపడినది- ఈ పాదాలనేకదా!

**(వేఱాక ఉళ్ళాదార్)** -గొప్పవి- అని అనుసంధించనివారు- అని అర్థం. అంటే - ప్రయోజనాంతరాలలో అభినివేశం లేకుండా, "ఈ శ్రీచరణాలే మనకు గొప్పదైన ప్రాప్యం'' అనుసంధించనివారు- అని భావం. అతడు (శ్రీకృష్ణుడు) అసురావేశాన్ని కల్గిన మద్దిచెట్ల నడుమ చిక్కుకోకుండా, అతనిని కాచి రక్షించినవి ఆ శ్రీచరణాలు కనుక, "అతని శ్రీచరణాలే గొప్పప్రాప్యం'' అని అనుభవిస్తూ, నెమ్మదిగా ఉండాలికదా ! ఆ రీతిలో కాకుండా, ప్రయోజనాలను ఆశించేవారు

**(ఒళ్ నిదియై ఈన్దిడినుమ్)**- ఇక్కడ **"ఒళ్"** అనే విశేషణం **"ఒణ్మై"** అని అనబడే అందాన్ని తెల్పుతుంది. గొప్పదైన నిధిని ఇచ్చినా- అని భావం.

**(తాన్ ఉకన్దు కొళ్ళామల్ మలర్మడన్దైకోన్)**- శ్రియఃపతి అనబడే స్వామి అన్ని కోరికలు ఈడేఱినవాడు పూర్ణుడు. కనుక ఆ నిధిని ఆశపడి స్వీకరించ బోడు - అని భావం. పూర్ణతను లేనివాడై ఉంటే, నిధియొక్క గొప్పతనాన్ని చూచి, ఆశపడి తీసికోవచ్చు. ఆవిధంగా లేనివాడై, పూర్ణతను కల్గినవాడు కనుక, సమర్పించేవాని భావనలోని శుద్ధిని చూచి స్వీకరిస్తాడు కదా. అతడు అందువల్ల, తనపట్ల భక్తిలేకుండా, ప్రయోజనాంతరాలను కోరేవారు సమర్పించినదానిని "అందఱిచే ఆశ్రయింపదగినవాడు'' - అనే కారణంతో "మనం స్వీకరించాలి'' అనే నిర్బంధంవల్ల స్వీకరిస్తాడు తప్ప, ఆనందంగా, తృప్తిగా స్వీకరించడు. **"పృథివీం రత్నసంపూర్ణాం యః కృష్ణాయ ప్రయచ్ఛతి, తస్యాప్యన్యమనస్కస్య సులభో న జనార్దనః"** (రత్నాలతో నిండి ఉండే భూమిని అంతటిని ఒకడు శ్రీకృష్ణునకు సమర్పించినా, అతడు (తనను కోరకుండా) అన్య ప్రయోజనాలను



కోరేవాడై ఉంటే, శ్రీకృష్ణుడతనికి సులభుడు కాబోడు) అని చెప్పబడిందికదా ! గడచిన పాశురం చివరలో ప్రమాణంగా అనుసంధింపబడిన పౌష్కర సంహిత వాక్యంలోని ఉత్తరార్ధంతో ఈ విషయాన్ని సర్వేశ్వరుడే స్వయంగా పలికాడు కదా!

13. **పణ్డే యుయిరనైత్తుమ్ పఙ్గయత్తాళ్నాయగఱ్కే,**
**తొణ్డా మెన త్తెళిన్ద తూమనత్తర్క్కు, - ఉణ్డో**
**పల కఱ్ఱుమ్ తమ్ముడమ్బై ప్పార్త్తు అబిమానిక్కుమ్,**
**ఉలగత్తవరోడు ఉఱవు.**

పణ్డే = అనాదికాలంగా, ఉయిర్ అనైత్తుమ్ = అన్ని ఆత్మలు, పఙ్గయత్తాళ్ నాయకగఱ్కే = పద్మనివాసిని విభునకే, తొణ్డు ఆమ్ ఎన = శేషభూతులు - అని, తెళిన్ద = జ్ఞానాన్ని కల, తూ మనత్తార్క్కు = పరిశుద్ధమైన మనస్సును కలవారికి, పలవుమ్ కఱ్ఱు = ప్రమాణాలు పెక్కింటిని తెలిసికొన్న తర్వాత కూడ, తన్ ఉడమ్బై= తమ దేహాన్నే, పార్త్తు =చూచి, అబిమానిక్కుమ్ = తమను గొప్పగా తలచే, ఉలకత్తవరోడు = లోకంలోని పామరులతో, ఉఱవు ఉణ్డో = సంబంధం ఉన్నదా?

"ఆత్మలన్నీ అనాదికాలంగా శ్రియఃపతికే శేషభూతాలై ఉన్నాయి" అనే జ్ఞానాన్ని పొందిన పరిశుద్ధమైన మనస్సును కల భక్తులకు, పలు శాస్త్రాలు అభ్యసించినా "మేము జాతిలో గొప్పవారము" అనే గర్వాన్ని పొందిన ప్రాకృతజనులతో సంబంధం ఉంటుందా?

పదిమూన్ఱామ్ పాట్టు :- అవతారికై - శేషివిషయత్తిల్ అనన్యప్రయోజన రాయ్ కించిత్క రిక్కు మాకారముణ్డా నాలుమ్, దేహాత్మాభిమానిగళాన లౌకికరోట్టై సఙ్గమ్ కిడైక్కిల్, అన్ద అధికారత్తుక్కు అవద్యమన్రో? ఎన్న, ఆత్మస్వరూపత్తై యథా దర్శనమ్ పణ్ణినవర్గళుక్కు, అవర్గళోడు ఉఱవు ఉణ్డో? ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (ఉయిరవైత్తుమ్)- ఇత్తాల్ - శేషత్వన్దాన్ శిలరుక్కుణ్డాయ్, శిలరుక్కన్ఱిక్కే యిరుక్కైయన్ఱిక్కే సకలాత్మ సాధారణమెన్గిఱదు.

**(పఙ్గయత్తాళ్ నాయగఱ్కే)**- ఇత్తాల్ - శేషత్వప్రతిసంబంధి యొరు మిథున మెన్నుమిడముమ్, అవధారణత్తాలే ఇదినుడైయ అనన్యార్హత్వముమ్ శొల్లుగిఱదు.

**(తొణ్డామెన త్తెళిన్ద త్తూమనత్తర్క్కు)** - తొణ్డెన్ఱు ప్రథమాక్షరత్తిల్ చతుర్థియాల్ ప్రతిపాదిక్కప్పడుగిఱ శేషత్వత్తై చ్చొల్లుగిఱదు. అనాదికాలమే తొడఙ్గి అఖిలాత్మాక్కళుమ్, అబ్జాసహాయనాన అకారవాచ్యనుక్కే శేషమా యిరుక్కుమెన్ఱు సకలవేదసంగ్రహమాన తిరుమంత్రత్తినుడైయ సంగ్రహమాన ప్రణవత్తిల్ శొల్లుగిఱపడియే, సంశయవిపర్యయ మఱ దర్శిత్తు త్తెళిన్ద పరిశుద్ధాంతఃకరణర్క్కు-ఎన్ఱపడి.

**(ఉణ్డో)**- ఇదుక్కు మేలే అన్వయమ్.

**(పల కఱ్ఱుమ్ తమ్ముడమ్బై ప్పార్త్తభిమానిక్కుమ్)** - అదావదు - శృతిస్మృత్యాదిశాస్త్రఙ్గళ్ పలవఱ్ఱైయుమ్ అధికరిత్తు, జాతివర్ణాశ్రమఙ్గళు క్కెల్లామ్ ఆశ్రయమాయిరుక్కుమ్ తఙ్గళ్ దేహత్తై ప్పార్త్తు, "నామిన్న జాతియన్నో, ఇన్నవర్ణమన్నో, ఇన్న ఆశ్రమిగళన్నో," ఎన్ఱివైఱ్ఱై యిట్టు తఙ్గళై ప్పోరప్పొలియ అభిమానిత్తిరుక్కుమ్ - ఎన్ఱై.

**(ఉలగత్తవరోడుఱవు)**- ఇప్పడి అభిమానిత్తిరుక్కుమ్, లౌకికరోడు సంబంధ ముణ్డో? - ఎన్ఱు క్రియై. ఇత్తాల్ - అకారవాచ్యనుక్కే శేషమెన్ఱు శొల్లిక్కొణ్డువన్ద శేషత్వాశ్రయమాన ఆత్మావై మకారవాచ్యనాగ చ్చొల్లుగైయాలే, ప్రకృతేః పరనాయ్, జ్ఞానానందలక్షణనాయ్, జ్ఞానగుణకనాయ్, నిత్యనా యిరుక్కుమెన్ఱు తెళిన్దిరుక్కుమ్ పరిశుద్ధాంతఃకరణర్క్కు. ఆత్మ స్వరూపత్తై ప్పారాదే, దేహత్తైయే పార్త్తు, అదిల్ సంబంధ మడియాగ వరుగిఱ జాత్యాదిగళై యిట్టు త్తఙ్గళై ప్పెరుక్క నినైత్తభిమానిత్తిరుక్కుమ్ లౌకికరోడుఱవు ఉణ్డో! అవర్గళై క్కణ్డాల్ ఉఱవఱ వార్త్తైచ్చొల్లిప్పోమిత్తనైయన్నో ఉళ్ళదు-ఎన్ఱై. తిరువహీంద్రపురత్తిలే, విల్లిపుత్తూర్ ప్పగవరెన్ఱు ప్రసిద్ధరాయిరుప్పారొరు ఉత్తమాశ్రమిగళ్ బ్రాహ్మణరెల్లారుమ్ అనుష్ఠానమ్ పణ్ణుగిఱ తుఱై యొழియ తామ్ వేఱొరు తుఱైయిల్ అనుష్ఠానమ్ పణ్ణిప్పోరువరాయ్, అవర్గళ్ ఒరునాళ్



"ఎఙ్గళ్ తుఱైయిల్ ఉమక్కు అనుష్ఠానమ్ పణ్ణవొణ్ణాదో?" ఎన్ఱు కేట్క, "విష్ణుదాసా వయం యూయం బ్రాహ్మణా వర్ణధర్మిణః, అస్మాకం దాసవృత్తీ నామ్ యుష్మాకం నాస్తి సఙ్గతిః, నాస్తి సఙ్గతి రస్మాకం యుష్మాకఞ్చ పరస్పరమ్, వయన్తు కింకరా విష్ణోః యూయ మిన్ద్రియకింకరాః" ఎన్ఱు ఉఱవఱ వార్త్తై చ్చొల్లిప్పోనారిఱే. "ఆవిద్యః ప్రాకృతః ప్రోక్తః వైద్యో వైష్ణవ ఉచ్యతే, ఆవిద్యేన న కేనాపి వైద్యః కించిత్సమాచరేత్" ఎన్నక్కడవదిఱే.

పదమూడవ పాశురం :- అవతారిక : స్వామియైన భగవంతుని విషయంలో ప్రయోజనాంతరాలను కోరకుండా, కైంకర్యాన్ని చేసేవారైనా, దేహాన్నే ఆత్మగా భావించే పామరులతో సంబంధం కల్గి ఉన్నట్లయితే, పూర్వం పల్కిన గొప్పతనానికి అది కొఱతయే కదా! - అనేప్రశ్న లేవగా, "ఆత్మస్వరూపాన్ని యథాతథంగా తెలిసినవారికి పామరులతో సంబంధం కలిగే అవకాశం ఉన్నదా?'' అని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- **(పణ్డే)** దీనివల్ల ఆత్మలన్నీ భగవానునకు శేషభూతాలై ఉండడం అనాదికాలంగా- అని చెప్పబడింది.

**(ఉయిరనైత్తుమ్)**- ఈ పదం ద్వారా భగవానునకు శేషమై ఉండడం అనేది కొందఱికి ఉన్నదై, మఱి కొందఱికి లేకుండా ఉండడం- అని కాకుండా, ఆత్మలన్నిటికి ఈ స్వభావం ఉన్నది- అని తెలుపబడింది.

**(పఙ్గయత్తాళ్నాయగఱ్కే)**- దీనిద్వారా "శేషభూతులై ఉండడం-లక్ష్మీదేవి, ఆమె వల్లభుడు - అనే ఒక మిథునానికే'' అనే విషయం, చివరలో ఉండే 'ఏ' కారం ద్వారా ఆ రీతిలో శేషమై ఉండడం ఇక వేఱెవ్వరికి లేదు - అనేది చెప్పబడింది.

**(తొణ్డామ్ ఎనత్తెళిన్ద తూమనత్తార్క్కు)**- తిరుమంత్రంలోని ఓంకారంలో మొదటి అక్షరమైన అకారంపై వచ్చి లోపించిన చతుర్థీ విభక్తిద్వారా చెప్పబడే శేషత్వాన్ని "తొణ్డు"- అని అంటున్నారు. ఈ ప్రయోగంలోని సారాంశమేమంటే- అనాదికాలంగా ఆత్మలన్నీ లక్ష్మీవల్లభుడై, అకారంచే చెప్పబడేవాడైన భగవంతునకే శేషభూతమై ఉంటాయి- అనే అన్ని వేదాల అర్థాన్ని సంగ్రహంగా

పలికే అష్టాక్షరియొక్క సంగ్రహరూపమైన ప్రణవంలో చెప్పబడే రీతిలోనే, సంశయ విపర్యయరహితంగా తెలిసిన పరిశుద్ధమనస్సును కలవారికి'' అని.

**(ఉణ్డో!)** - దీనిని (ఈ పదాన్ని) దీని తరువాత గల **"ఉలకత్తవరోడు ఉఱవు ఉణ్డో!"** అనే ప్రయోగంతో అన్వయించి అర్థాన్ని గ్రహించాలి.

**(పలకగ్ ఱుమ్ తమ్ ఉడమ్బై ప్పార్‌త్తు అభిమానిక్కుమ్)**- దీని భావమేమంటే - వేదాలు, వాటి అర్థాన్ని తెలిపే స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు - అనే శాస్త్రాలను పెక్కింటిని అభ్యసించిన తరువాత కూడా, జాతి, నాల్గువర్ణాలు, నాల్గు ఆశ్రమాలు - అనే అన్నిటికి నివాసమై ఉండే తమ దేహాన్ని చూచి, "మనం ఈ జాతికి చెందినవారం కదా! ఈ వర్ణానికి చెందినవారం కదా! మనది ఈ ఆశ్రమం కదా!'' అని వీటిని తలచి, గొప్పతనాన్ని కలవారుగా తమను అభిమానించే లోకులతో సంబంధం ఉన్నదా? - అని అన్వయించి అర్థాన్ని గ్రహించాలి.

**(ఉలకత్తవరోడు ఉఱవు ఉణ్డో)**- ఈ విధంగా అహంకరించే పామరులతో సంబంధం ఉంటుందా? - అని భావం. దీనివల్ల అకారంచే చెప్పబడే భగవానునకే శేషభూతమై ఆత్మలన్నీ ఉన్నాయి- అని తెల్పుతూ ఆ శేషత్వానికి ఆధారమైన ఆత్మయే మకారంచేత చెప్పబడుతున్నాడు- అని ప్రణవమనబడే ఓకారం తెల్పుతున్నందున, మూలప్రకృతి వికారమైన శరీరం కంటే భిన్నుడై, జ్ఞానానందాలను లక్షణంగా కలవాడై, ధర్మభూతజ్ఞానాన్ని గుణంగా కలవాడై, నిత్యుడై ఉండేవాడు - అని తెలిసి, తేటపడిన శుద్ధమనస్సును కలవారికి, ఇటువంటి ఆత్మస్వరూపాన్ని గమనించకుండా దేహాన్నే చూచి, ఆ దేహానికి సంబంధించి ఉండే జాత్యాదులను చూచి, తమను గొప్పతనాన్ని కలవారుగా తలచి, అహంకారాన్ని పొందినవారితో సంబంధం ఉన్నదా? - అని చెప్పబడి నట్లయింది. వారిని చూస్తే, వారితో సంబంధం లేని విషయాన్ని తెలిపే రీతిలో పల్కడం తగినది - అని భావం.

**"ఒణ్ కమలక్కేళ్వన్" (1), "నాణ్‌మలరాళ్‌కోన్" (2), "అమ్బుయత్తాళ్ కోన్" (3), "మాదవనుక్కు" (4), "పుండరీకైక్కేళ్వవన్" (6), "వాశమలరాళ్ మణవాళన్" (9), "పూమడన్దై కేళ్వన్" (10),** అని, **"మలర్‌మడన్దైకోన్"**అని, **"పఙ్గయత్తాళ్ నాయకత్కే"** అని ఈ పాశురంలోను నొక్కిపల్కడం చేతనుడు చేసే కైంకర్యాన్ని స్వీకరించేవారు లక్ష్మీదేవి, నారాయణుడనే దివ్యదంపతులే- అనే విషయాన్ని తెల్పుతున్నది.



ఈ విషయంలో ఒక ఐతిహ్యం శ్రీవరవరమునుల వ్యాఖ్యలో ఉట్టంకింప బడింది. అది ఏమంటే - తిరువహీంద్రపురంలో "శ్రీవిల్లిపుత్తూర్ భగవర్'' అనే ప్రసిద్ధులైన ఒక సన్న్యాసి, ఆఊరిలో ఉండే మిగిలిన బ్రాహ్మణులందరు సమీపంలో ఉండే నదిలో అనుష్ఠానం చేసికొనే రేవులో కాకుండా, వేఱొక రేవులో అనుష్ఠానం చేసికొనేవారు. ఆ విధంగా ఉండగా, "మా రేవులో మాతో కలసి మీరు ఎందుకు అనుష్ఠానం చేసికోవడం లేదు?'' అని ఒకనాడు ఆ బ్రాహ్మణులు విల్లిపుత్తూర్ భగవర్‌ను అడిగారు. అపుడు **"విష్ణుదాసా వయం యూయం బ్రాహ్మణా వర్ణధర్మిణః, అస్మాకం దాసవృత్తీనాం యుష్మాకం నాస్తి సంగతిః, నాస్తి సంగతి రస్మాకం యుష్మాకం చ పరస్పరమ్, వయం తు కింకరా విష్ణోః యూయ మింద్రియకింకరాః, అద్య ప్రభృతి హే లోకాః! యూయం యూయం వయం వయమ్, అర్థకామపరా యూయం నారాయణపరా వయమ్"** (మేము విష్ణువులకు దాసులమై ఉండేవారం. మీరు వర్ణధర్మాలను మాత్రం అనుసరించి అనుష్ఠించే బ్రాహ్మణులై ఉన్నారు. దాస్యాన్నే వృత్తిగా కల్గిన మాకు ఆ రీతిలో లేని మీతో చేరికలేదు. మాకు, మీకు ఒకరితో ఇంకొకరికి సంబంధం కొంచెం కూడా లేదు. మేము విష్ణువునకు దాసులము. మీరు ఇంద్రియాలకు దాసులు. ఓ జనులారా ! ఈ నాటినుండి మీకు మీరే మేము మేమే. మీరు అర్థకామాలలో అపేక్షను కలవారు. మేము నారాయణుని విషయంలోనే అభినివేశం కలవారం)అని వారితో సంబంధాన్ని లేకుండా చేసికొని పలికారు. **"అవిద్యః ప్రాకృతః ప్రోక్తోః వైద్యో వైష్ణవ ఉచ్యతే, అవిద్యేన న కేనాపి వైద్యః కించిత్ సమాచరేత్"** (ప్రాకృత సంబంధంతో అన్వయం కలవాడు అవిద్యుడు అనబడుతున్నాడు. విష్ణుభక్తుడైతే సంసారవ్యాధికి వైద్యుడని చెప్పబడుతున్నాడు. అవిద్యుడైన ఎవనితోను వైద్యుడు ఏవిధమైన సంబంధాన్ని కల్గి ఉండకూడదు) అని చెప్పబడింది కదా !

**14. పూదఙ్గళైన్దుమ్ పొరున్దుడలినాల్ పిఱన్ద
శాదఙ్గళ్ నాన్గినొడుమ్ శఙ్గమామ్, - పేదఙ్గొణ్డు
ఎన్న పయన్ పెఱువీర్? ఇవ్వుయిర్క్కు మిన్దిరైకోన్
తన్నడియే కాణుమ్ శరణ్**

పూతఙ్గళ్ ఐన్దుమ్ పొరున్ద = పంచభూతాళ సమ్మేళనమైన, ఉడలినాల్ పిఱన్ద= దేహంకారణంగా కల్గిన, శాతఙ్గళ్ నాన్గినోడుమ్ = బ్రాహ్మణులు మొదలైన నాల్గు వర్ణాలతో, శఙ్గతమామ్ = చేరి ఉండే, పేదమ్ కొణ్డు = హెచ్చు తగ్గులను పురస్కరించు కొని, ఎన్న పయన్ = ఏమి ప్రయోజనాన్ని, పెఱువీర్ = పొందు తారు? ఎవ్వుయిర్ క్కుమ్ (ఎ ఉయిర్క్కుమ్) = ఆత్మలన్నిటికి, ఇన్దిరై కోన్తన్= ఇందిరావిభుని, అడియే= శ్రీచరణాలే, శరణ్ కాణుమ్ = శరణం అని భావించండి.

(మూఢులారా!) పంచభూతాల కలయిక అయిన దేహంవల్ల కలిగే నాల్గు జాతులకు చెందిన భేదభావనను కలవారై మీరు ఏ ప్రయోజనాన్ని పొందబోతున్నారు! ఆ ఆత్మలకు శ్రియఃపతి శ్రీచరణాలే శరణం సుమా!

పదినాలామ్ పాట్టు :- అవతారికై - స్వరూపజ్ఞానముణ్డానాలుమ్, దేహమ్ ఇరుక్కున్ద నైయుమ్, జాత్యాదిభేద ప్రతిపత్తి అనువర్తియాదో? ఎన్న, అత్తాల్ ఎన్న ప్రయోజనమ్? సకలాత్మాక్కళుక్కుమ్, శ్రియఃపతి తిరువడిగళిలే కాణుజ్గోళ్ పుగల్ - ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ : **(పూదఙ్గళైన్దుమ్ పొరున్దుడలినాల్ ప్పిఱన్ద)-** "పంచ భూతాత్మకే దేహే" ఎన్టుమ్, "మఞ్జుశేర్ వానెరి నీర్ నిలఙ్గాలివై మయఙ్గి నిన్టఞ్జు శేరాక్కై" ఎన్టుమ్ శొల్లుగిఱపడియే పృథివ్యాది భూతఙ్గళ్ ఐన్దినుడైయవుమ్, సముదాయరూపమాన దేహమడియాగ ఉణ్డాన. ఇత్తాల్ - ఆత్మావోడు అన్వయ మన్టిక్కే, ఉపచయాత్మక మాయ్, అనిత్యమాయ్ హేయమా యిరుక్కిఱ దేహమడియాగ ఉణ్డానదా గైయాలే, వన్దేఱి ఎన్నుమిడమ్ శొల్లుగిఱదు.

**(శాదఙ్గళ్ నాన్గినోడుమ్) - శాదమెన్టు జాతియై చ్చొల్లుగిఱదు. "జాతిరాజాతం చ సామాన్యమ్" ఎన్నక్కడవదిఱే. శాదఙ్గళ్ నాన్గెన్టు బ్రాహ్మణ జాతి ముదలాన నాలు జాతియైయుమ్ - శొల్లుగిఱదు.**



**(నాన్గినోడుమ్ శఙ్గదమామ్ పేదఙ్గొణ్డు)** - పేదమావదు, ఇన్నాలినోడుమ్ శేర్న్దిరుక్కిఱ ఉత్కర్షాపకర్షప్రతిపత్తి హేతువాన విశేషమ్. ఇన్ద బ్రాహ్మణజాతియై ప్పన్*ఱి*యిఱే ఆశ్రమాది భేదఙ్గళ్ వరువదు. ఆగైయాలే, శాదఙ్గళ్ నాన్గినోడుమ్ శఙ్గదమామ్ పేదమెన్ట ఇదిలే ఎల్లామ్ శొల్లలామ్.

**(ఎన్న పయన్ పెఱువీర్)-** ఇన్ద భేదఙ్గొణ్డు ఎన్న ప్రయోజనమ్ పెఱువు దిర్గోళ్ ఇత్తాల్? ఉఙ్గళుక్కేదేనుమ్ సిద్ధిప్పదుణ్డో! అహంకారహేతువాగైయాలే, అనర్థకరమామిత్తనైయన్టో ఉళ్ళదెన్టు కరుత్తు. "ఎన్న పయన్ కెడువీర్!" ఎన్టు పాఠమాగిల్, ఇన్ద భేదఙ్గొణ్డెన్న ప్రయోజనముణ్డు కెడువీర్ గోళ్? ఎన్టుగప్పాలే యరుళిచ్చెయ్దారాగ క్కడవదు.

**(ఎవ్వుయిర్క్కు మిన్దిరైకోన్ తన్నడియే కాణుమ్ శరణ్)-** ఇన్నార్ ఇనియార్ - ఎన్నాదే, ఎల్లా ఆత్మాక్కళుక్కుమ్ శ్రియఃపతియానవన్ తిరువడిగళే కాణుజ్గోళ్ పుగల్. ఆగైయాల్, ఇన్ద తిరువడిగళిల్ సంబంధత్తై యిట్టు నిరూపిక్కుమ్బోదు, ఇన్ద భేదఙ్గళొన్టు మిల్లామైయాలే ఎల్లామౌపాధికమ్. అదువే నిలైనిన్ట వేషమెన్టు కరుత్తు. "దేహాత్మజ్ఞానకార్యేణ వర్ణభేదేన కిం ఫలమ్? గతి స్సర్వాత్మనాం శ్రీమన్నారాయణపదద్వయమ్" ఎన్టివ్వర్థన్దాన్ పరమైకాంతి ధర్మత్తిల్ శొల్లప్పట్టదిఱే.

పదునాల్గవ పాశురం :- అవతారిక : "దేహం ఉన్నంతవరకు జాతిభేదం వల్ల కలిగే భేదభావన అనువర్తించదా?" అనే ప్రశ్న రాగా, "దానివల్ల ఏమి ప్రయోజనం? అన్ని ఆత్మలకు, వారి ఏ జాతికి చెందినవారై ఉన్నా, శ్రియఃపతి శ్రీచరణాలే రక్షకం- అనే విషయాన్ని తెలుసుకోండి" అని అంటున్నారు.

వ్యాఖ్యానమ్ : **(పూదఙ్గళ్ ఐన్దుమ్ పొరున్దు ఉడలినాల్ పిఱన్ద)-** "పంచభూతాత్మకే దేహే దేహీ మోహతమో వృతః, అహం మమేతదిత్యుచ్చైః కురుతే కుమతి ర్మతిమ్" (విష్ణుధర్మమ్-6-7-12) (పూర్వకర్మవాసనవల్ల పంచభూతాలతో రూపొందిన శరీరాన్ని కల, భ్రాంతిని కల ఆత్మ నేను, నాది (అహం, మమ) అని తనను గొప్పవానినిగా భావిస్తున్నాడు)అని, "మఞ్జు శేర్ వానెరి నీర్ నిలమ్ కాల్ ఇవై మయఙ్గి నిన్ట అఞ్జు శేర్ ఆక్కైయై" (పెరియ

తిరు-9-7-8) (మేఘాలు చేరే ఆకాశం, అగ్ని, నీరు, భూమి, వాయువు - అనే ఇవి కూడి వర్తించే పాంచభౌతిక శరీరాన్ని) అని చెప్పబడిన రీతిలో భూమి మొదలైన అయిదు భూతాల చేరిక రూపంలో ఉండే శరీరం కరణంగా కల్గిన - అని భావం. దీనివల్ల, ఆత్మ స్వరూపంతో సంబంధం లేకుండా వృద్ధి చెందేదై, ఒకనాడు నశశించేదై, నీచమై ఉండే దేహం కారణంగా కల్గినవి అయినందున జాతులు ఆత్మకు సోపాధికాలు (ఆగంతుకాలు)- అనే విషయం తెలుపబడింది.

**(శాతజ్గళ్ నాన్గినొడుమ్)**- **"శాతమ్"** అనే పదం జాతిని తెల్పుతుంది. **"జాతిర్జాతం చ సామాన్యమ్"** (అమరకోశం - 1-5-31) (జాతి, జాతం, సామాన్యం అనే ఈ పదాలు జాతివాచకాలు) అని అమరకోశంలో చెప్పబడింది కదా! **"శాతజ్గళ్ నాన్గు"** అని బ్రాహ్మణ, క్షత్రి, వైశ్య, శూద్రులనబడే నాల్గు జాతులను తెల్పుతున్నది.

**(నాన్గినోడుమ్ శజ్గదమామ్ పేదమ్ కొణ్డు)**- **"పేదమ్"**- అంటే ఈ నాల్గు జాతులతోను సంబంధించి ఉండే ఉచ్చనీచభావనకు కారణమైన గొప్పతనాన్ని తెల్పుతున్నది. ఇందులో, ఈ బ్రాహ్మణజాతిని పురస్కరించుకొని కదా సన్యాసి, గృహస్థుడు, వానప్రస్థుడు, బ్రహ్మచారి- అనే ఆశ్రమభేదాలు కల్గుతాయి. అందువల్ల **"శాతజ్గళ్ నాన్గినొడుమ్ శజ్గదమామ్ పేతమ్"** అనే ప్రయోగంలో ఆశ్రమభేదాలను కూడా కలిపి అర్థాన్ని చెప్పవచ్చు.

**(ఎన్న పయన్ పెఱువీర్!)** - ఈ భేదాలను పురస్కరించుకొని ఏమి ప్రయోజనాన్ని పొందుతారు? వీటి ద్వారా మీకు ఏదయినా లాభం కల్గుతుందా? "నేను ఉన్నతుడను'' అనేది అహంకారాన్ని పొందడానికి కారణమైనందున చెడ్డను కల్గించేదిగా కదా ఉన్నది - అని భావం. **"ఎన్న పయన్ కెడువీర్?"** అనేది పాఠం అయితే, "దీనివల్ల చెడ్డయే కల్గుతుంది'' అని తెల్పుతున్నట్లుగా గ్రహించాలి.

**(ఎవ్వుయిర్క్కుమ్ ఇన్దిరైకోన్ తన్నడియే కాణుమ్ శరణ్)**- "వీరు, ఇటువంటివారు''- అనే భేదం లేకుండా ఆత్మలన్నిటికి లక్ష్మీనాథుని శ్రీచరణాలే కదా రక్షకం. అందువల్ల సర్వేశ్వరుని శ్రీచరణాల సంబంధాన్ని పురస్కరించుకొని



పరిశీలించినపుడు, ఈ వర్ణాశ్రమభేదాలవల్ల కల్గిన లాభం ఏమీ లేనందున, అన్నీ సోపాధికాలు. శ్రీచరణాలలో శేషత్వమే స్థిరమైనది- అని భావం. **"దేహాత్మ జ్ఞానకార్యేణ వర్ణభేదేన కిం ఫలమ్? గతిః సర్వాత్మానాం శ్రీమన్నారాయణ పదద్వయమ్"** (పరమైకాంతి ధర్మమ్) (దేహమే- ఆత్మ అనే భ్రమించడంవల్ల ఏర్పడిన వర్ణాశ్రమభేదం వల్ల ఏమి ప్రయోజనమున్నది? అన్ని ఆత్మలకు శ్రీమన్నారాయణుని శ్రీచరణద్వయమే కదా రక్షకం) అని చెప్పబడింది కదా!

**15. కుడియుమ్ కులముమెల్లామ్ కోకనగైక్కేళ్వన్,**
**అడియార్క్కవనడియే యాగుమ్, - పడియిన్ మేల్**
**నీర్కె(కొ)*ళ్ళు*వు మాఱుగళిన్ పేరుమ్ నిఱముమెల్లామ్,**
**ఆర్కలియై చ్చేర్న్దిదు మాయ్న్దఱ్*ఱు*.**

కుడియుమ్ = గ్రామం, కులముమ్ = గోత్రం, ఎల్లామ్ = ఇంకా ఉండే సూత్రం మొదలైనవి అన్నీ, కోకైనకై క్కేళ్వన్ అడియార్క్కు = లక్ష్మీవల్లభుని దాసులకు, అవన్ అడియే ఆకుమ్ = స్వామి అయిన భగవానుని శ్రీచరణాల సంబంధమే అవుతున్నాయి, పడియిన్ మేల్ = భూమిపై కన్పించే, నీర్ కె(కొ)*ళ్ళు*వుమ్= జలం నిండుగా ఉండే, ఆఱుకళిన్ = నదుల, పేరుమ్ = పేర్లు, నిఱముమ్ ఎల్లామ్ = రంగులు అన్నీ, ఆర్ కలియై శేర్న్దు = సముద్రాన్ని చేరిన తరువాత, మాయ్న్దిడుమ*ఱ్ఱు*= అదృశ్యమైపోయినట్లే ఇదికూడా.

లక్ష్మీనాథుడైన భగవానుని భక్తులకు గ్రామకులాదులు అన్నీ ఆ భగవానుని శ్రీచరణ సంబంధాన్ని పురస్కరించుకొనే ఉంటాయి. ఏవిధంగా? అంటే, భూమిపైన కన్పించే నీటితో నిండిన నదుల పేర్లు, నీటి రంగులు – అన్నీ సముద్రాన్ని చేరిన తరువాత కన్పించకుండా పోయే రీతిలోనే.

పదినఞ్జామ్‌పాట్టు :- అవతారికై - **"ఎవ్వుయిర్క్కు మిన్దిరైకోన్ తన్నడియే కాణుమ్ శరణ్"** ఎన్ఱత్తై స్థాపిక్కైక్కాగ, శ్రియఃపతివిషయ శేషత్వైక నిరూపకరా నవర్గళుక్కు మున్బు నిరూపకమాయ్‌ప్పోరుమ్ గ్రామకులాదిగళ్ ఎల్లామ్ అవన్ తిరువడిగళే యామెన్ను మత్తై, సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ : **(కుడియుఙ్గులము మెల్లామ్)** - కుడి- గ్రామమ్, కులమ్ - గోత్రమ్, ఎల్లామెన్ఱదు - మఱ్ఱుమ్ నిరూపకమాయ్ప్పోరుమవై పలవుముణ్డాగైయాలే. అవైయావన- చరణసూత్రాదిగళ్.

**(కోకనగైక్కేళ్వనడియార్క్కు)**- శ్రియఃపతియినుడైయ, అడియారానవర్గళుక్కు. కోకనగమావదు - తామరై, కోకనగై యెన్ఱదు- తామరైయాళ్- ఎన్ఱపడి. కేళ్వనెన్ఱదు - నాయకనెన్ఱపడి. ఏవంభూతనానవన్ తిరువడికళిల్ శేషత్వమే నిరూపకమాగ ఉడైయవర్గళుక్కు.

**(అవనడియే యాగుమ్)**- అదావదు- మున్బు ఔపాధిక నిరూపకమాయ్ప్పోన్ద కుడియుమ్, కులము మెల్లామ్ పోయ్, శేషియానవన్ తిరువడిగళిల్ సంబంధమే నిరూపకమాయ్, అత్తై యిట్టు వ్యపదేశిక్కుమ్బడియాయ్ విడుమెన్ఱై. ఇదుక్కు దృష్టాంతమ్ అరుళిచ్చెయ్గిఱార్- మేల్.

**(పడియిన్మేల్ ఎన్ఱు తొడఙ్గి)** - అదావదు, భూమియిన్ మేలుణ్డాన జలసమృద్ధియైయుడైయ నదిగళిన్ నామముమ్, వర్ణముమెల్లామ్ సముద్రత్తై ప్రవేశిక్కవే, పిన్బు కాణవొణ్ణాదపడి పోమాప్పోల్- ఎన్ఱై. పడి- భూమి, కె(కొ)ழுవుదల్- మిగువుదల్, ఆర్కలి- సముద్రమ్. "ఏకాంతీ వ్యపదేష్టవ్యో నైవ గ్రామకులాదిభిః, విష్ణునా వ్యపదేష్టవ్య స్తస్య సర్వం స ఏవ హి", "నద్యా నశ్యతి నామాది ప్రవిష్టాయా యథార్ణవమ్, సర్వాత్మనా ప్రపన్నస్య విష్ణు మే కాంతిన స్తథా" ఎన్నక్కడవదిఱే.

పదిహేనవ పాశురం :- అవతారిక : గడచిన పాశురం చివరలో **"ఎవ్వుయిర్క్కుమ్ ఇన్దిరైకోన్ తన్నడియే కాణుమ్ శరణ్"** అని చెప్పిన విషయాన్ని స్థిరీకరించడం కోసం లక్ష్మీనాథునకు శేషమై ఉండడమే అసాధారణ లక్షణంగా కలవారికి ఇక్కడ ఉండే గ్రామం, కులం మొదలైనవానివల్ల కలిగే పేర్లు అన్నీ అతని శ్రీచరణాలే- అనే విషయాన్ని ఉదాహరణాన్ని చూపి పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- **(కుడియుమ్ కులముమ్ ఎల్లామ్)** "కుడి"- గ్రామం, "కులమ్''- గోత్రం. "ఎల్లామ్" అనేది ఇది తప్ప వీరికి అసాధారణ లక్షణంగా



చెప్పబడే మిగిలిన అన్నిటిని తెల్పుతున్నది. అవి ఏవి? అంటే, చరణం, సూత్రం మొదలైనవి.

**(అవన్ అడియే యాకుమ్)**- దీని భావమేమంటే -పూర్వం అసాధారణ లక్షణమై ఉండే కులం, గ్రామం మొదలైనవి అన్నీ తొలగి, స్వామి అయిన లక్ష్మీవల్లభుని శ్రీచరణాల సంబంధమే అసాధారణలక్షణమై, దానిని పురస్కరించుకొనేవారిని నిర్దేశించి పలికేటట్లుగా ఉంటుంది. దీనికి దృష్టాంతాన్ని ఈ పాశురం చివరలో పల్కుతున్నారు.

**(కోకనకైక్కేళ్వన్ అడియార్క్కు)** - లక్ష్మీనాథునకు దాసులై ఉండేవారికి- అని భావం. "కోకనకమ్" అనే పదం తామరపూవును తెల్పుతున్నందున "కోకనకై" - అనేది పద్మనివాసిని అయిన లక్ష్మీదేవిని తెల్పుతున్నది. "కేళ్వన్" అనే పదానికి నాథుడు-అని అర్థం. ఈ ప్రయోగానికి - "లక్ష్మీనాథుని శ్రీచరణాలలో దాస్యమే అసాధారణ లక్షణంగా కల్గినవారికి'' అని భావం.

**(పడియిన్ మేల్ నీర్ కె(కొ)ழுవుమ్ ఆఱుకళిన్ పేరుమ్ నిఱముమ్ ఎల్లామ్ ఆర్క్కలియై చ్చేర్న్దిడుమాయ్న్దఱ్ఱు)** దీని తాత్పర్యం ఏమంటే- భూమిలో ఉండే నీటి ప్రవాహాన్ని కల నదులపేర్లు, రంగు మొదలైనవి అవి సముద్రంలో ప్రవేశించిన తరువాత కన్పించని రీతిలో- అని అర్థం. "పడి" భూమి, "కె(కొ)ழுవు దల్"- మిగలడం, "ఆర్కలి" సముద్రం.

"ఏకాంతీ వ్యపదేష్టవ్యో నైవ గ్రామకులాదిదిభిః, విష్ణునా వ్యపదేష్టవ్యః తస్య సర్వం స ఏవ హి" (విష్వక్సేన సంహిత) (భగవానుని ఒక్కనిమాత్రమే శరణు పొందిన పరమైకాంతిని అతని గ్రామం, కులం మొదలైనవానిని పురస్కరించుకొని వ్యవహరించరాదు. విష్ణువును పురస్కరించుకొనే వ్యవహరించాలి. ఎందుకంటే, అతనికి ఆ స్వామియే సర్వం కనుక) అని, **"నద్యా నశ్యంతి నామాని ప్రవిష్టాయా మహార్ణవమ్, సర్వాత్మనా ప్రపన్నస్య విష్ణుమేకాంతిన స్తథా"** (పరమైకాంతిధర్మమ్)- (సముద్రంలో కలిసిన నదుల పేర్లు నశించిపోయేటట్లే, భగవంతుని సమస్తంగా కల్గిన ఏకాంతి అయిన ప్రపన్నుని ప్రాకృతనామాలన్నీ నశించిపోతాయి) అని చెప్పబడిందికదా!

**16. తేవర్ మనిశర్ తిరియక్కు త్తావరమామ్**
**యావైయు మల్ల నిలగు ముయిర్, - పూవిన్ మిశై**
**ఆరణజ్గిన్ కేళ్వన్ అమలనతివే వడివామ్,**
**నారణన్ తాట్కే యడిమై నాన్.**

నాన్ = "అహమ్" (నేను) అనబడే నా ఆత్మ, దేవర్ = దేవతలు, మనిశర్= మానవులు, తిరియక్కు = పశుపక్ష్యాది తిర్యక్కులు, తావరమ్ ఆమ్ = స్థావరాలు- అనే, యావైయుమ్ అల్లన్ = ఇది ఏమి కాదు, దేహంకంటే విలక్షణుడు, పూవిన్ మిశై= తామరపూవులో నివసించే, ఆరణజ్గిన్ = లక్ష్మీదేవికి, కేళ్వన్ = నాథుడై, అమలన్= హేయప్రతిభటుడై, అతివే వడివామ్ = జ్ఞానానందస్వరూపుడైన, నారణన్= నారాయణాన్ని, తాట్కే = శ్రీచరణాలకే, అడిమై = శేషమై, ఇలకుమ్= ప్రకాశిస్తాడు, ఉయిర్ = జీవుడై ఉండేవాడు.

ప్రకాశించే జీవుడు దేవమనుష్య తిర్యక్ స్థావరాలలో దేనికీ చెందినవాడు కాడు. తామరపూవులో పొందికగా నివసించే దైవకాంత అయిన లక్ష్మీదేవికి వల్లభుడై, అఖిల హేయప్రత్యనీకుడై, జ్ఞానస్వరూపి అయిన నారాయణుని శ్రీచరణాలకే అహమర్థభూతుడైన ఆత్మ శేషభూతుడు.

పదినాఱామ్పాట్టు :- అవతారికై - స్వరూపయాథాత్మ్యజ్ఞానమ్ పిఱన్దవర్ గళ్ తన్దామై అనుసంధిత్తిరుక్కు మ్బడియై, స్వనిష్ఠాకథనముఖేన అరుళిచ్చెయ్ గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (తేవర్ మనిశర్ తిరియక్కు త్తావరమామ్) - దేవరగళ్, మనుష్యర్గళ్, తిర్యక్కు, స్థావరమాగిఱ.

(యావైయు మల్లన్)- సకలము మల్లన్. ఓరాత్మా, తాన్ అనేక కర్మభేదత్తాలే, దేవాదిచతుర్విధ యోనిగళిలుమ్ జనిక్కుమిఢే. అవ్వోయోనిగళిలే జనిత్తాల్, "దేవోఽహమ్, మనుష్యోఽహ"మెన్ఱు, అవ్వో దేహజ్గళిలే, అహం బుద్ధియై పృణ్ణి ప్పోరక్కడవదాయిఢే యిరుప్పదు. అదు, ఆత్మస్వరూపజ్ఞానమ్ పిఱప్పదర్క్కు మున్బిఢే. ఇదు, స్వరూపజ్ఞానమ్ పిఱన్దదఱ్పిన్ వార్త్తైయిఢే.



(ఇలగు ముయిర్)- జ్ఞానానందలక్షణమాయ్, ఉజ్వలమాన ఆత్మా.

(నాన్)- ఏవంభూతనాన నాన్.

(పూవిన్మిశై యారణజ్గికేళ్వ నమలనతివే వడివామ్ నారణన్తాట్కే యడిమై)- అదావదు- "మలర్ మేలుఱైవాళ్" ఎన్గిఱపడియే. పూవిన్ మేలే వర్త్తిప్పాళాయ్, దివ్యాకారైయాన పెరియపిరాట్టియారుక్కు వల్లభనాయ్, హేయప్రత్యనీకనాయ్, జ్ఞానానందైకస్వరూపనాన నారాయణనుడైయ తిరువడిగళుక్కే శేషమానవన్-ఎన్గై. అణజ్గు- ఎన్దదు - దైవప్పెణ్ -ఎన్దపడి. అమలనెన్దదు - మలప్రతిభట నెన్దపడి. నారణనెన్దదు- స్వవ్యతిరిక్త సమస్త వస్తుక్కళుమ్ తనక్కు ప్రకారమాయ్, తాన్ ప్రకారియా యిరుక్కుమవనెన్దపడి. "నాహం దేవో న మర్త్యో వా న తిర్యక్స్థావరోఽపి వా, జ్ఞానానందమయ స్త్వాత్మా శేషో హి పరమాత్మనః", "నాహం విప్రో న చ నరపతి ర్నాపి వైశ్యో న శూద్రో నో వా వర్ణీ న చ గృహపతి ర్నో వనస్థో యతి ర్వా, కిన్తు శ్రీమద్భువనభవనస్థిత్య పాయైకహేతో ర్లక్ష్మీభర్తు ర్నరహరితనో ర్దాసదాసస్య దాసః" ఎన్నక్కడవదిఢే.

పదహారవ పాశురం :- అవతారిక : స్వరూపాన్నిగూర్చి యథాతథంగా తెలిసిన వారు తమను ఏవిధంగా భావించాలి? - అనే విషయాన్ని తమ అభిప్రాయాన్ని చూపుతూ పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (దేవర్ మనిశర్ తిరియక్కు త్తావరమామ్) - దేవతలు, మానవులు, అడ్డంగా సంచరించే (పెరిగిన) జంతువులు, పక్షులు, స్థావరాలు- అనే నాల్గు విధాలైన శరీరాలు.

(యావైయుమ్ అల్లన్) - అనే ఇవి ఏమీ నేను (అనే ఆత్మ) కాదు. ఆత్మస్వరూపం - పలు రీతులలోని కర్మల వ్యత్యాసంవల్ల, ముందు తెల్పిన దేవాదులైన ఆజన్మలలో జన్మించేటపుడు "నేను దేవుడను", "నేను మానవుడను" అని ఆయా శరీరాలనే "నేను" (ఆత్మ) అని తలచి ఉండేటట్లుగా కదా ఉంటుంది. ఈవిధంగా భావించడం ఆత్మకు తన స్వరూపాన్ని గూర్చిన జ్ఞానం కలుగడానికి ముందు, ఇపుడు "ఇవి ఏమీ కాదు" అని పల్కడం స్వరూపాన్ని గూర్చిన జ్ఞానం కల్గిన తరువాత కదా!

**(ఇలకుమ్ ఉయిర్)** -జ్ఞానాన్ని, ఆనందాన్ని లక్షణంగా కల్గినదై, వెల్గుతూ ఉండేది ఆత్మ. ఇటువంటి నేను,

**(పూవిన్ మిశై ఆరణఙ్గిన్ కేళ్వన్ అమలన్ అఱివే వడివామ్ నారణన్ తాట్కే అడిమై)**- దీని తాత్పర్యమేమంటే- **"మలర్ మేల్ ఉఱైవాళ్"** (తిరువాయ్- **4-5-2)** (తామరపూవుపై నిత్యవాసం చేసే లక్ష్మి) అనే రీతిలో తామరపూవులో నిత్యం వాసం చేస్తున్నదై, అప్రాకృతమైన దివ్యమంగళరూపాన్ని కల్గిన లక్ష్మీదేవికి ప్రియవల్లభుడైన, దోషాలకు ప్రతిభటమైనదై, జ్ఞానానందాలే మూర్తీభవించిన నారాయణుని శ్రీచరణాలకే శేషభూతుడు - అని భావం. **"అణఙ్గు"** - అనేది **"శూడుమ్ అణఙ్గుమ్ దెయ్వ ప్పెణ్ణే"** అనే ద్రావిడ నిఘంటువచనాన్నిబట్టి దైవకాంతను నిర్దేశిస్తుంది. **"అమలన్"** అనే పదానికి దోషాలకు ప్రతిభటమైనవడు - అని అర్థం. **"నారణన్"** అనేది తనకంటే వేఱయిన సమస్త వస్తువులు తనను విడచి ఉండని ప్రకారభూతాలై, తాను వాటితో కూడి ఉండే ప్రకారియై ఉండేవాడు - అనే అర్థాన్ని ఇస్తుంది.

**"నాహం దేవో న గంధర్వో న తిర్యక్ స్థావరోఽపి వా, జ్ఞానానందమయ స్త్వాత్మా శేషో హి పరమాత్మనః"** (నేను దేవుడను కాను, మానవుడను కాను, తిర్యక్కులనబడే జంతువులు, పక్షులు కాను. స్థావరంకూడా కాను. జ్ఞానానందాలనే స్వరూపంగా కల్గినదై, భగవంతునకు శేషభూతమై ఎండే ఆత్మయే కదా నేను). **"నాహం విప్రో న చ నరపతిః నాపి వైశ్యో న శూద్రః, నైవావర్ణీ న చ గృహపతిః నో వనస్థో యతిర్వా, కింతు శ్రీమత్ భువనభవన స్థిత్యపాయైకహేతోః లక్ష్మీభర్తుః నరహరితనోః దాసదాసస్య దాసః"** (నేను బ్రాహ్మణుడను కాను, క్షత్రియుడను కాను, వైశ్యుడను కాను, శూద్రుడను కాను. బ్రహ్మచారి కాను, గృహస్థుడను కాను, వానప్రస్థుడను కాను, సన్న్యాసిని కాను. అయితే అందమైన ఈ లోకం అంతా జన్మించడానికి, నిలచి ఉండడానికి, లయం పొందడానికి అద్వితీయకారణమై, లక్ష్మీనాథుడైన నరసింహుని దాసుల దాసుల దాసులకు దాసుడను అని చెప్పబడింది.)



**17. ఒన్ఱిడుగ విణ్ణవర్కోన్ శెల్వమొழிన్దిడుగ,**
**ఎన్ఱు మిఱవాతిరున్దిడుగ, - ఇన్రే**
**ఇఱక్క క్కళిప్పుమ్ కవర్వుమ్, ఇవ*ఱ్ఱాల్***
**పిఱక్కుమో త*న్ఱ*ెళిన్ద పిన్.**

విణ్ణవర్ కోన్ = దేవతలకు నాథుడైన ఇంద్రుని, శెల్వమ్ = గొప్ప సంపద, ఒన్ఱిదుక = తానే వచ్చి చేరనీ, ఒழிన్దిడుక = ఉండే ఆ సంపద విడచిపోనీ, ఎన్ఱుమ్= అన్ని సమయాలలోను, ఇఱవాదు ఇరున్దిడుక = మరణంలేని జీవితం కలగనీ, (ఆ రీతిలోకాకుండా), ఇన్ఱే = ఇపుడే ఇఱక్క = మరణం సంభవించనీ, ఇవ*ఱ్ఱాల్*= పైన పేర్కొన్న దానివల్ల కలిగే, కళిప్పుమ్ = గర్వం, కవర్వుమ్ = దుఃఖం, తన్ తెళిన్ద పిన్ = తన స్వరూపాన్ని చక్కగా తెలిసికొన్న తరువాత, పిఱక్కుమో = కలుగుతాయా?

దేవేంద్రుని ఐశ్వర్యం వచ్చి చేరినా చేరనీ; లేక, ఉండే సంపద నశిస్తే నశించనీ. ఏనాడూ మరణం లేని జీవనం కల్గినా కల్గనీ; లేక, ఇపుడే మరణం కల్గినా కల్గనీ. స్వస్వరూపజ్ఞానం కల్గిన తరువాత ఈ మంచిచెడ్డలవల్ల, లాభనష్టాలవల్ల ఏవిధమైన క్లేశమైనా భక్తులుకు కల్గుతుందా?

పదినే**ழாమ్**పాట్టు :- అవతారికై - స్వరూపజ్ఞానమ్ పిఱన్దవన్, తన్నై అనుసంధిత్తిరుక్కుమ్బడియై, స్వనిష్ఠాకథనముఖేన అరుళిచ్చెయ్‌దార్, కీ**ழ்** ప్పాట్టిల్. ఐశ్వర్యత్తినుడైయ ఆగమాపాయఙ్గళుమ్, ఆయుస్సినుడైయ స్థైర్యాస్థైర్యఙ్గళుమడియాగ అజ్ఞరానవర్ గళుక్కుణ్డాన గర్వక్లేశఙ్గళ్, ఆత్మస్వరూపత్తై యఱిన్దవనుక్కు ఉణ్డాగాదెన్నుమత్తై అరుళిచ్చెయ్‌గిఱార్, ఇప్పాట్టిల్.

వ్యాఖ్యానమ్ :- **(ఒన్ఱిడు గవిణ్ణవర్కోన్ శెల్వమ్)** - దేవర్గళుక్కు నిర్వాహకనాన ఇన్ద్రనుడైయ ఐశ్వర్యమానదు, అపేక్షియాదిరుక్క చ్చెయ్‌దే, తానే వన్దు శేర్న్దిడుగ.

**(ఒழிన్దిడుగ)** - అప్పడి యిరున్దుళ్ళ ఐశ్వర్యమానదు ఇని క్కూడా దెన్నుమ్బడి, తన్నోడన్వయమ*ఱ్ఱు* ప్పోయిడుగ.

**(ఎన్రుమిఱవాదిరున్దిడుగ)**- ఎక్కాలత్తిలుమ్ మరణరహితనా యిరున్దిడుగ.

**(ఇన్రే యిఱక్క)**- అప్పడి దీర్ఘమాగ ఇరామల్ ఇన్రుదానే మరణమాగ.

**(కళిప్పుమ్ కవర్వు మివఱ్ఱాల్ పిఱక్కుమో తఱ్ఱెళిన్ద పిన్)**- అదావదు- ఐశ్వర్యాగమముమ్, ఆయుఃస్థైర్యముమ్, ఐశ్వర్యవినాశముమ్, ఆయుః క్షయముమాగ ప్పిఱిత్తు ఇరణ్డు వగైయాగ చ్చొన్న ఇవైఱ్ఱాల్, నాట్టార్క్కు ప్పిఱక్కుమ్ గర్వక్లేశఙ్గళ్, తన్ స్వరూపత్తై త్తాన్ తెళియ క్కణ్డపిన్బు పిఱక్కుమో? ఎన్రై. తఱ్ఱెళిగైయావదు, తన్నై త్తెళిగై. అదావదు - స్వస్వరూపజ్ఞానమ్. "ఆగచ్ఛతు సురేంద్రత్వం నిత్యత్వమ్ వాఽద్య వా మృతిః తోషమ్ వాఽత్ర విషాదమ్ వా నైవ గచ్ఛంతి పండితాః" ఎన్నక్కడవదిఱే.

పదిహేడవ పాశురం :- అవతారిక : గత పాశురంలో స్వరూపాన్నిగూర్చిన జ్ఞానం కల్గిన తరువాత తనను ఏవిధంగా భావించాలి? అనే విషయాన్ని తమ అభిప్రాయ రూపంగా పలికారు. ఇక, ఈ పాశురంలో- సంపద కల్గినందువల్ల, పోయినందువల్ల, ఆయుస్సు దీర్ఘంగా ఉన్నందువల్ల, తక్కువగా ఉన్నందువల్ల అజ్ఞానులకు కలిగే గర్వం, దుఃఖం మొదలైనవి ఆత్మస్వరూపాన్ని తెలిసినవారికి కలుగదు- అని అంటున్నారు.

వ్యాఖ్యానం :- **(ఒన్రిడుగ విణ్ణవర్కోన్ శెల్వమ్)**- దేవతలకు ప్రభువైన ఇంద్రుని గొప్ప సంపద, దానిని అక్కరలేదని అన్నపుడే, తానే వచ్చి చేరినా చేరనీ.

**(ఒఴిన్దిడుకగ)** అటువంటి మహైశ్వర్యం ఇకపై వచ్చి ఏనాడూ వచ్చిచేరదు- అనే విధంగా పూర్తిగా కోల్పోనీ,

**(ఎన్రుమ్ ఇఱవాదు ఇరున్దిడుకగ)**- ఏకాలంలోను మరణం కల్గని రీతిలో నిత్యంగా ఉండనీ,

**(ఇన్రే ఇఱక్క)**- ఆవిధంగా దీర్ఘమైన ఆయుస్సు లేకుండా ఇపుడే ఈనాడే మరణం కలుగనీ.



**(కళిప్పుమ్ కవర్వుమ్ ఇవఱ్ఱాల్ పిఱక్కుమో తఱ్ఱెళిన్దపిన్)**- దీని భావమేమంటే- సంపదయొక్క రాక,పోక, ఆయుస్సు దీర్ఘమై ఉండడం, తక్కువగా ఉండడం- అని ఈ రీతిలో రెండు విధాలుగా విభజించి పల్కిన వీటిద్వారా లోకంలోని పామరులకు కలిగే గర్వం, దుఃఖం అనేవి తన స్వరూపాన్ని తాను స్పష్టంగా గ్రహించిన తరువాత కల్గుతాయా? అని భావం. కలుగవు - అని సారం. **"తఱ్ఱెళిన్ద"** - అంటే తనను గూర్చి తాను తెలిసికోవడం. అంటే - ఆత్మస్వరూపజ్ఞానం. **"ఆగచ్ఛతు సురేంద్రత్వం నిత్యత్వం వాద్య వా మృతిః, తోషం వాఽత్ర విషాదం వా నైవ గచ్ఛంతి పండితాః"** (ఇంద్ర పదవి లభించనీ, ఏనాటికీ మరణించని రీతిలో నిత్యత్వం లభించనీ, ఈనాడే మరణించేస్థితి కలుగనీ. వీటివల్ల ఏవిధమైన సంతోషాన్ని కాని, దుఃఖాన్నికాని జ్ఞానులు పొందరు) - అని చెప్పబడిందికదా!

**18. ఈన మిలా అన్బరెన్రాలు మెయ్దిలా**
**మానిడరై, యెల్లా వణత్తాలుమ్, - తానఱియ**
**విట్టార్క్కెళియన్ విడాదార్క్కు, అఱవరియన్**
**మట్టార్ తుఴాయలఙ్గల్మాల్**

మట్టు ఆర్ = మకరందం నిండుగా కల, తుఴాయ్ అలఙ్గల్ = తులసీ మాలికచే అలంకరింపబడిన, మాల్ = సర్వేశ్వరుడు (శ్రియఃపతి, ఈనమ్ ఇలా= (తన శ్రీచరణాలలో) కొఱత లేని, అన్బర్ ఎన్రాలుమ్ = భక్తిని (ప్రేమను) కల్గినవారైనా, ఎయ్దిలా = భగవానునకు ఎదురుగా వర్తించే, మానిడరై = మానవులను, ఎల్లా వణ్ణత్తాలుమ్ = అన్ని రీతులలోను, తాన్ అఱియ = భగవానుడు తెలిసేటట్లు విట్టార్క్కు= చేయి విడచినవారికి, ఎళియన్ = సులభుడై ఉంటాడు, విట్టా దార్క్కు= ఆవిధంగా వారిని విడువనివారికి, అఱ ఎళియన్ = పొందడానికి చాలా అరుదైన వాడై ఉంటాడు.

తేనె నిండుగా ఉండే తులసీమాలికను అలంకరించుకొన్న శ్రియఃపతి తన శ్రీచరణాలలో ఏకొఱత లేని భక్తిని కలవారైనా, భగవద్భక్తులు కాని ప్రాకృత మానవులతో సంబంధాన్ని లేకుండా చేసికొన్నపుడే వారికి సులభుడు కాగలడు. ఆ విధంగా సంబంధాన్ని విడువనివారికి దుర్లభుడు.

పదినెట్టామ్‌పాట్టు :- అవతారికై - సర్వేశ్వరనానవన్, తన్ పక్కల్ భక్తిమాన్గళానాలుమ్, శౌరిచింతాః ముఖరాన సంసారిగళోట్టై సంసర్గమఱ్ఱవర్‌గళుక్కు సులభనాయ్, ఆఱాదవర్‌గళుక్కు అత్యంతదుర్లభనా యిరుక్కుమ్బడియై, అవైవెరుమఱియ అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (ఈనమిలా వన్బరెన్టాలుమ్)- ఈనమావదు - పొల్లాజ్గు, అదిల్లామైయాలే, తన్ తిరువడిగళిల్ పఴుదఱ్ఱ ప్రేమముడైయవర్ గళానాలుమ్ "భక్త్యా లభ్య స్త్వనన్యయా" ఎన్టారిఱే శ్రీగీతాచార్యర్.

(ఎయ్‌దిలా మానిడరై) - "ఆనవిడై యేఴ్ఱ్టడర్‌త్తాఱ్కు ఆళానార్ అల్లాదార్ మానిడవరల్లర్ ఎన్టెన్ మనత్తు వైత్తేన్" ఎన్టుమ్, "శెజ్గణ్‌మాల్ నామమ్ మఱన్దారై మానిడమా వైయేన్" ఎన్టుమ్ జ్ఞానినా మగ్రేసరరానవర్‌గళ్ ఇకఴ్ఱుమ్బడి, భగవద్విషయత్తోడు ఒట్టఱ్ఱు త్తిరియుమ్ పాపిష్ఠరాన క్షుద్రమనుష్యరై. "ఎయ్‌దిలా"ఎన్టదు - ఎయ్‌దుదలిల్ ఇల్లాద పడియాయ్, భగవద్విషయత్తిన్ అరుగు కిట్టామైయై చ్చొల్లుగిఱదు. "ఎయ్‌దిలరా"మెన్టు పాఠమానపోదు, భగవద్విషయత్తిల్, ప్రతికూలరాన-ఎన్టు పొరుళాగ క్కడవదు.

(ఎల్లా వణ్ణత్తాలుమ్) - అదావదు - సహవాస-సత్కార- సంభాషణాదియాన సర్వప్రకారత్తాలుమ్ - ఎన్టై.

(తానఱియవిట్టార్‌క్కు) - తాజ్గళుమ్ పిఱరుమఱిన్ద అళవన్టిక్కే, అన్తర్యామియాయ్, "ఉళ్ళువారుళ్ళత్తెల్లా" మఱియుమ్ సర్వజ్ఞనాన తానఱియ విట్టవర్‌గళుక్కు. "తానఱిన్ద వైష్ణవత్వముమ్, వైష్ణవత్వమల్ల, నారాయణ నఱిన్ద వైష్ణవత్వమే వైష్ణవత్వ"మెన్టు ఆచ్చాన్పిళ్ళై అరుళిచ్చెయ్‌దారిఱే.

(ఎళియన్)- అవర్‌గళుక్కు క్కిట్టలామ్బడి సులభనాయిరుక్కుమ్.

(విడాదార్‌క్కఱివరియన్)- అప్పడి విడాదవర్‌గళుక్కు కిట్టవొణ్ణాదపడి మిగవుమ్ దుర్లభనాయిరుక్కుమ్.

(మట్టార్ తుఴాయలజ్గల్ మాల్)- తన్నిలత్తిలుజ్గాట్టిల్ తిరుమేనియిల్ స్పర్శత్తాలే శెవ్వి పెఱ్ఱు, మదు వెళ్ళమిడుగిఱ తిరుత్తుఴాయ్‌మాలైయాలే



అలంకృతనాన సర్వేశ్వరన్. తిరుత్తుఴాయ్‌మాలై సర్వేశ్వరత్వ చిహ్నమిఱే. "వక్షః స్థల్యామ్ తులసికమలా కౌస్తుభై ర్వైజయంతీ, సర్వేశత్వం కథయతితరామ్" ఎన్టరుళిచ్చెయ్‌దారిఱే, భట్టర్. "మట్టార్ తుఴాయలజ్గల్ మాల్. ఈనమిలా వన్బరె"న్టు తొడజ్గి "విడాదార్‌క్కఱివరియన్" - ఎన్టన్వయమ్. "భక్త్యా ఉపి వాసుదేవస్య శార్‌జ్గిణః పరమాత్మనః, లోకేషణాదినిర్ముక్తో ముక్తో భవతి నాన్యథా" ఎన్నక్కడవదిఱే.

పద్దెనిమిదవ పాశురం :- అవతారిక : సర్వేశ్వరుడు, తనపట్ల భక్తిని కలవారైనా, తనను స్మరించని సంసారులతో సంబంధం లేనివారికి సులభుడై, సంబంధం ఉండేవారికి చాలా దుర్లభుడై ఉండే రీతిని అందఱికి తెలిసేటట్లుగా ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (ఈనమిలా అన్బర్ ఎన్టాలుమ్)- "ఈనమ్"- అంటే తక్కువ దనం. అది లేనందువల్ల తన శ్రీచరణాలలో నిర్దుష్టమైన భక్తిని కలవారై ఉన్నా- అని భావం. ఆ విధంగా ఉన్నా, "పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా, యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్" (గీత-8-22) (ఓ కుంతీకుమారా! అన్ని వస్తువుల ఏ పరమపురుషుని లోపల ఉన్నాయో, ఎవనిచే ఇది అంతా వ్యాపింపబడి ఉన్నదో, ఆ పరమపురుషుడైతే, ప్రయోజనాంతరాలను ఆశించని భక్తి చేత పొందదగినవాడై ఉన్నాడు) అని ఈ విషయాన్ని గీతాచార్యుడు కూడా పలికాడు.

(ఎయ్‌దిలా మానిడరై)- "ఆన్‌విడై ఏఴు అన్టు అడర్‌త్తాఱ్కు ఆళానార్ అల్లాదార్ మానిడవర్ అల్లర్ ఎన్టు ఎన్ మనత్తే వైత్తేనే" (పెరియ తిరుమొఴి-11-7-9) (ఏడు వృషభాలను ఆనాడు అణచినవానికి దాసులు కాని వారు మానవులు కారని నా మనస్సులో నిశ్చయించుకొన్నాను) అని, "శెజ్గణ్‌మాల్ నామమ్ మఱన్దారై మానిడమా వైయేన్" (ఇరణ్డామ్ తిరు-44) (పుండరీ కాక్షుని మఱచినవానిని మానవులని భావించాను) అని జ్ఞానులలో అగ్రేసరులు నిందించేటట్లుగా భగవానునితో సంబంధాన్ని లేకుండా తిరిగే మహాపాపులైన నీచమానవులను- అని అర్థం. "ఎయ్‌దిలా" అనే పదం - పొందడం అనేది

లేని రీతిని తెల్పుతుంది. భగవానునకు సమీపంలో ఉన్నా, దరి చేరనివారిని తెల్పుతుంది. "ఏదిలరాయ్" అనే పాఠమైతే, భగవానునకు ప్రత్యర్థులైనవారు- అనే అర్థాన్ని ఇస్తుంది.

**(ఎల్లా వణ్ణత్తాలుమ్)**- దీని భావం ఏమంటే- తోడుగా సంచరించడం, ఉపకారం చేయడం, మాటలాడడం మొదలైన అన్ని రీతులలోను- అని భావం.

**(తానఱియవిట్టార్క్కు)**- తాము, ఇతరులు తెలిసికోవడం మాత్రమేకాక, సర్వాంతర్యామియై, **"ఉళ్ళువారుళ్ళ్‌గ్ర్‌గ్రెల్లామ్ ఉడనిరున్దు అఱిది"** (నిన్ను భావించే వారి మనస్సులోని భావాన్ని వెంట ఉండి గ్రహిస్తావు) (తిరుమాలై-34) అనే విధంగా అన్నిటిని తెలిసినవాడైన భగవంతునకు తెలిసేటట్లుగా ఉండేవారికి - అని భావం. **"తానఱిన్ద వైష్ణవత్వముమ్ వైష్ణవత్వమల్ల; నాడఱిన్ద వైష్ణవత్వముమ్ వైష్ణవత్వమల్ల; నారణన్ అఱిన్ద వైష్ణవత్వమే వైష్ణవత్వమ్"** (వార్తామాలై) అని వ్యాఖ్యానచక్రవర్తి అయిన పెరియవాచ్చాన్‌పిళ్ళై పలికారు కదా!

**(ఎళియన్)**- ఆ విధంగా ఉండేవారికి సర్వేశ్వరుడు సులభుడై ఉంటాడు.

**(విడాదాఱ్కు అఱివరియన్)**- ఆ విధంగా తెలిసేటట్లు ఉండనివారికి పొందడానికి సాధ్యం కానట్లుగా చాలా దుర్లభుడై ఉంటాడు.

**(మట్టార్ తుయ్యాయలజ్గల్ మాల్)** - తాను మొలిచిన చోటకంటే, భగవానుని తిరుమేనిపై ఉన్నందువల్ల, మిక్కిలిగా ఆనందించి, అందువల్ల బాగా చిగురించి, మధుప్రవాహాన్ని స్రవించే తులసీమాలిక సర్వేశ్వరునకే అసాధారణ చిహ్నం కదా!

**"వక్షఃస్థల్యాం తులసికమలాకౌస్తుభైః వైజయంతీ, సర్వేశ్వరత్వం కథయతి తరాం రంగధామ్నః తదాస్తామ్, కూర్మవ్యాఘ్రీనఖపరిమిళత్ పంచహేతీ యశోదా నద్ధా మౌగ్ధ్యాభరణ మధికం న స్సమాధిం ధినోతి"** (శ్రీరంగరాజస్తవం- పూర్వ శతకం-113) (శ్రీరంగనాథుని వక్షఃస్థలంలోని తులసి, లక్ష్మీదేవి, కౌస్తుభమణి మొదలైనవానితో కూడి ఉండే వనమాలిక "ఇతడు పరమాత్మ'' అనే విషయాన్ని



చక్కగా వివరిస్తున్నది, అది. ఆ విషయం ఉండనీ. శ్రీకృష్ణుని బాల్యావస్థకు తగిన దివ్యాభరణంగా యశోదాదేవిచే అలంకరింపబడిన తాబేటిగోరు, ఆడపులిగోరు మొదలైనవానితో పొదిగిన పంచాయుధాభరణం అనేది మన మనస్సును చాలా ఆనందింపజేస్తున్నది) అని పరాశరభట్టర్ పలికారు.

**'మాట్టార్ తుయ్యాయలజ్గల్ మాల్- ఈనమిలా అన్బర్"** అని ఆరంభించి **"విడాఱ్కు అఱ అరియన్"** అని అన్వయించి అర్థాన్ని గ్రహించాలి. **"భక్తోఽపి వాసుదేవస్య శార్‌జ్గిణః పరమాత్మనః, లోకేషణాదినిర్ముక్తో ముక్తో భవతి నాన్యథా"** (శార్‌జ్గమనబడే వింటిని కలవాడై, పరమాత్మ అయిన వాసుదేవునకు భక్తుడై ఉన్నప్పటికీ) **"పెణ్ణాశై, పొన్నాశై, మణ్ణాశై"** (కాంతలపట్ల ఆశ, సంపదపట్ల ఆశ, రాజ్యపరిపాలన పట్ల ఆశ) మొదలైన వానినుండి విడుదలను పొందినపుడే ముక్తిని పొందుతాడు. లేకపోతే పొందలేడు) అని చెప్పబడిందికదా!

**19. నల్ల పుదల్వర్ మనైయాళ్ నవైయిల్ కిళై**
**ఇల్ల నిలమాడివై యనైత్తుమ్, - అల్లలెన**
**త్తోగ్ర్‌గ్రి యెరి తీయిల్ శుడుమేల్, అవర్క్కెళిదామ్**
**ఏగ్ర్‌గ్రరుమ్ వైకున్దత్తిరుప్పు**

నల్ల పుదల్‌వర్ = సద్గుణాలను కల పుత్రులు, మనైయాళ్ = మంచి రాణులను కల భార్య, నవై యిల్ కిళై = దోషం లేని బంధువులు, ఇల్లమ్ = (అందమైన) ఇల్లు, నిలమ్ = గొప్ప క్షేత్రం, మాడు = సమృద్ధిగా పాలను ఇచ్చే పశువులు, ఇవై అనైత్తుమ్= ఇవి అన్నీ, అల్లల్ ఎన = దుఃఖాన్ని కల్గించేవి - అని, తోగ్ర్‌గ్రి = మనస్సుకు తోచి, ఎరి తీయిల్ = మండే అగ్నివలె, శుడుమేల్ = తాపాన్ని కల్గించేవి అయితే, అవర్క్కు= అటువంటి స్థితి కల్గినవారికి, ఏగ్ర్‌గ్రరుమ్= పొందడానికి అరుదైన, వైకున్దత్తు= పరమ పదానికి చేరి, ఇరుప్పు= అక్కడ ఉండడం, ఎళిదామ్= సులభమవుతుంది.

సద్గుణాలను కల్గిన పుత్రులు, భార్య, ఏ దోషం లేని బంధువులు, ఇల్లు, భూమి, పశువులు – అనే ఇవి అన్నీ దుఃఖానికి మూలకారణాలనే విషయాన్ని గ్రహించి, అవి మండే అగ్నికంటే ఎక్కువ తాపాన్ని కల్గించేవిగా ఎవరి కాగలవో, అటువంటివారికే దుర్లభమైన పరమపదం సులభమవుతుంది.

పత్తొన్బదామ్పాట్టు :- అవతారికై - పుత్రదారాబంధుజనగృహక్షేత్రాదిగ ళెల్లామ్, అగ్నికల్పమాయ్క్కొణ్డు తాపకరమామ్బడియాన అవస్థై పిఱన్దవర్ గళుక్కు, పరమపదప్రాప్తి ఎళిదామ్ - ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (నల్లపుదల్వర్) - నల్లపుత్రర్గళ్, అదావదు- గుణహీన రాయ్ దుఃఖావహరాయిరుక్కైయన్ఱిక్కే, తఙ్గళ్ వియోగమ్ అసహ్యామామ్బడి గుణవాన్కళాన పుత్రనారానవర్కళ్- ఎన్ఱై.

(మనైయాళ్) - "నల్ల" ఎన్గిఱ ఇదై ఎఙ్గుమ్ కూడికొళ్ళక్కడవదు. అదావదు- గుణహీనమాక ఇరుక్కైయన్ఱిక్కే, గుణవతియాయ్, ఛందానువర్తియాన భార్యై- ఎన్ఱై.

(నవైయిల్ కిళై) - బంధుక్కళ్- ఎన్ఱు పేరాయ్, ప్రతికూలరా యిరుక్కై యన్ఱిక్కే, తఙ్గళోట్టై సహవాసమ్ అమైయుమెన్నుమ్బడి, నిర్దోషనాన బంధుక్కళ్. నవై - కుఱ్ఱమ్. ఇల్లెన్బదు- ఇల్లామై.

(ఇల్లమ్) - కీழ్, నల్లవెన్ఱు శొన్నత్తై, ఇరుముదలాగ మేఱ్చొల్లు గిఱవఱ్ఱిలుజమ్ కూట్టిక్కొళ్వదు. నల్ల ఇల్లమావదు - కణ్డవిడ మెఙ్గుమ్ శిథిలమాయ్ హేయమాయిరుక్కైయన్ఱిక్కే, మాడకూడ ప్రసాదాదియుక్తమాయ్, విలక్షణమాన గృహమ్, నల్ల నిలమావదు- ఊషరమాయొరు ముదల్పఱ్ఱాద పడి యిరుక్కైయన్ఱిక్కే, కట్టుకలమ్ పోరవిళైయుమ్బడియాన సుక్షేత్రమ్. నల్లమాడావదు - కొడువైయాయ్, క్కట్టప్పిడిక్కవొట్టామల్. కొల్లైయిలే మేయ్న్దు తిరిగైయన్ఱిక్కే, విధేయమాయ్ బహుక్షీరప్రదంగళాన పశుక్కళ్ ముదలానవై.

(ఇవైయనైత్తుమ్)- ఇప్పడి ఓరొన్ఱే విలక్షణమాయ్ నాట్టారుక్కు సుఖావహమా యిరుక్కుమివై ఎల్లామ్.

(అల్లలెన త్తోఱ్ఱి)- అల్లల్ ఎన్గిఱ శబ్దమ్ దుఃఖవాచియేయాకిలుమ్, కీழ్చ్చొన్నవఱ్ఱై చ్చొల్లుగిఱదాగైయాలే, దుఃఖావహమెన్ఱు శొల్లవేణుమ్.

(ఎరితీయిఉబ్బుడుమేల్) జ్వలిక్కిఱ అగ్నిపోలే తాపకరమాగిల్.



(అవర్క్కెళిదామ్ ఏఱ్ఱరుమ్ వైకున్దత్తిరుప్పు) - అవ్వవస్థై పిఱన్ద అధికారిగళుక్కు స్వయత్నత్తాల్ దుష్ప్రాప్యమాన పరమపదత్తిలే పోయ్, అడియార్ గళ్ కుழాఙ్గళోడే కూడియిరుక్కు మిరుప్పు సులభమామ్. అదావదు - ఇప్పడి యాన అధికారిపాకమ్ పిఱన్దవర్గళుక్కు, ఈశ్వరన్ శీఘ్రమాగ పరమపదత్తై క్కొడుక్కుమెన్ఱపడి. "క్షేత్రాణి మిత్రాణి ధనాని నాథ! పుత్రాశ్చ దారాః పశవో గృహాణి, త్వత్పాదపద్మప్రవణాత్మవృత్తే ర్భవంతి సర్వే ప్రతికూలరూపాః" ఎన్ఱు బ్రహ్మాణ్డపురాణత్తిల్, శ్రీహస్తిగిరి మాహాత్మ్యత్తిల్ అనుసంధేయమ్.

పందొమ్మిదవ పాశురం :- అవతారిక : సంతానం, భార్య, బంధువులు, ఇల్లు, క్షేత్రం మొదలైనవి అన్నిటిపట్ల అగ్నివలె దహించివేసే స్థితిని పొందినవారికి పరమపదాన్ని పొందడం సులభం- అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (నల్ల పుదల్వర్)- మంచి పుత్రులు, సత్పుత్రులు అంటే- సద్గుణాలను లేనివారై, దుఃఖాన్ని కల్గించేవారై కాకుండా, వారి విశ్లేషం సహించలేని రీతిలో సద్గుణాలను కల పుత్రులు- అని భావం.

(మనైయాళ్)- "నల్ల" అనే విశేషణాన్ని ఇక్కడ కూడా అన్వయించాలి. అంటే- గుణహీనురాలై, ఉండకుండా, సద్గుణాన్ని కల్గినదై, తన మనస్సును తెలిసి వర్తించే భార్య- అని భావం.

(నవైయిల్ కిళై)- బంధువులనే పేరుతో శత్రువులై ఉండడం కాకుండా, "వీరితో కూడి ఉండడమే చాలు" అని తలచే రీతిలో ఏ దోషం లేని బంధువులు- అని భావం. "నవై" అనే పదం దోషమనే అర్థాన్ని తెల్పుతుంది. "నవైయిల్" - అంటే దోషం లేని- అని అర్థం.

(ఇల్లమ్ నిలమ్ మాడు)- మొదటి పదంలో చెప్పబడిన "నల్ల" అనే విశేషణాన్ని "ఇల్లమ్, నిలమ్, మాడు" అనే మూడు పదాలతోను అన్వయించాలి. "నల్ల ఇల్లమ్" అంటే- కన్పించిన చోట అంతా భగ్నమై, తక్కువదనాన్ని కల్గినదిగా కాకుండా, మిద్దెలతో మేడలతో, గోపురాలతో కూడినదై, గొప్పదైన గృహం - అని అర్థం. "నల్ల నిలమ్" అంటే - ఎండిన ప్రదేశమై, ఏవిధమైన పైరు ఎదగని చోటుగా కాకుండా, ఒక కుంచెడు నేలలో పది కుంచాల ధాన్యం పండే క్షేత్రమై

ఉండడం. "నల్ల మాడు" అంటే- పొగరుపోతు పశువును కట్టడానికి పట్టుకోవడానికి వీలుకానట్లుగా. యథేచ్ఛగా సంచరిస్తూ మేస్తూ తిరిగే పశువులు కాకుండా, అణకువను కల్గినవై, సమృద్ధిగా పాలను ఇచ్చే పశువులు మొదలైనవి.

**(ఇవై యనైత్తుమ్)** - ఈవిధంగా ఉండే ఇవి అన్నీ- అని అర్థం. వీటిని కల్గినవారికి ఆనందాన్ని కల్గించే గొప్పతనాన్ని కల ఇవి అన్నీ.

**(అల్లల్ ఎనత్తో*ఱ్ఱి*)**- దుఃఖాన్ని కల్గించేవి- అని మనస్సుకు తోచి- అని అర్థం. **"అల్లల్"**- అనే పదం దుఃఖమనే అర్థాన్ని ఇస్తుంది. పూర్వం ప్రస్తావింపబడిన గృహం, క్షేత్రం, పశువులు మొదలైనవానిని తెల్పుతున్నందున (ఇవి) దుఃఖాన్ని కల్గించేవి- అనే అర్థాన్ని గ్రహించాలి.

**(ఎరి తీయిల్ శుడర్మేల్)**- మండే అగ్నివలె దాహాన్ని (తాపాన్ని) కల్గించేవి అయినా,

**(అవర్క్కు ఎళితామ్ ఏ*ఱ్ఱ*రుమ్ వైకున్దత్తిరుప్పు)** - పూర్వం తెల్పిన దశ కల్గినవారికి స్వప్రయత్నంతో పొందడానికి అరుదైన పరమపదానికి పోయి, అక్కడ సర్వేశ్వరునకు కైంకర్యం చేసే నిత్యముక్తులతో కలసి ఉండే స్థితి సులభమవుతుంది. అంటే - ఇటువంటి యోగ్యత కల్గినవారికి సర్వేశ్వరుడు శీఘ్రంగా పరమపదాన్ని అనుగ్రహిస్తాడు - అని భావం. **"క్షేత్రాణి మిత్రాణి ధనాని నాథ! పుత్రాశ్చ దారాః పశవో గృహాణి, త్వత్పాదపద్మప్రవణాత్మవృత్తేః భవంతి సర్వే ప్రతికూలరూపాః"** (బ్రహ్మాండపురాణమ్- హస్తిగిరి మాహాత్మ్యమ్) (స్వామీ! క్షేత్రాలు, మిత్రులు, సంపదలు, భార్య, సంతానం, పశువులు, గృహాలు- అనేవి అన్నీ నీ శ్రీచరణ పద్మాలలో అభినివిష్టమైన మనస్సును కలవారికి దుఃఖాన్ని కల్గించేవిగానే ఉంటాయి) అని బ్రహ్మాండపురాణంలోని హస్తిగిరి మాహాత్మ్యంలో చెప్పబడిన వచనం ఈ పాశురంలో చెప్పబడిన అర్థానికి ప్రమాణంగా అనుసంధేయం.

**20. విరుప్పుఱినుమ్ తొణ్డర్క్కు వేణ్డు మిదమల్లాల్**
**తిరుప్పొలిన్ద మార్బన్ అరుళ్ శెయ్యాన్, - నెరుప్పై**
**విడాదే కు*ழ*వి వి*ழ*, వరున్దినాలుమ్**
**తడాదే యొ*ழి*యుమో తాయ్.**



విరుప్పు ఉఱినుమ్ = నీచవిషయాలను ఆశించినా, తొణ్డర్క్కు = తన భక్తులు, వేణ్డుమ్ ఇదమ్ అల్లాల్ = వారు ఉజ్జీవించడానికి కావలసిన హితాలను తప్ప (వేఱు దేనినీ), తిరు పొలిన్ద మార్బన్ = లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కల్గిన స్వామి, అరుళ్ శెయ్యాన్ = (వారు కోరే నీచవిషయాలను) ఇవ్వడు, కు*ழ*వి = చిన్న బిడ్డ, నెరుప్పై = అగ్నిని, విడాదే = (దాని కాంతిని చూచి) విడువలేక, వి*ழ*వరున్ది నాలుమ్= దానిలో పడడానికి ప్రయత్నించినా, తాయ్ = ఆ శిశువుతల్లి, తడాదు ఒ*ழి*యుమో = (దానిలో పడకుండా ఉండేటట్లు) అడ్డు లేకుండా ఉంటుందా?

అహితాన్ని ఆశపడినా, తనపట్ల భక్తిని కల్గినవారికి లక్ష్మీదేవిని హృదయంలో కల్గిన భగవానుడు హితాన్ని తప్ప, అహితాన్ని అనుగ్రహించడు. బిడ్డ, అగ్నికాంతిని చూచి దానిని విడువకుండా అందులోకి పోవాలని చూచినా, తల్లి ఆ ప్రయత్నాన్ని అడ్డుకోకుండా అనుమతించదు కదా!

ఇరుపదామ్పాట్టు :- అవతారికై - తన్ పక్కల్ భక్తరానవర్గళ్, తజ్గళుక్కు అహితమెన్ఱు అఱియాదే, చాపల్యత్తాలే క్షుద్రజ్గళానవ*ఱ్ఱి*ల్ శిలవ*ఱ్ఱై* విరుమ్బి, ఇత్తై త్తర వేణుమెన్ఱు అపేక్షిత్తాలుమ్, హితపరనాన ఈశ్వరన్ అత్తై క్కొడాదే మఱుత్తువిడు మెన్దత్తై సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (విరుప్పుఱినుమ్) - విరుప్పత్తై ప్పణ్ణిలుమ్. అదావదు, ఇదుణ్డాగాద పోదు ఇవర్గళ్ క్లేశప్పడువర్గళ్ ఎన్నుమ్పడి సాదరమాగ అపేక్షిక్కిలుమ్ - ఎన్దై.

(తొణ్డర్క్కు) - తన్ పక్కల్ భక్తరానవర్గళుక్కు. తొణ్డు ఎన్గిఱ శబ్దమ్, శేషత్వత్తుక్కుమ్ వాచకమాయ్, చాపలత్తుక్కుమ్ వాచకమాయ్ పోరువదా గైయాలే, ఇవ్విడత్తిల్ చాపలవాచకమాయ్‌క్కొణ్డు భక్తియై చ్చొల్లుగిఱదు.

(వేణ్డుమిదమల్లాల్)- అదావదు- అవర్గళుక్కు వేణ్డువదాన హితత్తై యొ*ழి*య. "వేణ్డుమిదమ్" - ఎన్దదు అవర్గళుడైయ ఉజ్జీవనత్తుక్కు అపేక్షిత మానహిత మెన్దపడి.

**(తిరుప్పొలిన్ద మార్బన్)**- పెరియపిరాట్టియార్ ఎ*ழு*న్దరుళి యిరుక్కై యాలే, ఉజ్వలమాన తిరుమార్బై యుడైయవన్. "తిరుప్పొలిన్ద మార్బ"నెన్దదు- తిరువాల్ వన్ద పొలివై యుడైత్తాన్ మార్బన్ - ఎన్దపడి. తిరుమార్బడజ్గలుమ్ ఇవళ్ తిరుమేనియిల్ తేజస్సాలే వ్యాప్తమా యిరుక్కుమాయి*న్ఱు*. ఆగవితే, "కరుమాణిక్క క్కున్దత్తు త్తామరైప్పోల్" ఎన్నుమ్. "కరుమాణిక్కమలైమేల్ మణిత్తడన్దామరై క్కాడుగళ్‌పోల్" ఎన్నుమ్, తొడజ్గి దివ్యావయవజ్గళై చ్చొల్లుమిడత్తిల్ అల్లాద అవయవజ్గళోపొది శివన్దిరుక్కుమదాగ త్తిరుమార్బై మున్దఱ చ్చొల్లి*న్ఱు*. ఆగ, ఇప్పడి యిరుక్కిఱ తిరుమార్బై యుడైయవన్.

**(అరుళ్ శెయ్యాన్)**- అదావదు - ఇవర్‌గళ్ ఆశైప్పట్టు అపేక్షిత్తాలుమ్ హితపరనాగైయాలే మఱుత్తువిడు మిత్తనైయొ*ழி*య, అపేక్షిత్తదై క్కొడాన్ - ఎన్దై. అరుళుదల్ - కొడుత్తల్. అవర్‌గళ్ అపేక్షియానిఱ్కు చ్చెయ్‌దే. అదు కొడాదే మఱుత్తువిడు మెన్దత్తుక్కు దృష్టాంత మరుళిచ్చెయ్‌గిఱార్, మేల్.

**(నెరుప్పై ఇత్యాది)**- అదావదు, విళైవదఱియాద శిఱు ప్రజై, అగ్ని, దాహక మెన్దఱియామల్ అదినుడైయ ఔజ్వల్యమాత్రత్తై క్కణ్డు అత్తై విడాదే, అదిలే వి*ழு*గైక్కు యత్నిత్తాలుమ్, అదు ప్రజైక్కు నాశకమెన్దఱియుమ్ మాతావానవళ్ అదిల్ వి*ழு*దపడి తగైయాదొ*ழி*యుమో?- ఎన్దై. ఇత్తాల్ - అప్పడియే యవనుమ్, అవర్‌గళపేక్షిత్తాలుమ్, అదు కొడాదే మఱుత్తువిడు మెన్దదా యి*న్ఱు*. "యాచితోఽపి సదా భక్తై ర్నాహితం కారయేద్ధరిః, బాలమగ్నౌ పతంతం తు మాతా కిం న నివారయేత్" ఎన్నక్కడవదిఱే.

ఇర్వైయవ పాశురం :- అవతారిక : తన భక్తులు, తమకు హాని కల్గించేది- అనే విషయాన్ని తెలియకుండా, పేరాశతో నీచవిషయాలను కొన్నిటిని ఆశపడి, "దీనిని అనుగ్రహించాలి'' అని వేడినా, హితాన్నే చేసే సర్వేశ్వరుడు దానిని ఇవ్వకుండా ఉంటాడు- అనే విషయాన్ని సోదాహరణంగా ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- **(విరిప్పుఱినుమ్)** - మనోరథాన్ని పొందినా - అని అర్థం. అంటే- "దీనిని ఇవ్వకపోతే వీరు దుఃఖాన్ని పొందుతారు'' అనే రీతిలోని గొప్ప అభినివేశంతో వేడినా- అని భావం.



**(తొణ్డర్‌క్కు)** - తన భక్తులకు - అని అర్థం. **"తొణ్డు"** అనే పదానికి దాసుడై ఉండడం, పేరాశ అనేవి అర్థాలు కనుక, ఇక్కడ పేరాశను తెల్పుతుంది కనుక, సర్వేశ్వరుని వద్ద ఇటువంటి పేరాశతో భక్తిని కల్గి ఉండడాన్ని తెల్పుతుంది.

**(వేణ్డుమ్ ఇదమల్లాల్)**- వారికి ఆవశ్యకమైన హితాన్ని తప్ప- అని. **"వేణ్డుమ్ ఇదమ్"** అనే ప్రయోగం భక్తులు ఉజ్జీవించడానికి కావలసిన హితాన్ని- అనే అర్థాన్ని ఇస్తుంది.

**(తిరుప్పొలిన్ద మార్బన్)** - లక్ష్మీదేవి అధివసించి ఉన్నందున గొప్పగా ప్రకాశించే వక్షఃస్థలాన్ని కలవాడు - అని భావం. **"తిరుప్పొలిన్ద మార్బన్"** అనేది **"తిరు"** అనబడే లక్ష్మీదేవిచే కల్గిన ప్రకాశాన్ని కల వక్షస్సును కలవాడు- అని- భావం. భగవంతుని వక్షఃస్థలం అంతా శ్రీదేవి తిరుమేనియొక్క కాంతితో వ్యాపింపబడి ఉంటుంది. అందువల్లనే కదా **"కరుమాణిక్క క్కున్దత్తు త్తామరై పోల్"** (నల్లని మాణిక్య పర్వతంపై తామరపూవు వలె) (తిరువాయ్-8-7-6) అని, **"కరుమాణిక్క మలైమేల్ మణిత్తడన్దామరై క్కాడుకళ్ పోల్"** (తిరువాయ్- 8-9-1) (నీలరత్నపర్వతంపై గొప్ప తటాకంలోని పద్మవనం వలె) అని భగవంతుని దివ్యావయవాలను గూర్చి పలికే సందర్భంలో అరికాలు, అరిచేయి మొదలైన అవయవాలవలె వక్షఃస్థలం కూడా ఎఱ్ఱగా ఉన్నది- అని మొదట వక్షఃస్థలం ప్రస్తావింపబడింది. ఇందువల్ల ఈ విధంగా ఉండే వక్షఃస్థలాన్ని కలవాడు- అని భావం.

**(అరుళ్ శెయ్యాన్)** - వీరు ఆశ పడివేడినా, వీరికి హితాన్నే చేసేవాడై నందున, (మిగిలిన దైవాలవలె క్షుద్రపురుషార్థాలైనవానిని ఇవ్వకుండా) తిరస్కరిస్తాడు తప్ప, వారు అడిగిన దానిని ఇవ్వడు - అని భావం. **"అరుళుదల్"**- ఇవ్వడం అని అర్థం. వారు వేడినా దానిని ఇవ్వకుండా తిరస్కరిస్తాడు- అనే దానికి ఒక ఉదాహరణాన్ని ఇకపై ప్రస్తావిస్తున్నారు.

**(నెరుప్పై విడాదే కు*ழ*వి వి*ழ* వరున్దినాలుమ్ తడాదే యొ*ழி*యుమో తాయ్)** - దీని భావమేమంటే - చిన్నబిడ్డ నిప్పును ముట్టుకొన్నందున కలిగే పరిణామాన్ని గూర్చి తెలియకుండా, దాని వెలుగును మాత్రం చూచి సదా

అందులోకి దూకాలని ప్రయత్నించినా, అది బిడ్డను నశింపజేస్తుంది - అని తెలిసిన తల్లి అందులో పడకుండా ఉండేటట్లు బిడ్డను అడ్డుకోకుండా ఉంటుందా? - అని భావం. ఈ ఉదాహరణాన్ని ప్రస్తావించడం ద్వారా - తన భక్తులు వేడినను వారు కోరినది అహితమైతే దానిని ఇవ్వకుండా, తిరస్కరిస్తాడు- అని చెప్పబడింది. "యాచితోஉపి సదా భక్తైః నాహితం కారయేద్ధరిః, బాల మగ్నౌ పతంతం తు మాతా కిం న నివారయేత్" (భక్తులు ఎల్లప్పుడు కోరినప్పటికీ, భగవంతుడు హితాలు కానివానిని అనుగ్రహించడు. నిప్పులో పడడానికి పరుగుతీసే బిడ్డను అతని తల్లి అడ్డుకోకుండా ఉంటుందా?) అని చెప్పబడినది కదా!

**21. ఆర ప్పెరుమ్ తుయరే శెయ్దిడినుమ్ అన్బర్గళ్ పాల్,**
**వేరిచ్చరోరుగైకోన్ మెయ్న్నలమామ్, – తేరిల్**
**పొఱుత్తఱ్కు అరిదెనినుమ్ మైన్దనుడల్ పుణ్ణై**
**అఱుత్తఱ్కిశై తాదై యఱ్ఱు**

వేరి చ్చరోరుగై కోన్ = పరిమళప్రచురమైన తామరపూవును వాసస్థానంగా కల లక్ష్మీదేవికి వల్లభుడు, అన్బర్ కళ్‌పాల్ = తన భక్తుల విషయంలో, ఆర పెరుమ్ తుయర్= చాలా గొప్ప దుఃఖాన్ని, శెయ్దిడినుమ్ = కల్గించినా, తేరిల్ = దానిని విచారించి చూస్తే, మెయ్న్నలమ్ ఆమ్ = అది వాస్తవమైన ప్రీతిచే చేసినదే కాగలదు. (ఏవిధంగా? అంటే), పొఱుదఱ్కు అరిదు ఎనినుమ్ = సహించడానికి సాధ్యం కానిది - అని తెలిసినా, మైన్దన్ = తన కుమారుని, ఉడల్ పుణ్ణై = దేహంలోని పుండును, అఱుత్తఱ్కు = (వైద్యుడు) ఖండించడానికి, ఇశై తాదై అఱ్ఱు = అంగీకరించే తండ్రివలె.

సువాసనను మిక్కిలిగా కల్గిన తామరలో జన్మించిన లక్ష్మీదేవికి వల్లభుడైన భగవానుడు భక్తుల విషయంలో చాలా పెద్ద దుఃఖాలనే కల్గించినా, గమనించినట్లయితే, అవి నిజమైన ప్రేమయొక్క కార్యమే కాగలవు. సహించలేనిదే అయినా, తన కుమారుని శరీరంలో ఉండే వ్రణాన్ని ఖండించడానికి అంగీకరించే తండ్రి చేసే పనివంటిదే ఇది.



ఇరుపత్తొన్డామ్‌పాట్టు :- అవతారికై - శ్రియఃపతియానవన్, తన్ పక్కల్ భక్తరానవర్ గళుక్కు, అతిమాత్రజ్గళాన దుఃఖజ్గళై చ్చెయ్యినుమ్, అదు అవర్గళ్ పక్కల్ స్నేహకార్యమెన్నుమత్తై సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (అర ప్పెరున్దుయరే శెయ్దిడినుమ్)- తుయర్- దుఃఖమ్, పెరున్దుయర్- మహాదుఃఖమ్, అరప్పెరున్దుయరెన్రైయాలే, మిగవుమ్ పెరుమ్ దుఃఖమెన్నపడి. తుయరే- ఎన్గిఱ అవధారణత్తాలే, నడువోరు సుఖవ్యవధాన మిల్లామైయై చ్చొల్లుగిఱదు. శెయ్దిడిను మెన్నదు- ఇవర్గళ్ ప్రారబ్ధకర్మఫలమాయ్ వన్దదాగిలుమ్, ఫలప్రదన్ అవనాగైయాలే, పూర్వాఘోత్తరాఘ ప్రారబ్ధఖణ్డజ్గళెల్లామ్ కఴిక్కిఱవనుక్కు, ఇత్తైయుమ్ కఴిక్క అరిదన్రిఱే, హితరూపమాగ అవఱ్ఱై అనుభవిప్పిక్కైయిఱే ఇవనుక్కిదు అనుభవిక్క వేణ్డుగిఱదు. ఇదుదాన్ అవను క్కుణ్డాన ప్రకృతి ప్రాకృతజ్గళిల్ వైరాగ్యత్తై ప్పిఱప్పిక్కైక్కాగ చ్చెయ్‌గిఱదిఱే.

(వేరిచ్చరోరుగైకోన్)- పరిమళప్రచురమాన తామరైయై వాసస్థానమాగ ఉడైయ పెరియపిరాట్టియారుక్కు వల్లభనానవన్. ఇప్పడి ఇవర్గళుక్కు దుఃఖత్తై విళైవిక్కిఱత్తుక్కు అవళుమ్ కూట్టుప్పోలే కాణుమ్; హితరూపమాగైయాలేయవళుమ్ కూడుమిఱే. నిగ్రహత్తాలే శెయ్యిలిఱే నిషేధిప్పదు. అనుగ్రహత్తాలే శెయ్గైయాలే అనుమతిపణ్ణి యిరుక్కుమాయిఱ్ఱు.

(మెయ్న్నలమామ్)- పారమార్థికస్నేహకార్యమామ్. మెయ్న్నలమెన్నదు- మెయ్యాన స్నేహ మెన్నపడి.

(తేరిల్)- ఆరాయిల్. తేరుదల్ - ఆరాయ్‌దల్. "వేరి చ్చరోరుగైకోన్ అన్బర్గళ్ పాల్ అరప్పెరున్దుయరే శెయ్దిడినుమ్ తేరిల్ మెయ్న్నలమామ్" ఎన్ను అన్వయమ్. ఇదుక్కు దృష్టాంత మరుళిచ్చెయ్‌గిఱార్, మేల్.

(పొఱుత్తఱ్కు) ఇత్యాది. అదావదు, అవనుక్కు ఇదు పొఱుక్కప్పోగాదెన్ను తోఱ్ఱియిరున్దాలుమ్, పుత్రనుడైయ శరీరత్తిల్ గ్రంథియై హితబుద్ధియాలే ఛేదిక్కైక్కు అనుమతి పణ్ణుమ్ పితావైప్పోలే - ఎన్గై. "హరి ర్దుఃఖాని భక్తేభ్యో

**హితబుద్ధ్యా కరోతి వై, శస్త్ర క్షారాగ్నికర్మాణి స్వపుత్రాయ యథా పితా" ఎన్నక్కడ** వదితే.

**ఇరవై ఒకటవ పాశురం :- అవతారిక :** శ్రియఃపతి తన భక్తులకు చాలా దుఃఖాలను కల్గించినా, అవి వారిపట్ల ప్రేమతో ఇచ్చినవి (కల్గించినవి) అనే విషయాన్ని ఉదాహరణ పూర్వకంగా ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : **(ఆరప్పెరుమ్ తుయరే శెయ్‌దిడినుమ్) - "తుయర్"-** అనే పదం దుఃఖమనే అర్థాన్ని ఇస్తుంది. **"పెరుమ్ తుయర్"** అనేది గొప్ప దుఃఖాన్ని తెల్పుతుంది. **'ఆరప్పెరుమ్ తుయర్"** అని అన్నందున చాలా పెద్ద దుఃఖమని తెలుపబడింది. **"తుయరే"** అనే ప్రయోగంలోని **'ఏవ'** కారం ద్వారా మధ్యలో ఎపుడైనా ఏదో ఒక సుఖాన్ని కూడా కల్గించకుండా, నిరంతరంగా దుఃఖాలనే కల్గించడాన్ని తెల్పుతున్నది.

**(శెయ్‌దిడినుమ్)-** అనే ప్రయోగం ఈ దుఃఖం వీరికి ప్రారబ్ధకర్మ ఫలంగా కల్గినదే అయినా, ఆ ఫలాన్ని ఇచ్చేవాడు భగవంతుడే కనుక, పూర్వం చేసిన పాపాలు, ఇకపై కలుగబోయే పాపాలు, ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన పాపాలు - అనే అన్నీ అనుభవించి తీర్చుకొనే జీవునకు వీటిని అన్నిటిని తీర్చుకోవడం - అనేది అసాధ్యకృత్యమనే కారణంచేతనే. జీవునకు హితం కలగాలనే అభిప్రాయంతో, భగవంతుడు ఆ పాపాలను అనుభవింపచేస్తాడు. అందువల్లనే కదా జీవుడు వాటిని అనుభవిస్తున్నాడు. ఈ విధంగా అనుభవింప జేయడం కూడా - అచేతనమైన మూలప్రకృతి, దానివల్ల జనించే వస్తువులు- అనే వాటిలో ఏవగింపు కల్గడం కోసమే చేశాడు; అంతేకదా !

**(వేరి చ్చరోరుకైకోన్)-** సువాసన నిండుగా కల తామరపూవును నివాసంగా కల్గిన శ్రీదేవికి ప్రియవల్లభుడై ఉండేవాడు- అని భావం. ఈవిధంగా వీరికి భగవంతుడు దుఃఖాలను కల్గించడంలో ఆమెకూడా కలసి ఉంటుంది- అని భావం. జీవునకు హితమే కల్గుతుంది కనుక, ఆమె కూడా ఈవిషయంలో సహకరించడం కూడా పొసగుతుంది కదా! (దూరంగా) జీవుని గెంటి వేయాలని తలచి భగవంతుడు దుఃఖాలను కల్గించేటపుడు కదా ఆమె అప్రయత్నాన్ని



అడ్డుకుంటుంది. జీవుని సంస్కరించాలి- అనే దయతో చేసినందున ఆమె దానికి అనుమతిస్తుంది.

**(మెయ్‌న్నలమామ్)-** ఈ రీతిలో గొప్ప దుఃఖాన్ని కల్గించడం నిజమైన ప్రేమవల్ల సంభవించిందే. **"మెయ్‌న్నలమ్"** -అనే ప్రయోగం "వాస్తవమైన ప్రేమ" అనే అర్థాన్ని ఇస్తుంది.

**(తేరిల్)-** విచారించి చూస్తే- అని అర్థం. **"తేరుదల్"-** అనే పదం విచారించి గమనించడాన్ని తెల్పుతుంది. **"వేరిచ్చరోరుకైకోన్ అన్బర్‌కళ్ పాల్ ఆరప్పెరుమ్ తుయరే శెయ్‌దిడినుమ్ తేరిల్ మెయ్‌న్నలమామ్"** అని అన్వయించి అర్థాన్ని చెప్పాలి. దీనికి ఉదాహరణాన్ని పాశురంలోని అనంతర భాగంలో పల్కుతున్నారు.

**(పొఱుత్తఱ్కు అరిదెనినుమ్ మైన్దన్ ఉడల్ పుణ్ణై అఱుత్తఱ్కు ఇశైతాతై యఱ్ఱ్రు)-** దీని భావమేమంటే- బిడ్డకు "ఇది సహించడానికి సాధ్యం కానిది"- అని తెలిసినా, బిడ్డ ఒంటిలో కల్గిన గడ్డను అతనికి హితం కల్గించడంకోసం ఖండించడానికి వైద్యునకు అనుమతిని ఇచ్చే తండ్రివలె- అని. **"హరి ర్దుఃఖాని భక్తేభ్యో హితబుద్ధ్యా కరో తివై, శస్త్రక్షారాదికర్మాణి స్వపుత్రాయ యథా పితా"** (భగవానుడు హితాన్ని కల్గిస్తాయనే కారణంతో భక్తులకు దుఃఖాలను కల్గిస్తాడు. తన బిడ్డలకు తండ్రివారి శరీరంలో స్వాస్థ్యం కల్గడం కోసంగా వ్రణాన్ని ఖండించడం కాల్చడం మొదలైన కార్యాలను చేయించేటట్లుగా) అని చెప్పబడిందికదా!

**22. ఉడైమై నానెన్ను ముడైయానుయిరై,**
**వడమదురై వన్దుదిత్తానెన్నుమ్, - తిడమాగ**
**అఱిన్దవన్దన్ తాళిల్ అడైన్దవర్క్కుముణ్డో,**
**పిఱన్దు పడు నీడుయరమ్ పిన్**

నాన్ = నేను, ఉడైమై ఎన్నుమ్ = భగవానుని సొత్తు - అని, ఉడైయాన్ = ఈ ఆత్మను సొత్తుగా కలవాడైన అతడు, ఉయిరై = దానిని ఉజ్జీవింపచేయడం కోసం, వడ మదురై వన్దు = ఉత్తర దిక్కులోని మధురకు వచ్చి, ఉదిత్తాన్ ఎన్నుమ్=

అవతరించిన శ్రీకృష్ణుడే అని, తిడమాక అఱిన్దు = దృఢంగా తెలిసికొని, అవన్‌తన్ తాళిల్ = అతని శ్రీచరణాలలో, అడైన్దవర్‌క్కు = శరణు పొందినవారికి, పిన్ పిఱన్దు పడుమ్ = అనంతర కాలంలో జన్మించి అనుభవించవలసిన, నీళ్ తుయరమ్ = ఉణ్డో = దీర్ఘమైన దుఃఖానికి కారణమైన కర్మ ఉంటుందా? (ఉండదు).

“జీవాత్మ సర్వేశ్వరుని సొత్తు” అని, “ఆ ఆత్మవర్గాలకు స్వామి ఉత్తర మధురానగరంలో అవతరించిన సర్వేశ్వరుడ”ని దృఢంగా తెలిసికొని, ఆస్వామి శ్రీచరణాలను ఆశ్రయించినవారికి తరువాత సంసారంలో పడి అనుభవించదగిన అనంతమైన క్లేశాలు ఉంటాయా?

ఇరుప్పత్తిరణ్డామ్‌పాట్టు :- అవతారికై - ప్రారబ్ధకర్మానుభవమ్ పణ్ణవేణు మాగిల్, ఇజ్జన్మత్తళవన్ఱిక్కే, జన్మాంతరత్తిలుమ్ పోయనుభవిక్కవేణ్డివరుమో? ఎన్న, సంబంధజ్ఞాన పూర్వకమాగ అవన్ తిరువడిగళిలే శరణమ్ పుగున్దార్‌క్కు ప్పిన్బొరు జన్మమ్ పిఱన్దు అనుభవిక్క త్తక్క కర్మముణ్డో ? ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (ఉడైయానుయిరై వడమదురై వన్దుదిత్తానెన్టుమ్)- ఇవ్వాత్మావై యుడైయవన్, ఇత్తై సంసారత్తిల్ నిన్టు మెడుక్కైక్కాగ శ్రీమధురైయిల్ వన్దావిర్భవిత్తు నిన్టవనుడైయ స్వామిత్వత్తైయుమ్.

(తిడమాగ వఱిన్దు) దృఢమాగ అఱిన్దు. తత్త్వస్థితియై యారాయ్‌న్దాల్, ఇత్తలైక్కు స్వత్వముమ్, అత్తలైక్కు స్వామిత్వముమ్ వ్యవస్థితమాయితే యిరుప్పదు. ఆగైయాలే, ఉడైమైయాన ఇవనిరున్ద విడత్తిలే వరువానుమ్, ఇవనై త్తన్నుడనే శేర్‌త్తుక్కొళ్ళువానుమ్, శేర్‌న్దాల్ త్తన్ పేఱాగ ఉగప్పాను మవనాయిఱ్ఱు. ఆగవితే. “ప్రాప్తావుమ్, ప్రాపకనుమ్, ప్రాప్తిక్కు ఉగప్పానుమ్ అవనే” ఎన్టు పిళ్ళైలోకాచారియర్ అరుళిచ్చెయ్‌దు. తిడమాగ అఱిగై యావదు- ఇప్పడి యిరుక్కిఱ సంబంధత్తై సంశయవిపర్య మఱ అఱిగై. ఇప్పడి ఇస్సంబంధత్తై యఱిన్దు,

(అవన్ తన్ తాళిల్ అడైన్దవర్‌క్కుమ్)- స్వామియానవన్ తిరువడిగళిలే, పూర్వవాక్యప్రక్రియైయాలే శరణమ్ పుగున్దవర్‌గళుక్కుమ్.



(ఉణ్డో పిఱన్దు పడు నీడుయరమ్ పిన్)- అదావదు- పిన్బొరు జన్మమ్ పిఱన్దు అనుభవిక్కత్తక్క దీర్ఘమాన కర్మముణ్డో? ఎన్గై. శరణాగతరానాల్, ఆర్తరాగిల్ అప్పోదే ముక్తరాగైయుమ్, దృప్తరాగిల్ అరబ్ధశరీరావసానత్తిలే ముక్తరాగైయుమొఴిన్ధియ, జన్మాంతరాన్వయమిల్లైయితే. “ఆర్తానా మాశు ఫలదా సకృదేవ కృతా హ్యసౌ, దృప్తానా మపి జంతూనాం దేహాంతరనివారిణీ” ఎన్టు ప్రపత్తిస్వభావమ్ శొల్లుగిఱ శాస్త్రమే ఇవ్వర్థత్తై చ్చొల్లానిన్టదితే. ఆగైయాలే యాయిఱ్ఱివరుమ్, “ఉణ్డో” ఎన్టరుళి చ్చెయ్‌దదు, “స్వత్వ మాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్, ఉభయో రేష సంబంధో న పరోఽభిమతో మమ” ఎన్గిఱ శ్రీవిష్ణుధర్మవచనమ్ ఇప్పాట్టిల్ శొన్న స్వస్వామి సంబంధత్తుక్కు ప్రమాణమాగ అనుసంధేయమ్.

ఇరవైరెండవ పాశురం :- అవతారిక : ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన కర్మలను అనుభవించి తీరాలి- అని శాస్త్రాలలో చెప్పబడినందున ఈ జన్మకు తరువాత అనంతర జన్మలలోను కర్మలను అనుభవించ వలసి ఉంటుందా?- అనే ప్రశ్న రాగా, తాను సొత్తు- అని అతడు సొత్తుదారుడని జ్ఞానం కల్గి, అతని శ్రీచరణాలలో శరణు పొందిన వారికి, అనంతర జన్మలలోను కర్మలను అనుభవించనక్కరలేదు- అని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (ఉడైమై నానెన్టుమ్)- “తాను భగవంతునకు శరీరం” అని తాను అతని సొత్తుగా ఉండే విషయాన్ని,

(ఉడైయాన్ ఉయిరై వడమదురై వన్దుదిత్తాన్ ఎన్టుమ్)- ఈ ఆత్మను సొత్తుగా కల్గినవాడైన భగవంతుడు దీనిని సంసారనుండి విడిపించడం కోసంగా ఉత్తరమధురానగరంలోకి వచ్చి అవతరించాడు- అని అతడు స్వామియై ఉండే విషయాన్ని,

(తిడమాక అఱిన్దు)- స్థిరంగా తెలిసికొని- అని అర్థం. యథార్థస్థితిని గ్రహిస్తే, జీవునకు సొత్తుగా ఉండే స్వభావం, భగవంతునకు సొత్తుదారుడై ఉండే స్వభావం సహజంగా ఉన్నదికదా! అందుల్ల సొత్తు అయిన ఇతడు ఉండే సంసారమండలానికి వచ్చేవాడు, అతనిని తనతో చేర్చుకొనేవాడు, అతనితో

జీవుడు చేరినపుడు తనకు గొప్ప ప్రయోజనం కల్గినట్లుగా ఆనందించేవాడు అతడే కాగలడు. అందువల్లనే కదా **"ప్రాప్తావుమ్, ప్రాపకనుమ్, ప్రాప్తిక్కు ఉకప్పానుమ్ అవనే"** అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు పలికారు. దృఢంగా తెలియడం అంటే- ఈవిధంగా ఉండే సంబంధాన్ని ఏవిధమైన సంశయం, విపర్యయం (సందేహం, భ్రాంతి) లేకుండా తెలియడం. ఈవిధంగా ఉండే ఈ (స్వస్వామిభావ) సంబంధాన్ని తెలిసి,

**(అవన్ తన్ తాళిల్ అడైన్దవర్క్కుమ్)**- స్వామి అయిన అతని శ్రీచరణాలలో ద్వయమంత్రం పూర్వవాక్యంలో చెప్పబడిన రీతిలో, లక్ష్మీదేవిని పురస్కరించుకొని శరణు పొందినవారికి,

**(ఉణ్డో పిఱన్దు పడుమ్ నీళ్ తుయరమ్ పిన్)** - దీని తాత్పర్యం ఏమంటే- శరణు పొందిన తరువాత మళ్ళీ ఇంకొక జన్మను ఎత్తి, అనుభవించి తీరవలసిన దీర్ఘమైన కర్మ ఉంటుందా ? అని. (తాత్పర్యం) శరణు పొందినట్లయితే, ఆర్తితో శరణు పొందిన ఆర్తప్రపన్నునిచే అపుడే మోక్షం పొందడం, మరణాన్ని పొందేటపుడు మోక్షాన్ని పొందితే చాలు- అనే దృప్త ప్రపన్నునిచే ఈ శరీర వియోగ (చివరి) సమయంలో మోక్షాన్ని పొందడం తప్ప, మళ్ళీ ఇంకొక జన్మను ఎత్తవలసినది లేదుకదా! **"ఆర్తానా మాశు ఫలదా సకృదేవ కృతా హ్యసౌ, దృప్తానా మపి జంతూనాం దేహాంతర నివారిణీ"** (పాంచరాత్రమ్)- (ఒకసారి చేయబడిన ఈ ప్రపత్తి ఆర్తితో చేసినవారికి వెంటనే ఫలాన్ని ఇస్తుంది. దృప్త ప్రపన్నునకు ఆదేహం అవసాన కాలంలో ఇంకొక జన్మకలగని రీతిలో చేస్తుంది) అని శరణాగతియొక్క స్వభావాన్ని తెలిపే శాస్త్రమే ఈ అర్థాన్ని పల్కింది. కదా! అందువల్లనే వీరుకూడా **"ఉణ్డో!"** అని స్థిరంగా పలికారు. **"స్వత్వ మాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్, ఉభయో రేష సంబంధో న పరోఽభిమతో మమ"** (శ్రీవిష్ణుధర్మమ్) (సొత్తుగా ఉండే స్వభావం ఆత్మలో ఉన్నది. సొత్తుదారుడై ఉండే స్వభావం పరబ్రహ్మలో ఉన్నది. ఈ ఇద్దటి మధ్య ఇదే సంబంధం వేఱు సంబంధం నాకు సమ్మతం కాదు) అనే శ్రీవిష్ణుధర్మవచనం ఈ పాశురంలో ''భగవంతుడు సొత్తుదారుడు'' అని, ''జీవుడు సొత్తు'' అని చెప్పబడిన సంబంధానికి ప్రమాణంగా అనుసంధించాలి.



**23. ఊழ்வినై కుఱుమ్బర్ ఓట్టరువర్ ఎన్ఱఞ్జి,**
**ఏழை మనమే! యిని త్తళరేల్, - ఆழிవణ్ణన్**
**తన్నడిక్కీழ் వీழ்న్దు శరణెన్ఱు ఇరన్దొరుకాల్**
**శొన్నదఱ్పిన్ ఉణ్డో తుయర్?**

ఊழ்వినై = అనాదికాలంగా పేరు కొని ఉండే సంచితకర్మలు, కుఱుమ్బర్= స్వతంత్రంగా నిలచి, ఒట్టరువర్ ఎన్ఱు = పరుగెత్తివచ్చి, బాధిస్తారు - అని, అఞ్జి= భయపడి, ఏழై మనమే = మూఢమైన మనసా! ఇవి తళరేల్ = ఇకపై బాధపడకు, ఆழి వణ్ణన్ తన్ = సముద్రవర్ణుడైన భగవానుని, అడి కీழ் = శ్రీచరణాల చెంత, విழுన్దు = పడి, శరణ్ ఎన్ఱు = "నీవే నాకు శరణు'' అని, ఇరన్దు = యాచించి, ఒరు కాల్ = ఒకసారి, శొన్నదఱ్పిన్ = ఈమాటను పల్కిన, పల్కిన తరువాత, తుయర్ = సంచితకర్మల ఫలంగా కలిగే దుఃఖం, ఉణ్డో = ఉంటుందా?

మూఢమైన ఓ మనసా! "ప్రాక్తనకర్మలనే దుష్టులు పరుగెత్తి వచ్చి మీదపడి బాధిస్తారు" – అని భయపడి ఇక నీవు శోకించవద్దు. సముద్రవర్ణుడైన సర్వేశ్వరుని శ్రీచరణాలలో వాలి, "నీవే శరణు కావాలి" అని ప్రార్థించి, ఒకసారి ద్వయోచ్చారణాన్ని చేసిన తరువాత కూడా క్లేశపడవలసిన అక్కఱ ఉన్నదా?

ఇరపత్తుమూన్ఱామ్‌పాట్టు :- అవతారికై - పూర్వాఘబలత్తై అనుసంధిత్తు, అదు నమ్మై వన్దు నలియుమెన్ఱు తళరుగిఱ తిరువుళ్ళత్తై త్తేఱ్ఱుగిఱ పాశురత్తాలే, శరణాగతనాన పిన్బు పూర్వానుఫలమాన దుఃఖానుభవ మిల్లై యెన్నుమత్తై సకలరు మఱియుమ్బడి యరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ :- **(ఊழ்వినై కుఱుమ్బర్)** - పழైయదాగ ఆర్జిక్కప్పట్ట కర్మమాగిఱ కుఱుమ్బర్. ఊழ் - ఎన్ఱదు - పழைమై. ఊழ்వినై- ఎన్ఱదు- పழైయ వినై- ఎన్ఱపడి. ఇత్తాల్ పూర్వాఘత్తై చ్చొల్లుగిఱదు. కర్మఙ్గళై క్కుఱుమ్బరెన్గిఱదు. చేతనసమాధియాలే. కుఱుమ్బరానవర్‌గళ్ బలత్తాలే నాట్టై త్తరవళమాక్కి మూలైయడి నడత్తుమాప్పోలే, కర్మఙ్గళుమ్ ఇవ్వాత్మావై త్తమ్ వழிయే యిழுత్తు మూలైయడియే నడత్తుమవైయిఱే.

(ఓట్టరువరెన్ఱజ్జి)- ఓడివరువరెన్ఱు భయప్పట్టు. కుఱుమ్బరాగైయాలే ఓట్టరువరెన్గిఱదు. కీழ్ చ్చొన్న కర్మజ్గళ్ శీఘ్రగతియాయ్ వన్దు నలియుమెన్ఱు భయపట్టు.

(ఏழை మనమే!) అఱివిలియాన నెఞ్జే ! అదావదు, శరణ్య వైభవముమ్, శరణాగతి వైభవముమ్, శరణాగతన్ పెఱుమ్ పేఱుమ్ అఱిగైక్కు త్తక్క అళవు ఇల్లాద నెఞ్జే ! - ఎన్ఱై.

(ఇని త్తళరేల్)- ఇదుక్కు మున్బు తళర్న్దాయాగిలుమ్, ఇని త్తళరాదేకొళ్. ఇత్తాల్, తిరువుళ్ళత్తై. "మా శుచః" ఎన్గిఱార్. "ఇని" ఎన్ఱదిన్ కరుత్తై వ్యక్తమాగ అరుళిచ్చెయ్‌గిఱార్, మేల్.

(అழிవణ్ణన్) గంభీరస్వభావన్. అన్ఱిక్కే, కడల్‌పోలే శ్రమహరమాన వడివైయుడైయవన్ -ఎన్నవుమామ్.

(తన్నడి క్కీழ் వీழ்న్దు) - "అழிవణ్ణ! నిన్నడియిణై యడైన్దేన్" ఎన్గిఱ పడియే అవన్ తిరువడిగళిన్ కీழ் విழுన్దు.

(శరణెన్ఱిరున్దు)- "త్వమేవో పాయభూతో మే భవ" ఎన్గిఱపడియే నీయే ఎనక్కు శరణమాగవేణు మెన్ఱు అర్థిత్తు.

(ఒరుక్కాల్ శొన్నదఱ్పిన్)- ప్రపత్తి సకృత్కరణీయై యాగైయాలే, ఇప్పడి సకృదుచ్చారణమ్ పణ్ణిన పిన్బు.

(ఉణ్డో తుయర్) - అదావదు - ఇప్పడి శరణాగతనాన పిన్బు పూర్వాఘ ఫలమాయ్ వరుగిఱ దుఃఖముణ్డో! శరణాగతనానపోదే పూర్వాఘోత్త రాఘ ప్రారబ్ధఖణ్డజ్గళెల్లామ్ కలియుణ్డు ప్పోమెన్గిఱ ప్రమాణత్తై నినైత్తు, ఉణ్డో? ఎన్గిఱార్. "మాభీ ర్మంద! మనో విచిన్త్య బహుధా యామీ శ్చిరం యాతనా నామీనః ప్రభవంతి పాపరిపవ స్స్వామీ నను శ్రీధరః, ఆలస్యమ్ వ్యపనీయ భక్తి సులభమ్ ధ్యాయస్వ నారాయణం లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిమ్ న క్షమః" ఎన్గిఱ శ్రీముకుందమాలైయిల్ శ్లోకత్తై "ఏழை మనమే! ఇనిత్తన్ రేల్" ఎన్ఱ ఇదుక్కు సంవాదమాగ చ్చొల్లువర్‌గళ్.



ఇరవైమూడవ పాశురం :- అవతారిక : అనాదికాలంగా పేరుకొని ఉండే సంచిత కర్మల ఫలాన్ని తలచి, అవి మనలను బాధిస్తాయా? - అని భయపడే మనస్సుకు ఊఱటను కల్గించడం కోసం, శరణు పొందిన తరువాత సంచిత కర్మలవల్ల కలిగే దుఃఖాన్ని అనుభవించనక్కరలేదు - అనే విషయాన్ని అందఱు తెలిసేటట్లుగా ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (ఊழி వినై కుఱుమ్బర్)- అనాది కాలంగా పేరుకొని ఉండే సంచితకర్మలనే దుష్టులు- అని అర్థం. "ఊழ்" -అనేపదం ప్రాచీనమనే అర్థాన్ని ఇస్తుంది. "ఊழி వినై" అంటే- అనాదికాలంగా చేరి ఉండే కర్మలు- అని అర్థం. దీనివల్ల పూర్వకర్మలను ఈ పదం తెల్పుతున్నది. కర్మలను జ్ఞానం కల్గినవారుగా రూపణ చేసి "కుఱుమ్బర్" అని అంటున్నారు. రాజ్యపాలనకు విరోధులైన వారు తమ బలంతో ప్రభువును తమ వశం చేసికొని, అరాచకాన్ని నడిపించేటట్లే, కర్మలు కూడా ఈ ఆత్మను తమ దారిలోకి ఈడ్చుకొని పోయి, తగని కార్యాలను చేయిస్తాయి కదా!

(ఓట్టరువర్ ఎన్ఱు అఞ్జి)- పరుగెత్తివస్తారు. అని భయపడి- అని అర్థం. కర్మలను "కుఱుమ్బర్" అని అన్నందున "ఓట్టరువర్" అని అన్నారు. పూర్వం పల్కిన సంచిత కర్మలు వేగంగా వచ్చి బాధిస్తాయి- అని భయపడి- అనేది ఇచటి తాత్పర్యం.

(ఏழை మనమే!) - జ్ఞానహీనమైన మనసా! అని అర్థం. అంటే - శరణంగా ఆశ్రయింపబడే భగవానుని గొప్పతనాన్ని, శరణాగతియొక్క గొప్పతనాన్ని, శరణు పొందినవాడు పొందే ఫలాన్ని గూర్చి తెలియడానికి తగిన గొప్పతనం (సామర్థ్యం) లేని ఓ మనసా! - అని తాత్పర్యం.

(ఇని త్తళరేల్)- ఇంతకుముందు నీవు బాధపడినప్పటికీ, నేను ఉపదేశించిన తరువాత ఇక బాధపడకుండా ఉండు- అని అర్థం. దీనివల్ల శ్రీకృష్ణుడు గీతలో చరమశ్లోకంలో (18-16) అర్జునుని ఉద్దేశించి "మా శుచః" అని పల్కినట్లుగా వీరుకూడా మనస్సును "దుఃఖించకు సుమా!'' అని అంటున్నారు. "ఇని" అనే పదం యొక్క తాత్పర్యాన్ని స్పష్టంగా పాశురంలో ఇకపై పల్కుతున్నారు.

**(ఆ*ళి*వణ్ణన్)**- గంభీరస్వభావాన్ని కలవాడు- అని అర్థం. ఆవిధంగా కాకుండా, **"ఆ*ళి*"** అని నిర్దేశింపబడే సముద్రంవలె శ్రమను తీర్చే తిరుమేనిని కలవాడు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(తన్నడిక్కీ*ళ్* వీ*ళ్*న్దు)**- **"ఆ*ళి*వణ్ణ! నిన్నడి అడైన్దేన్"** (పెరియ తిరుమొ*ళి*- 5-8-1) అనే రీతిలో ఆస్వామి శ్రీచరణాల మోల వాలి,

**(శరణ్ ఎన్ఱు ఇరున్దు)** - **"అహమస్మి అపరాధానా మాలయః అకించనోஉ నన్యగతిః, త్వమేవ ఉపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః, శరణాగతి రిత్యుక్తా సా దేవేஉస్మిన్ ప్రయుజ్యతామ్"** (అహిర్బుధ్న్య సంహిత-37-30,31) (నేను అపరాధాలను సాటిలేని నిలయమై ఉన్నాను. నన్ను రక్షించగల్గిన వేఱొక ఉపాయం ఏమీ లేనివాడనై ఉన్నాను. నీవే నాకు ఉపాయంగా కావాలి- అని ప్రార్థించే భక్తియే శరణాగతి అనబడుతున్నది. అది ఈ భగవానుని విషయంలో చేయబడుగాక) అనే రీతిలో "నీవే నాకు శరణం కావాలి'' అని ప్రార్థించి.

**(ఒరుకాల్ శొన్నదఱ్పిన్)** - శరణాగతిని ఒకసారే చేయాలి కనుక, ఈ విధంగా ఒకసారి పల్కిన తర్వాత,

**(ఉణ్డో తుయర్)** - ఈవిధంగా ఒకసారి శరణు పొందిన తరువాత పూర్వకర్మల ఫలంగా కలిగే దుఃఖం అనేది ఏదీ లేదు. శరణు పొందిన వెంటనే, పూర్వ సంచిత కర్మలు ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన ప్రారబ్ధకర్మలలోని మిగిలిన భాగాలు, ఇకపై సంభవించబోయే ఆగామి కర్మలు నశించిపోతాయి- అని పలికే ప్రమాణాల దార్ఢ్యాన్ని తలచి **"ఉణ్డో!"** అని అన్నారు.

**"మా భీర్మంద ! మనో విచింత్య బహుధా యామీ శ్చిరం యాతనాః, నామీ నః ప్రభవంతి పాపరిపవః స్వామీ నను శ్రీధరః, ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణం, లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిం న క్షమః"** (ముకుందమాల-11) (ఓ మూఢమనసా! పలు రీతులలోని నరకవేదనలను చిరకాలం అనుభవించ వలసి వస్తుందా? అని పలుమార్లు కలత చెంది భయపడవద్దు. మనం చేసిన పాపాలనే శత్రువులు మనలను జయించగల్గినవి కావు. మనకు స్వామిగా శ్రీధరుడున్నాడు కదా! సోమరితనాన్ని వీడి, భక్తిని



కలవారికి సులభుడైన శ్రీమన్నారాయణుని ధ్యానించు. లోకానికి అంతటికి దుఃఖాలను తీర్చే స్వామిదాసులమైన మన దుఃఖాలను కూడా పోగొట్ట గల్గినవాడుకదా!) అనే ఈ ముకుందమాలా శ్లోకాన్ని **"ఏ*ళై* మనమే! ఇనిత్తళరేల్"** అనే ఈ ప్రయోగానికి సంవాదరూపమైన ప్రమాణంగా విజ్ఞులు పల్కుతారు.

**24. వణ్డు పడి తుళబమార్బనిడై, చ్చెయ్‌ద పి*ళై***
**ఉణ్డు పలవెన్ఱు ఉళన్దళరేల్, - తొణ్డర్ శెయుమ్**
**పల్లాయిరమ్ పి*ళై*గళ్ పార్త్తిరున్దుమ్ కాణుజ్గన్**
**ఇల్లాదవన్‌కాణ్ ఇఱై.**

వణ్డు పడి = తుమ్మెదలు శబ్దించే, తుళప మార్బన్ ఇడై = తులసీమాలికను వక్షః స్థలంలో ధరించిన భగవానుని విషయంలో, శెయ్‌ద పి*ళై*= చేసిన అపరాధాలు, పల ఉణ్డు ఎన్ఱు = చాలా ఉన్నాయి - అని, ఉళమ్ = ఓ మనసా! తళరేల్ = బెదరి తల్లడిల్లకు, ఇఱై = స్వామి, తొణ్డర్ శెయ్యుమ్ = తన భక్తులు చేసే, పల్ ఆయిరమ్ పి*ళై*కళ్ = వలువేల, అపరాధాలను, పార్త్తిరున్దుమ్ = తెలిసినా, కాణుమ్ కణ్ = ఆ దోషాలను తన జ్ఞాననేత్రంతో, ఇల్లాదవన్ కాణ్ = చూడలేనివాడు కదా!

ఓ మనసా! "తుమ్మెదలు ఝుంకారం చేసే తులసీమాలికలను వక్షఃస్థలంలో అలంకరించుకొనిన శ్రియఃపతిపట్ల మనం చేసిన అపచారాలు పలువిధాలైనవి. వాటి ఫలం ఏవిధంగా కాగలదో?" అని నీవు కలత చెందకు. ఎందుకు? అంటే, సర్వేశ్వరుడు భక్తులు చేసిన పలు వేల అపరాధాలను, అతడు సర్వజ్ఞుడు కనుక గమనిస్తూ ఉన్నా, వాటిని చూచే నేత్రాన్ని కలవాడు కాదు కదా!

**ఇరుపత్తునాలామ్‌పాట్టు :- అవతారికై - ఉత్తరాఘబాహుళ్యత్తై నినైత్తు త్తళరుగిఱ తిరువుళ్ళత్తై త్తేఱ్ఱుగిఱ పాశురత్తాలే సర్వేశ్వరన్ ఉత్తరాఘత్తిల్ కణ్ వైయాన్- ఎన్నుమత్తై సకలరు మఱియ అరుళిచ్చెయ్‌గిఱార్.**

వ్యాఖ్యానమ్ :- **(వణ్డుపడి తుళబమార్బ నిడైచ్చెయ్‌ద పి*ళై*)**- **మధుపానార్థమాగ వణ్డుగళ్ సర్వకాలముమ్ పడిన్దు కిడక్కిఱ తిరుత్తు*ళా*యాలే అలజ్కృతమాన తిరుమార్బై యుడైయవన్ విషయత్తిల్ శెయ్‌ద కుఱ్ఱజ్గళానవై.**

ఇప్పోదు ఇన్ద విశేషణమ్ శొల్లిఱ్ఱు - శరణాగరానవర్గళై అనుభవిప్పిక్కైక్కాగ. సర్వకాలముమ్ తన్నై అలఙ్కరిత్తు క్కొణ్డిరుక్కుమవన్, అవర్గళ్ ప్రామాదికమాగ పణ్ణుమ్ కుఱ్ఱఙ్గళిల్ కణ్ వైయానెన్ఱు తోఱ్ఱుగైక్కాగ.

**(ఉణ్డు పల వెన్ఱు)** - ప్రకృతియోడిరుక్కైయాలే, మనోవాక్కాయఙ్గళాల్ శెయ్దవై పలవు ముణ్డెన్ఱు, ఒన్ఱుమ్ శెయ్యక్కడవో మల్లో మెన్ఱిరున్దాలుమ్, ప్రామాదికమాగ వన్దు పురుగిఱవై పలవు ముణ్డిఱే! అత్తై నినైత్తు.

**(ఉళన్దళరేల్)**- నెఞ్జే! తళరాదేకొళ్. ఉళమెన్ఱదు - ఉళ్ళ మెన్ఱపడియాయ్, సంబుద్ధియా ఇరుక్కిఱదు. తళరామలిరుక్కత్తక్కదు అరుళిచ్చెయ్గిఱార్, మేల్.

**(తొణ్డర్ శెయ్యుమ్)** - తన్ పక్కల్ భక్తరానవర్గళ్ శెయ్యుమ్. తొణ్డ రెన్ఱదు- చపలరెన్ఱపడియాయ్, భక్తరానవర్గళ్ - ఎన్ఱపడి. అన్ఱిక్కే, తనక్కు శేషభూతరానవర్గళ్ - ఎన్నవుమామ్.

**(పల్లాయిరమ్ పిழై గళ్)** - గుణత్రయాశ్రయమాన దేహత్తోడే యిరుక్కైయాలే రజస్తమస్సుకళాలే కలఙ్గి, కరణత్రయత్తాలుమ్ ప్రామాదికమాగ నాళ్ దోఱుమ్ శెయ్యుమవై అనేకమాగైయాలే, అనేకమాయిరమ్ పిழైగళ్- ఎన్గిఱార్. పిழై-కుఱ్ఱమ్. ఇత్తాల్- "అకృత్యకరణ కృత్యాకరణభగవదపచార భాగవతాపచారాసహ్యాపచారరూపనానావిధానంతాపచారాన్" ఎన్ఱవఱ్ఱై చ్చొల్లు గిఱదు.

**(పార్త్తిరున్దుమ్)**-సర్వజ్ఞనాగైయాలుమ్, అంతర్యామి యాగైయాలుమ్, సర్వకాలముమ్ సర్వరుడైయ వ్యాపారముమ్ పార్త్తుక్కొణ్డిరుక్కు చ్చెయ్ దేయుమ్.

**(కాణుమ్ కణ్ణిల్లాదవన్గాణ్ ఇఱై)** - అదావదు - అవర్గళ్ శెయ్యుమ్ పిழైగళై దర్శిక్కుమ్ కణ్ణిల్లాదవన్ కాణ్ శేషియానవన్ - ఎన్గై. ఇప్పోదు కణ్ ఎన్గిఱదు - జ్ఞానత్తైయిఱే. అదిల్లాదవన్ ఎన్ఱైయాలే, ఆశ్రితర్ శెయ్యుమ్ కుఱ్ఱఙ్గళిల్, అవిజ్ఞాతావాయిరుక్కు మెన్ఱదాయిఱ్ఱు. "అవిజ్ఞాతా హి భక్తానా మాగస్సు కమలేక్షణః, సదా జగత్సమస్తం చ పశ్యన్నపి హృది స్థితః" ఎన్నక్కడ వదిఱే.



ఇరవైనాల్గవ పాశురం :- అవతారిక : "శరణు పొందిన తరవాత చేసే అగామికర్మలు అనేకం ఉన్నాయి కదా!" అని తలచి భయపడే మనస్సును ఉద్దేశించి సాంత్వనను పలికే ఈ పాశురం ద్వారా, సర్వేశ్వరుడు, అతనిని శరణు పొందిన తరువాత చేసే పాపాలలో దృష్టిపెట్టడు - అనే విషయాన్ని అందఱు తెలిసేటట్లు పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- **(వణ్డు పడి తుళపమార్బినిడై చ్చెయ్ద పిழై)**- మధువును తాగడం కోసం తుమ్మెదలు అన్నిసమయాలలో రొదచేసే తులసీమాలిక చేత అలంకరింపబడిన వక్షస్సును కలవాని విషయంలో చేసిన అపరాధాలు - అని భావం. ఇపుడు **"వణ్డు పడి తుళపమార్బన్"** ఇత్యాది విశేషణాన్ని ప్రయోగించడం లోని ఉద్దేశ్యం ఏమంటే - శరణు పొందినవారిని అనుభవింప (ఆనందింప) జేయడం కోసం అన్ని సమయాలలో తనను అలంకరించుకొని ఉండేవాడు, వారు అజాగ్రత్తవల్ల చేసిన దోషాలను గమనించడు - అనే భావం స్ఫురించడం కోసం.

**(ఉణ్డు పల వెన్ఱు)** - మూలప్రకృతియొక్క వికారమైన శరీరంతో ఉన్నందున మనోవాక్కాయాలనే త్రికరణాలతో చేసిన దోషాలు అనేకం ఉన్నాయి- అని భావం. "ఏమీ చేయకుండా ఉండాలి'' అని తలచి ఉన్నప్పటికీ, అజాగ్రత్తవల్ల సంభవించే పాపాలు చాలా ఉంటాయికదా! వాటిని తలచి ఈవిధంగా పలికారు.

**(ఉళమ్! తళరేల్)**- ఓ మనసా! తల్లడిల్లకు సుమా! అని భావం. **"ఉళమ్"** అనే పదం, 'ఇడైకుఱై" అనే వికారాన్ని పొందిన **"ఉళ్ళమ్"** అనే పదంయొక్క సంబోధనాంత రూపవికారం. **"ఉళ్ళమే!"** అనే పదమే ఇక్కడ **"ఉళమ్"** అని మాఱింది. మనస్సు తల్లడిల్లకుండా ఉండడానికి గల కారణాన్ని ఇకపై గల పాశురభాగంలో పల్కుతున్నారు.

**(తొణ్డర్ శెయ్యుమ్)** - తనపట్ల భక్తిని కలవారు చేసే- అని అర్థం. **"తొణ్డు"** అనే పదం ఆశను (చాపల్యాన్ని), దాస్యాన్ని (చేసే స్వభావాన్ని) తెల్పుతుంది. ఇక్కడ, మొదటి అర్థాన్ని గ్రహిస్తే, **"తొణ్డర్"** అనేదానికి "ఆశను కల భక్తులు'' అని అర్థం. రెండవ అర్థాన్ని గ్రహిస్తే "భగవంతునకు దాసులైనవారు'' అని అర్థం.

**(పల్లాయిరమ్ పి*ழை*కళ్)-** సత్త్వరజస్తమస్సులనే త్రిగుణాలతో కూడిన శరీరంలో ఉన్నందున, రజోగుణంతో, తమోగుణంతో అజ్ఞానాన్ని (కలతను) పొంది, మనోవాక్కాయాలనే మూడు కరణాలతోను, గమనిక లేకుండా నిత్యం చేసే దోషాలు అనేకం కనుక, **"పల్లాయిరమ్ పి*ழை*కళ్"** అని అంటున్నారు. **"పి*ழై*"** అనే పదం అపరాధాన్ని తెల్పుతుంది.

"మనోవాక్కాయైః అనాదికాలప్రవృత్తానంతాకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచార- అసహ్యాపచార రూపనానావిధానంతాపచారాన్, ఆరబ్ధకార్యాన్, అనారబ్ధకార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వాన్ అశేషతః క్షమస్వ" (శరణాగతిగద్యమ్) (మనస్సు, వాక్కు, శరీరం- అనే మూడు కరణాల ద్వారా అనాదికాలంగా సంభవించిన అంతులేని, చేయదగని కార్యాలను చేయడం, చేయవలసిన కార్యాలను చేయకపోవడం, భగవానుని పట్ల అపచారపదం, అతని భక్తులపట్ల అపచారం చేయడం, ఆచార్యుల విషయంలో అపచారపడడం - అనే పలువిధాలైన లెక్కలేనన్ని దోషాలను, అన్నిటిని కొంచెంకూడా మిగలకుండా ఉండేటట్లు క్షమించాలి. ఈ అపచారాలలో కొన్ని ఫలాన్ని ఇవ్వడం ఆరంభించినవై ఉంటాయి, మఱికొన్ని ఫలాన్ని ఇవ్వడం ఇంకా ఆరంభించనివై ఉంటాయి. గడచిన కాలంలో, వర్తమాన కాలంలో, భవిష్యత్కాలంలో చేసినవి, చేస్తున్నవి, చేయబోయేవిగా ఉంటాయి. ఈ అపచారాలను అన్నిటిని ఏమీ మిగలకుండా క్షమించాలి) అని శ్రీరామానుజులు పల్కిన సూక్తిని తెల్పుతున్నది.

**(పార్త్తిరున్దుమ్)-** సర్వజ్ఞుడైనందున, అందఱికి అంతర్యామియై ఉన్నందున, అన్ని కాలాలలో అందఱు చేసిన కార్యాలను చూస్తూ ఉన్నప్పటికీ,

**(కాణుమ్ కణ్ ఇల్లాదవన్ కాణ్ ఇఱై)-** దీని తాత్పర్యమేమంటే- వారిని సొత్తుగా కలవాడైనందున, వారు చేసే అపరాధాలను గమనించే దృష్టి లేనివాడని భావం. ఇపుడు **"కణ్"**- అనే పదం జ్ఞానాన్ని కదా తెల్పుతుంది. దానిని లేనివాడని అన్నందున- భక్తులు చేసే దోషాలను తెలియనివాడు- అని చెప్పినట్లయినది. **"ఇఱై"**- అనే పదానికి స్వామి- అనే అర్థం మొదట గ్రహింపబడింది. ఆ విధంగా



కాకుండా, అందఱికి ఈశ్వరుడైనందున, సర్వేశ్వరుడనే అర్థాన్ని గ్రహించవచ్చు. అన్నిటిని తెలిసిన సర్వజ్ఞుడైనా, చూడలేడు- అని భావం. "అవిజ్ఞాతా హి భక్తానా మాగస్సు కమలేక్షణః, సదా జగత్ సమస్తం చ పశ్యన్నపి హృది స్థితః" (పద్మనేత్రుడైన స్వామి అందఱి హృదయాలలో ఉంటూ, లోకాన్ని అంతటిని గమనించేవాడై ఉన్నా, భక్తుల అపరాధాలను చూడడు కదా) అని చెప్పబడింది కదా!

**25. అ*ற్ఱ* ముఱైక్కిల్ అడైన్దవర్పాల్ అమ్బుయైకోన్,**
**కు*ற్ఱ* మునర్న్దిగ*ழு*మ్ కొళ్గైయనో, - ఎ*ற్ఱే*! తన్**
**కన్ఱినుడమ్బిన్ వ*ழு*వన్ఱో, కాదలిప్పదు**
**అన్ఱదనై యీన్ఱుగన్ద వా.**

అ*ற్ఱ*మ్ ఉఱైక్కిల్ = వాస్తవాన్ని పల్కితే, అమ్బుయ కోన్ = పద్మినీవల్లభుడు, అడైన్దవర్ పాల్ = దాసుల విషయంలో, కు*ற్ఱ*మ్ = దోషాలను, ఉణర్న్దు = తెలిసి, (చూచి), ఇక*ழு*మ్ కొళ్కైయనో = ఆ దోషాల కారణంగా వారిని నిరసించి విడచి పెట్టే స్వభావాన్ని కలవాడా? (కాదు), ఎ*ற్ఱే*= దీనిని కొందఱు తెలియకుండా ఉండడం ఎంత ఆశ్చర్యం! తన్ కన్ఱిన్ = తాను ప్రసవించిన లేగదూడయొక్క, ఉడమ్బిన్ = శరీరంలో ఉండే, వ*ழு*వు అన్ఱో = మలినాన్ని కదా, అన్ఱు = ప్రసవించిన సమయంలో, అదనై ఈన్ఱు ఉకన్ద = ఆ లేగదూడను ప్రసవించినందున కల్గిన ఆనందాన్ని కల, ఆ = గోవు, కాదలిప్పదు= ఆదరంతో స్వీకరిస్తుంది.

శాస్త్రాలలో నిశ్చయింపబడిన అర్థాలనుగూర్చి తెలిపినట్లయితే, అవి ఏతావన్మాత్ర మేసుమా! లక్ష్మీనాథుడైన భగవానుడు భక్తుల విషయంలో దోషాలను గమనించినా, ఆ దోషాల కారణంగా వారిని విడిచిపెడతాడా? విడచిపెట్టడు. ఆహా! అపుడే దూడను ఈని ఆనందించే ఆవు, తన దూడ శరీరంలో ఉండే మలినాన్ని భోగ్యంగా గ్రహిస్తుంది కదా!

**ఇరుపత్తఞ్జామ్పాట్టు :- అవతారికై - కాణుమ్ కణ్ణిల్లాదవన్ కాణ్- ఎన్ఱు ఉత్తరాఘత్తిల్ అజ్ఞనాయిరుక్కు మెన్ఱార్, కీ*ழ்*; పూర్వాఘమ్ తన్నిలేదేనుమొన్ఱై**

దర్శిత్తాలుమ్, వత్సలనాగైయాలే, అత్తై భోగ్యమాగ క్కొళ్ళుమదొ*ఴ్రి*య, అత్తై యిట్టు అవర్గళై యిగ*ఴా* నెన్రుమత్తై సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ : (అ*న్ఱ* మురైక్కిల్)- అఱుదియానదు శొల్లిల్. అదావదు- పరమార్థ మానదు శొల్లిల్ - ఎన్రై.

(అడైన్దవర్‌పాల్)- ఆశ్రితరానవర్గళ్ పక్కల్.

(అమ్బుయైకోన్)- శ్రియఃపతియానవన్. అవళ్ పురుషకారమాగవిఱే అడియిల్ అఙ్గీకరిత్తదు; అప్పడి యఙ్గీకరిత్తాల్, పిన్నై యెన్రుమొక్క అవర్గళ్‌పక్కల్ వత్సలనా యిరుక్కుమాయి*న్ఱు*. తాన్ కాట్టిక్కొడుత్తవర్గళై అవన్ కైక్కొణ్డవదిన్ ఉఱప్పై యఱిగైక్కాగ, అవళ్ తానే అవర్గళ్ కు*న్ఱ*ఙ్గళై క్కాట్టినాలుమ్, "ఎన్నడి యారదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్రు శెయ్‌దార్" ఎన్రు మవనిఱే.

(కు*న్ఱ* ముణర్న్దిగ*ఴు*మ్ కొళ్గైయనో)- అదావదు- అవర్గళ్ కు*న్ఱ*ఙ్గళై దర్శిత్తు, అదడియాగ అవర్గళై ఇగ*ఴ్*న్దువిడుమ్ స్వభావత్తై యుడైయవనో! - ఎన్రై. కొళ్గై-స్వభావమ్. ఇత్తాలవళ్ పురుషకార పురస్సర మాగ త్తన్నాలే అఙ్గీకరిక్కప్పట్టవర్గళుడైయ కు*న్ఱ*న్దాన్ ముదలిలే యుణర క్కూడాదు, ఉణర్న్దాలుమ్, వాత్సల్యత్తాలే అత్తై భోగ్యమాగ క్కొళ్ళుమదొ*ఴ్రి*య, అత్తై యిట్టు అవర్గళై ఇగ*ఴ*క్కూడాదు- ఎన్నుమిడమ్ శొల్లుగిఱదు. "ఇగ*ఴు*మ్ కొళ్గైయనో!" ఎన్గిఱ విదిఱే. కు*న్ఱ*త్తై ఉణర్న్దానాగిల్ అత్తై భోగ్యమా క్కొళ్ళుమిత్తనై - ఎన్గిఱ అర్థత్తై క్కాట్టుగిఱదు.

(ఎ*న్ఱే*)-ఎన్నే! అవనుడైయ వాత్సల్యప్రకార మఱియాదారిఱే ఇగ*ఴు* మెన్రు నినైక్కిఱవర్గళెన్రు, "ఎన్నే!" ఎన్గిఱార్. అవన్ వాత్సల్యత్తుక్కు ఒరు దృష్టాంత మరుళిచ్చెయ్‌గిఱార్ మేల్.

(తన్ కన్రినుడమ్బిన్ వ*ఴు*వన్రో కాదలిప్పదు అన్రదనైయాన్రుగన్ద వా)- ఎన్రు. అదావదు- శువడు పట్ట తరైయిల్ పుల్ కవ్వాదదా యిరుక్కచ్చెయ్‌దే, తన్ కడైయిల్ నిన్రుమ్ వి*ఴు*న్ద కన్రినుడైయ ఉడమ్బిల్ వ*ఴు*మ్బైయన్రో, స్నేహిత్తు భుజిప్పదు. అన్రు అ*న్ఱై* ప్పె*న్ఱ*వత్తాలే, అదిన్ పక్కల్ ఉగప్పైయుడైత్తాన



పశువానదు - ఎన్రై. ఇదుదాన్, సర్వేశ్వరనుడైయ వాత్సల్యత్తుక్కు దృష్టాంతమాగ సకలరు మరుళిచ్చెయ్యుమదిఱే. "ప్రపన్నాన్ మాధవ స్సర్వాన్ దోషేణ పరి గృహ్యతే, అద్య జాతం యథా వత్సం దోషణ సహ వత్సలా" ఎన్నక్కడవదిఱే. ఇన్ద శ్లోకత్తిల్ "పరిగృహ్యతే" ఎన్గిఱ ఇదు, ఆర్షమ్. "పరిగృహ్ణాతి" - ఎన్రపడి.

ఇరవైఐదవ పాశురం :- అవతారిక : గడచిన పాశురంలో "కాణుమ్ కణ్ ఇల్లాదవన్ కాణ్" అని అంటూ శరణు పొందిన తరువాత భక్తులు చేసే అపరాధాలను తెలియనివాడు, స్వామి'' అని అన్నారు. శరణు పొందడానికి ముందు చేసిన పాపాలలో దేనినైనా గమనించినా, గోవుయొక్క గుణమైన వాత్సల్యాన్ని కలవాడైనందున, ఆ దోషాన్ని భోగ్యంగా గ్రహిస్తాడే తప్ప, దానిని చూచి వారిని విడువడు- అనే విషయాన్ని గోవును ఉదాహరణంగా చూపిస్తూ ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (అ*న్ఱ*మ్ ఉరైక్కిల్) బాగా విచారించి గమనించిన విషయాన్ని పల్కినట్లయితే- అని అర్థం. అంటే- యథార్థాన్ని పల్కితే- అని తాత్పర్యం.

(అడైన్దవర్ పాల్)- భక్తులపట్ల,

(అమ్బుయైకోన్)- లక్ష్మీవల్లభుడు- అని అర్థం. ఆ దేవేరి పురుషకారం చేసినందువల్లనేకదా, మొదట ఇతనిని స్వీకరించాడు. ఆ విధంగా అంగీకరించిన తరువాత, సదా వారిపట్ల వాత్సల్యగుణాన్ని చూపిస్తాడు. ఆవిధంగా పురుషకారం చేయబడినవారిని అతడు దృఢంగా స్వీకరించాడా? లేదా? - అని పరిశీలించి తెలిసికోవడంకోసం, ఆ లక్ష్మీదేవియే వారు చేసిన అపరాధాలను చూపినా, "ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్రు శెయ్‌దార్" (పెరియా*ఴ్వా*ర్ తిరు-4-9-2) (నా భక్తులు అపరాధాలను చేయరు. వారు చేస్తే మంచినే చేస్తారు) అని అంటాడు - అని పెరియా*ఴ్వా*ర్ అన్నారు కదా!

(కు*న్ఱ*మ్ ఉణర్న్దు ఇక*ఴు*మ్ కొళ్కైయనో!)- దీని భావం ఏమంటే- వారి దోషాలను చూచి, తత్కారణంగా, వారిని నిందించి వదలిపెట్టే స్వభావాన్ని

కలవాడా? కాదు, అని అర్థం. **"కొళ్కై"** -స్వభావం. ఈప్రయోగంద్వారా- లక్ష్మీదేవి పురుషకారం చేయగా, తనచే అంగీకరింపబడిన వారి దోషాలను స్వామి గమనించడు. ఒకవేళ గమనించినా, వాత్సల్యగుణంతో చూపి వారిని దూరం చేయడు- అనే విషయం చెప్పబడింది. **"ఇక*ళ్లు*మ్ కొళ్కైయనో!"** అనే ప్రయోగం దోషాన్ని గ్రహించినా, దానిని నిందించకపోవడమే కాదు; దానిని భోగ్యంగా గ్రహిస్తాడు- అనే అర్థాన్ని తెల్పుతున్నది.

**(ఎ*న్ఱ్ఱే*!)**- ఏమి! ఆశ్చర్యం! అతని వాత్సల్యంయొక్క గొప్పతనాన్ని తెలియనివారు కదా "అతడు దోషాలను చూచి నిందిస్తాడు'' అని తలుస్తారు. **"ఎ*న్ఱ్ఱే*!"** అనే పదంలోని తాత్పర్యం. ఇపుడు అతని వాత్సల్యగుణానికి ఒక ఉదాహరణాన్ని చూపుతున్నారు.

**(తన్ కన్టిన్ ఉడమ్బిన్ వ*ళ్లు*వన్టో కాదలిప్పదు అన్టు అదనై ఈన్టు ఉకన్దఆ)** అనేది ఆ ఉదాహరణం. దీని తాత్పర్యమేమంటే- ముఱికి నిండిన భూమిపై ఉండే గడ్డిని కూడ తినని ఆవు, తన శరీరం వెనుక భాగం నుండి వెలువడిన లేగదూడ శరీరానికి అంటుకొని ఉండే మలినాన్ని చాలా ఆదరంగా గ్రహిస్తుంది. దానికి కారణం - అపుడు దానిని తాను కన్నందున, దానిపట్ల ప్రేమను కల్గినది అయినందున - అని భావం. ఈ విషయాన్ని సర్వేశ్వరుని వాత్సల్యగుణానికి ఉదాహరణంగా అందఱు పల్కుతారు కదా! **"ప్రపన్నాన్ మాధవ స్సర్వాన్ దోషేణ పరిగృహ్యతే, అద్య జాతం యథా వత్సం దోషేణ సహ వత్సలా"** (లేగదూడపట్ల వాత్సల్యాన్ని కల ధేనువు అపుడే తాను ఈనిన లేగదూడను దాని మలినంతో పాటు ఆదరించేటట్లే, మాధవుడు ప్రపన్నులను అందఱిని వారి దోషాలతో పాటు పరిగ్రహిస్తాడు) అని చెప్పబడుతున్నది కదా! ఈ శ్లోకంలో **"పరిగృహ్యతే"** అనేది ఆత్మనేపదం, కర్మణి ప్రయోగం. ఇది ఆర్షప్రయోగంగా గ్రహించాలి. **"పరిగృహ్ణాతి"** అని పరస్మైపది కర్తరిప్రయోగంగా దానిని గ్రహించాలి.

**26. తప్పిల్ గురువరుళాల్ తామరైయాళ్నాయగన్టన్**
**ఒప్పిలడిగళ్ నమక్కుళ్ళత్తు, - వైప్పెన్టు**



**తేఱి యిరుప్పార్గళ్ తేశు పొలి వైకున్దత్తు,**
**ఏఱియిరుప్పార్ పణిగట్కేయ్న్దు**

తప్పు ఇల్ = (జ్ఞానానుష్ఠానాలలో) కొఱత లేని, దోషం లేని, గురు = ఆచార్యుని, అరుళాల్ = కరుణచే, తామరైయాళ్ నాయకన్‌తన్ = లక్ష్మీనాథుని, ఒప్పు ఇల్= (వేఱు దేనినీ ఎదురు చూడనిది అయినందున) సాటి లేని, అడికళ్= శ్రీచరణాలు, నమక్కు = (దాసులమైన) మనకు, ఉళ్ళత్తు = హృదయంలో ఉండే, వైప్పు ఎన్టు= దాచిన నిధి అని, తేఱియిరుప్పార్ కళ్ = సమ్మికతో ఉండేవారు, తేశు పొలి= తేజస్సు మిక్కిలిగా ఉండే, వైకున్దత్తు = వైకుంఠానికి, ఏఱి = అధిరోహించి, పణికట్కు= భగవానునకు కైంకర్యం చేయడానికి, ఏఱి ఇరుప్పార్ = పొందికగా ఉండే యోగ్యతను పొందినవారు.

జ్ఞానం, అనుష్ఠానం – అనే వీటిలో ఏలోటు లేని ఆచార్యుని కరుణతో "శ్రియఃపతి యొక్క సాటి లేని శ్రీపాదాలు మనకు మనస్సులో నిలచి ఉండే గుప్త నిధి" అని తెలిసినవారు, తేజస్సు మిక్కిలిగా ఉండే పరమపదాన్ని చేరి, అక్కడ స్వామి కైంకర్యాలకు అధికారులై ఉండగలరు.

**ఇరుపత్తాఱామ్‌పాట్టు :- అవతారికై - ఆచార్యప్రసాదత్తాలే అవనరుళిచ్చెయ్‌ద శరణాగతియినుడైయ అవ్వర్థత్తై అనుసంధిత్తు విశ్వసిత్తిరుక్కుమవర్గళ్, పరమపదత్తిలే పోయ్ భగవత్కైంకర్యపరరాయిరుప్పర్ - ఎన్గిఱార్.**

వ్యాఖ్యానమ్ : **(తప్పిల్ కురువరుళాల్)** - తప్పిల్లాద గురువినుడైయ అరుళాలే. అదావదు- జ్ఞానానుష్ఠానజ్గల్ ఒరు తవిర్‌దల్ ఇల్లాద ఆచార్యనుడైయ ప్రసాదత్తాలే -ఎన్టై.

**(తామరైయాళ్ నాయకన్టన్)**- శ్రియఃపతియానవన్ తన్నుడైయ. ఇత్తాల్- శ్రీమత్ పద- నారాయణపదజ్గళిల్ అర్థత్తై చ్చొల్లుగిఱదు. ఎజ్గనే? ఎన్నిల్, **"తామరైయాళ్ నాయగన్"** ఎన్టైయాలే, పురుషకారభూతైయాన పిరాట్టియోడు ఉణ్డాన నిత్యయోగత్తైయుమ్, **"నాయగన్టన్"** ఎన్గిఱ ఉరప్పాలే ఆశ్రయణ సౌకర్యాపాదకమాయుమ్, ఆశ్రితకార్యాపాదకమాయుముళ్ళ వాత్సల్యాదియుమ్, జ్ఞానాదియుమాన గుణజ్గళుక్కు, ఆశ్రయమాయిరుక్కు మాకారత్తైయుమ్ శొల్లుగైయాలే.

**(ఒప్పిలడిగళ్)**- ఒప్పిల్లాద తిరువడిగళ్. ఇత్తాల్- **"చరణౌ"** ఎన్గిఱ పదత్తిల్ అర్థత్తై చొల్లుగిఱదు. తిరువడిగళుక్కు ఒప్పిల్లామైయావదు- సహాయాంతర నిరపేక్షమాయిరుక్కై.

**(నమక్కుళ్ళత్తు వైప్పెన్ఱు)** - ఆకించనరాయ్, అనన్యగతిగళాన నమక్కు హృదయత్తిల్ ఇరుక్కిఱ శేమనిధి యెన్ఱు. ఇత్తాల్ - శరణపదత్తిలుమ్, క్రియాపదత్తిలుముణ్డాన అర్థఙ్గళై చ్చొల్లుగిఱదు. ఎఙ్గనే? ఎన్నిల్, వైప్పెన్ఱు తన్నైక్కొణ్డు సకలము ముణ్డాక్కిక్కొళ్ళలామ్; శేమనిధియాగ చ్చొల్లుగైయాలే, ఉపాయత్వత్తైయుమ్, ఉళ్ళత్తు వైప్పెన్ఱు, హృదయసంబంధత్తైయుమ్, తద్విషయమాన మానసస్వీకారత్తైయుమ్ శొల్లుగైయాలే. ఇప్పడి అనుసంధిత్తు.

**(తేఱియిరుప్పార్గళ్)**- ఇవ్వనుసంధాన ముణ్డానాలుమ్, మహావిశ్వాసమ్ వేణుమిఱే. ఆగైయాలే అప్పడి విశ్వసిత్తిరుక్కుమవర్గళ్.

**(తేశు పొలి వైకున్దత్తేఱి)**- అదావదు - భగవదనుభవ కైంకర్యఙ్గళుక్కు అనురూపమాన దేశమెన్నుమ్, తేజస్సు మిక్కిరుక్కిఱ శ్రీవైకుంఠత్తిలే పోయ్.

**(ఇరుప్పార్ పణిగట్కేయ్న్దు)** - పణిగళుక్కేయ్న్దిరుక్కైయావదు- అనురూపమాన అధికారిగళాయిరుక్కై. ఇరుప్పార్ ఎన్ఱపడి. అన్ఱిక్కే, పణి ఎన్ఱు తిరువనందాழ్వానాయ్, బహువచనమ్ పూజ్యవాచియాయ్, తత్తుల్యరాయిరుప్పర్ - ఎన్నవుమామ్. అదావదు - తిరువనందాழ్వాన్. "శెన్ఱాల్కుడైయామ్" ఎన్గిఱపడియే అఖిలశేషవృత్తిగళిలుమ్ అధికృతనాయిరుక్కుమాప్పోలే, అశేషశేషవృత్తిగళిలుమ్, అనిత్యరాయిరుప్పార్-ఎన్గై. "ఆచార్యస్య ప్రసాదేన మమ సర్వ మభీప్సితమ్, ప్రాప్నుయామీతి విశ్వాసో యస్యాప్తి స సుఖీ భవేత్" ఎన్నక్కడవదిఱే.

ఇరవైఆఱవపాశురం : అవతారిక : సర్వేశ్వరుడు చూపిన శరణాగతి యొక్క అర్థాన్ని ఆచార్యుని కృపవల్ల గ్రహించి, దానిలో విశ్వాసంతో ఉండేవారు పరమపదానికి చేరి భగవానునకు కైంకర్యం చేయడంలో అభినివేశాన్ని పొందుతారు - అని ఈ పాశురంలో అంటున్నారు.



వ్యాఖ్యానం : **(తప్పిల్ కురువరుళాల్)** - ఏదోషం లేని ఆచార్యుని అనుగ్రహం వల్ల - అని అర్థం. అంటే- జ్ఞానానుష్ఠానాలలో ఏ లోపం లేని ఆచార్యుని కృపవల్ల- అని భావం.

**(తామరైయాళ్ నాయకన్దన్)** - లక్ష్మీనాథుని యొక్క- అని అర్థం. దీనివల్ల, ద్వయంలోని పూర్వవాక్యంలో ఉండే **"శ్రీమత్"** అనే **"నారాయణ"** అనే ఈ రెండు పదాల అర్థం తెలుపబడింది. ఏవిధంగా? అంటే, **"తామరైయాళ్ నాయకన్"** అని అన్నందున పురుషకారం చేసే పిరాట్టితో నిత్యం చేరి ఉండడమనే శ్రీమచ్ఛబ్దార్థం. **"నాయకన్‌తన్"** అని దార్ఢ్యం తోచేటట్లుగా పల్కినందున నారాయణుడు తనను ఆశ్రయించడానికి సౌకర్యాన్ని కల్గించే వాత్సల్యం, సౌలభ్యం, సౌశీల్యం, దయ - అనే గుణాలను, దాసులు కోరే కార్యాలను నెరవేర్చగల్గిన తగిన జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు- అనే గుణాలను కల్గి ఉన్నాడు- అనే నారాయణ పదార్థం చెప్పబడింది కనుక.

**(ఒప్పిల్ అడికళ్)**- సాటిలేని శ్రీచరణాలు- అని అర్థం. దీనివల్ల ద్వయం మొదటి వాక్యంలో ఉండే **"చరణౌ"** అనే పదం యొక్క అర్థం తెలుపబడింది. శ్రీచరణాలకు గల ఉపమానరాహిత్యం ఏమంటే- ఆశ్రితరక్షణంలో వేఱు ఎవరిని సహాయంగా ఎదురు చూడకుండా ఉండడం.

**(నమక్కు ఉళ్ళదు వైప్పెన్ఱు)**- తనను రక్షించే ఏవిధమైన సాధనానుష్ఠానాన్ని లేని అకించనులై, వేఱు ఏ గతి లేని అనన్యగతికులైన మనకు హృదయంలో ఉండే దాచిపెట్టిన విధి - అని అర్థం. ఈ ప్రయోగం ద్వారా ద్వయంలోని **"శరణం"**- అనే పదంవల్ల, **"ప్రపద్యే"**- అనే క్రియాపదం వల్ల స్ఫురించే అర్థాలు తెలుపబడ్డాయి. ఏరీతిలో ? అని అంటే, **"వైప్పు"**- అని అంటూ భగవానుని అన్ని హితాలను కల్గించగల్గిన దాచిపెట్టిన నిధిగా పల్కడం వల్ల, ఆ చరణాల ఉపాయత్వం, **"ఉళ్ళదు వైప్పు"** - అని ఆ శ్రీచరణాలను మనస్సులో ఉపాయంగా గ్రహించాలి - అని పల్కినందున (తెలుపబడ్డాయి).

**(తేఱియిరుప్పార్కళ్)** -ఈ రీతిలో తలచి, ఇటువంటి భావన ఉన్నా, శరణాగతికి తప్పక ఆవశ్యకమైన మహావిశ్వాసం ఉండాలికదా! అందువల్ల, అటువంటి మహావిశ్వాసాన్ని కల్గినవారు- అని భావం.

**(తేశుపొలి వైకున్దత్తేఱి)** - భగవానుని అనుభవించడానికి, కైంకర్యం చేయడానికి తగిన దేశం- అనే గొప్ప ప్రకాశాన్ని కల్గిన శ్రీవైకుంఠాన్ని చేరి.

**(ఇరుప్పార్ పణికట్కు ఏయ్న్దు)**- కైంకర్యాలను చేయడానికి తగిన యోగ్యతను కలవారు. **"పణికళ్"** అని భగవానునకు చేసే కైంకర్యాలు తెలుపబడుతున్నాయి. దీనికి పొందికగా ఉండడమంటే- తగిన యోగ్యతను కలవారై ఉండడం. **"ఇరుప్పార్"** అంటే- **"ఇరుప్పర్"**- (కల్గిఉంటారు) అని అర్థం. ఆ విధంగా కాకుండా, **"పణి"** అనే పదం పడగలను కల ఆదిశేషుని తెల్పుతున్నదని గ్రహించి, **"పణికళ్"**- అనే బహువచనం గౌరవవాచకమై, ఈ ప్రయోగం ద్వారా ఆదిశేషునితో పోలినవారై ఉంటారు- అనికూడా అర్థాన్ని గ్రహించవచ్చు. అంటే- ఆదిశేషుడు **"శెన్ఱాల్ కుడైయామ్ ఇరున్దాల్ శిఙ్గాశనమామ్ నిన్ఱాల్ మరవడియామ్, నీళ్‌కడలుళ్ ఎన్ఱుమ్ పుణైయుమ్ మణివిళక్కామ్ పూమ్ పట్టామ్ పుల్‌కుమణైయామ్ తిరుమాఱ్కురవు"** (శ్రియఃపతి ప్రయాణం చేసే టప్పుడు గొడుగుగా, కూర్చుంటే సింహాసనంగా, నిలిస్తే పాదుకలుగా, క్షీరాబ్ధిలో కాలిదిండుగా, మణిదీపంగా, పీతాంబరంగా, శయ్యగా ఆదిశేషుడు సేవచేస్తాడు) (ముదల్‌తిరు-53) అనే రీతిలో అన్ని విధాలైన కైంకర్యాలను చేసేవాడై ఉండేటట్లు, వీరుకూడా అన్ని రీతులలోని కైంకర్యాలను చేసేవ వారై ఉంటారు - అని భావం.

"ఆచార్యస్య ప్రసాదేన మమ సర్వమభీప్సితమ్, ప్రాప్నుయామితి విశ్వాసో యస్యాస్తి. స సుఖీ భవేత్" (ఆచార్యుని అనుగ్రహంవల్ల నేను అన్నివిధాలైన అభీష్టాలను పొందగలను- అని ఏ శిష్యునకు నమ్మకం ఉంటుందో, అతడే ఆ అభీష్టాలను పొంది ఆనందాన్ని పొందుతాడు) అని చెప్పబడిందికదా!

**27. నెఱి యఱియాదారుమ్ అఱిన్దవర్‌పాల్ శెన్ఱు,**
**శెఱిదల్ శెయా త్తీమనత్తర్ తాముమ్, - ఇఱైయురైయై**
**త్తేఱాదవరుమ్ తిరుమడన్దై కోనులగత్తు,**
**ఏఱార్ ఇడర్అழున్దువార్**



నెఱి = మోక్షోపాయాన్ని, అఱియాదారుమ్ = తెలియనివారు, అఱిన్దవర్ పాల్ శెన్ఱు = మోక్షోపాయాన్ని తెలిసినవారి దగ్గరకు వెళ్ళి, శెఱిదల్ శెయ్యా = నమస్క రించి కైంకర్యాన్ని చేసి, (వారి సదుపదేశాలను) వినని, తీ మనత్తర్ తాముమ్ = చెడ్డ మనస్సును కలవారు, ఇఱై ఉరైయై = సర్వేశ్వరుడు అనుగ్రహించిన చరమశ్లోకం యొక్క అర్థాన్ని, తేఱాదవరుమ్ = నమ్మనివారు, తిరు మడన్దైకోన్ ఉలకత్తు = లక్ష్మీనాథుని లోకమైన శ్రీవైకుంఠాన్ని, ఏఱార్ = అధిరోహించలేరు, ఇడర్ = సంసారమనే దుఃఖంలో, అழున్దువార్ = మునిగిపోతారు.

సంసారసముద్రాన్ని దాటడానికి తగిన ఉపాయాన్ని తెలియనివారు, ఆ ఉపాయాన్ని తెలిసినవారివద్దకు పోయి చేరని చెడ్డమనస్సును కలవారు, సర్వేశ్వరుడు పల్కిన గీతలోని చరమశ్లోకంలో స్పష్టమైన అవగాహన లేనివారు - శ్రియః పతిలోకమైన పరమపదాన్ని చేరలేనివారై, సంసారక్లేశాలలోనే మునిగి పడిఉంటారు.

ఇరువత్తేழామ్‌పాట్టు :- అవతారికై - ఉజ్జీవనోపాయ మఱియాదారుమ్, అత్తై ఉప దేశిక్కుమవర్‌గళ్ పక్కల్ శేర్‌న్దఱియాదారుమ్, చరమశ్లోకార్థత్తై విశ్వసియాదవర్ గళుమ్ పరమపదత్తిలేఱప్పెఱాదే భవదుఃఖమగ్నరాయ్ ప్పోరువర్‌గళ్-ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (నెఱి యఱియాదారుమ్) - సంసారత్తై త్తప్పువిక్కు ముపాయమ్ అఱియాదారుమ్, నెఱి-వழియాయ్, ఉపాయత్తై చ్చొల్లుగిఱదు.

(అఱిన్దవర్‌పాల్ శెన్ఱు శెఱిదల్ శెయ్యా త్తీమనత్తర్ తాముమ్) - ఉజ్జీవనో పాయ మఱిన్దవర్‌గళ్‌పక్కల్ శెన్ఱు. అవర్‌గళ్ ఇత్తై త్తజ్ఞళుక్కు ఉపదేశిక్కై క్కుఉఱుప్పాగ, ప్రణిపాతాభివాదనపరిప్రశ్న సేవారూపమాన శెఱిదలై చ్చెయ్యాదే, సజాతీయబుద్ధియాలే, అవర్‌గళ్ పక్కల్ దోషదర్శనమ్ పణ్ణియిరుక్కుమ్ దుష్టహృదయరానవర్‌గళ్ తాజ్ఞళుమ్.

(ఇఱై యురైయై త్తేఱాదవరుమ్) - సర్వేశ్వరన్ గీతోపనిషదాచార్యనాయ్ నిన్ఱు, సకలాత్మాక్కళుమ్ ఉజ్జీవిక్కైక్కుఉఱుప్పాగ అర్జునవ్యాజత్తాలే అరుళిచ్చెయ్‌ద చరమశ్లోకత్తిల్ అర్థత్తై విశ్వసియాదవర్‌గళుమ్,

**(తిరుమడన్దైనులగ త్తేఱార్)** - "తిరుమాల్ వైకున్దమ్" ఎన్గిఅపడియే శ్రియః పతియినుడైయ లోకమాన శ్రీవైకుంఠత్తిలేఱ ప్పెఱార్‌గళ్.

**(ఇడరప్పున్దువార్)**- సంసారదుఃఖమగ్నరాయ్ ప్పోరువర్‌గళ్- ఎన్గై. "అజ్ఞ శ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి, నాయం లోకోஉస్తి న పరో న సుఖం సంశయాత్మనః" ఎన్డు శ్రీగీతైయిల్ అవన్ అరుళిచ్చెయ్‌ద వచనమ్ ఇప్పాట్టిల్ శొన్న అర్థత్తుక్కు సంవాదమాగ అనుసంధేయమ్.

ఇరవైఏడవ పాశురం :- అవతారిక : ఉజ్జీవించడానికి తగిన ఉపాయాన్ని తెలియనివారు, దానిని ఉపదేశించినవారిపట్ల స్నేహ (అనుకూల) భావాన్ని లేనివారు, చరమశ్లోకాన్ని నమ్మనివారు పరమపదానికి పోకుండా, సంసార సాగరమనే దుఃఖంలో మునిగిపోతారు - అని అంటున్నారు.

వ్యాఖ్యానం : **(నెఱి యఱియాదారుమ్)** - సంసార జీవితంనుండి దాటించి మోక్షాన్ని పొందించే ఉపాయాన్ని తెలియనివారు. **"నెఱి"**- అనే పదం మార్గాన్ని తెల్పుతున్నదై, ఇక్కడ మోక్షానికి మార్గమైన ఉపాయాన్ని తెల్పుతున్నది.

**(అఱిన్దవర్‌పాల్ శెన్డు శెఱిదల్ శెయ్యాద తీమనత్తర్ తాముమ్)**- ఉజ్జీవించడానికి తగిన ఉపాయాన్ని తెలిసినవారి వద్దకు పోయి, వారు దానిని తమకు ఉపదేశించడానికి తగినట్లుగా నమస్కరించడం, అభివాదనం చేయడం, వినయంగా ప్రశ్నించడం మొదలైనవాటిరూపంలో కైంకర్యం చేయడం - మొదలైనవానిని చేసి, వారికి శిష్యులై ఉండకుండా, "వీరుకూడా మనవంటి వారేకదా!'' అని జ్ఞానుల విషయంలో దోషాన్ని ఉద్భావించే చెడ్డ మనస్సును కలవారు,

**(ఇఱై యురైయై త్తేఱాదవరుమ్)** - సర్వేశ్వరుడు మహాభారత సంగ్రామంలో భగవద్గీతను అర్జునునకు ఉపదేశించివాడై, అన్ని ఆత్మలు ఉజ్జీవించడంకోసం అర్జునుని వ్యాజంగా చేసికొని పల్కిన చరమశ్లోకంలోని అర్థంలో నమ్మకం లేనివారు.

**(తిరుమడన్దైకోన్ ఉలకత్తు ఏరార్)** - **"తిరుమాల్ వైకున్దమ్"** (తిరువాయ్ మొழி-10-7-8) అనే రీతిలో శ్రియఃపతియొక్క లోకమైన శ్రీవైకుంఠాన్ని చేరరు.



**(ఇడర్ అழுన్దువర్)** సంసారదుఃఖంలో మునిగిపోతారు- అని భావం.

"అజ్ఞ శ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి, నాయం లోకోஉస్తి న పరో న సుఖం సంశయాత్మనః" (గీత-4-40) (ఉపదేశం ద్వారా పొందదగిన ఆత్మజ్ఞానాన్ని లేనివాడు, (అజ్ఞానాన్ని వృద్ధిచేసే ఉపాయంలో శ్రద్ధ లేనివాడు, ఉపదేశాన్ని పొందినా, అందులో సందేహాన్ని పొందేవాడైన మానవుడు నశించిపోతాడు. సంశయాత్మకుడైన మానవునకు ఈ లోకంలో ఏ ప్రయోజనం సిద్ధించదు. పరలోకపురుషార్థమైన మోక్షం కూడా లభించదు) అని గీతలో శ్రీకృష్ణుడు పల్కిన సూక్తి ఈ పాశురానికి ప్రమాణంగా అనుసంధేయం.

**28. శరణాగతి మఱ్ఱోర్ శాదనత్తై ప్పఱ్ఱిల్,**
**అరణాగాదు అఞ్జనైతన్‌శేయై, - మురణழிய**
**క్కట్టియదు, వేఱోర్ కయిఱుకొణ్డార్‌ప్పదన్ మున్,**
**విట్ట పడైపోల్ విడుమ్.**

శరణాగతి = (మహా విశ్వాసాన్ని పురస్కరించుకొని చేయబడే శరణాగతి), మఱ్ఱు ఓర్ శాదనత్తై = వేఱొక ప్రయత్నంతో చేయబడే కర్మయోగం, జ్ఞానయోగం, మొదలైన ఉపాయాలలో ఒక ఉపాయాన్నే మోక్షసాధనంగా గ్రహిస్తే, అరణ్ ఆకాదు = తాను రక్షకం కాకుండా తొలగిపోతుంది, అఞ్జనైతన్ శేయై = అంజనాసుతుడైన హనుమానుని, మురణ్ అழிయ=అతని బలం నశించడం లోకం, కట్టియదు = రాక్షసులచే కట్టబడినదై, వేఱు ఓర్ కయిఱు కొణ్డు = (బ్రహ్మాస్త్రం చాలదు - అని భావంతో) వేఱొక జనుపనార దారంతో, ఆర్‌ప్పదన్ మున్ = కట్టడం ఆరంభించి నపుడే, విట్ట = విడచిపోయిన, పడైపోల్ = బ్రహ్మాస్త్రం వలె, విడుమ్ = (శరణాగతి) నిష్ఫలం అవుతుంది.

ఉపాయాంతరాలను ఆశ్రయించినట్లయితే మహావిశ్వాసరూపమైన ప్రపత్తి అనేది తాను రక్షకం కాబోదు. ఆంజనేయుని, అతని బలిమి సంకోచించేటట్లుగా కట్టిన బ్రహ్మాస్త్రం, వేఱు దారాలతో అతనిని కట్టాలని ప్రయత్నించినపుడే తన పట్టును వదలినట్లే, ప్రపత్తి కూడా తన ప్రభావాన్ని విడచిపెడుతుంది.

ఇరుపత్తెట్టామ్‌పాట్టు :- అవతారికై - కీழ్ ఇరణ్డు పాట్టాలే, పరమ పదత్తిలే పోమవర్గళ్ పడియైయుమ్, పోవాదవర్గళ్ పడియైయుమ్, అరుళిచ్చెయ్‌దార్, ఇని, ఇప్పాట్టిల్, పరమపదత్తిల్ పోమవర్గళుక్కు ఇప్పేఱ్ఱుక్కడియాగ చ్చొన్న శరణాగతియానదు, తన్నై అవలంబిత్తు నిఱ్కుమవన్, ఉపాయాంతరత్తిలే కైవైక్కిల్, తాన్ రక్షకమాగాదే, తన్నైక్కొణ్డు నழువుమ్బడియై సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (శరణాగతి) - "అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస పూర్వకమ్. తదేకో పాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః" ఎన్ఱుమ్, "అహ మస్మ్యపరాధానా మాలయోఽ కించనోఽ గతిః, త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే, మహావిశ్వాసపూర్వకమాగ అకించననాయ్, అనన్య గతియాన అధికారియాలే అనుష్ఠిక్కప్పడుమదాయ్, "ఆర్తానా మాశు ఫలదా" ఇత్యాదిప్పడియే అమోఘైయాయ్‌క్కొణ్డు. కార్యమ్ శెయ్యుమ్ శరణాగతి యానదు.

(మఱ్ఱోర్ శాదనత్తై ప్పఱ్ఱిల్)- తన్నోడు అన్వితనానచేతనన్, తన్ వైభవత్తై అఱిన్దు, ఇదువే నమక్కు రక్షకమెన్ఱు విశ్వసిత్తు నిఱ్కైయన్ఱిక్కే "ఇదుక్కు త్తుణైయాగ నాముమ్ శిల శెయ్‌వో" మెన్ఱు స్వయత్నరూపోపాయజ్గళిల్ ఒన్ఱై అవలంబిక్కిల్.

(అరణాగాదు)- తానివనుక్కు రక్షకమాగాదే ఇవనై విట్టుప్పోమ్. ఇదు తన్నై దృష్టాంత పూర్వకమాగ ఉపపాదిక్కిఱార్, మేల్.

(అఞ్జనైతన్ శేయై)- అఞ్జనైయినుడైయ పుత్రనాన తిరువడియై. శేయ్- పుత్రన్.

(మురణழియ క్కట్టియదు)- బల మழియుమ్బడియాగ క్కట్టినదు. మురణ్ - మిడుక్కు.

(వేఱోర్ కయిఱుకొణ్డార్‌ప్పదన్ మున్)- తన్ పక్కల్ దుర్బల బుద్ధిపణ్ణి. వేఱే ఒరు శణర్ కయిఱ్ఱై క్కొణ్డు కట్టువదఱ్కు మున్నే. "మున్నే" ఎన్ఱదు. కట్టుగైయిల్ ప్రవృత్తమానపోదే - ఎన్ఱపడి.



(విట్టపడైపోల్ విడుమ్)- మున్బవనై క్కట్టినదాయ్, వేఱే యొరు కయిఱ్ఱై క్కొణ్డు కట్టుగిఱవళవిలే, తాన్ విట్టుప్పోన బ్రహ్మాస్త్రమ్ పోలే, తన్నై ప్పఱ్ఱి నిఱ్ఱ ఇవన్ ఉపాయాంతరత్తిలే అన్వయిత్తపోదు, తాన్ ఇవనై విట్టుపోమెన్ఱై, "ప్రపత్తేః క్వచిదప్యేవం పరాపేక్షా న విద్యతే, సా హి సర్వత్ర సర్వేషాం సర్వకామఫలప్రదా, సకృదుచ్చారితా యేన తస్య సంసారనాశినీ, రాక్షసానా మవిస్రంభాదాఞ్జనేయస్య బంధనే, యథా విగళితా సద్య స్త్వమోఘాస్యాస్త్రబంధనా, తథా పుంసా మవిస్రంభా త్ప్రపత్తిః ప్రచ్యుతా భవేత్, తస్మాద్విస్రంభయుక్తానాం ముక్తిం దాస్యతి సాఽ చిరాత్" ఎన్ఱు ఇవ్వర్థన్దాన్ సనత్కుమారసంహితైయిలే శొల్లప్పట్టదిఱే.

ఇరవై ఎనిమిదవ పాశురం :- అవతారిక : గడచిన రెండు పాశురాల ద్వారా పరమపదానికి పోయేవారెవరు? పోనివారెవరు? అనే విషయాన్నిగూర్చి పలికారు. ఈ పాశురంలో, పరమపదానికి పోయేవారికి, దానికి కారణంగా చెప్పబడే శరణాగతి అనేది తనను ఆశ్రయించినవారు వేఱొక ఉపాయాన్ని ఆశ్రయిస్తే, తాను అతనిని రక్షించకుండా, తొలగిపోయే రీతిని సోదాహరణంగా పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (శరణాగతి) - "అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస పూర్వకమ్, తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తిః శరణాగతిః" (భరతముని- విష్వక్సేనసంహిత)- తన మనోరథం వేఱు ఏ ఉపాయాలవల్ల సిద్ధించినపుడు, గొప్ప విశ్వాసంతో భగవంతునే ఉపాయం కావాలని ప్రార్థించడం ప్రపత్తి. అదే శరణాగతి) అనే ప్రమాణంలోను, "అహమస్మి అపరాధానా మాలయోఽ కించనోఽ గతిః, త్వమేవోపాయ భూతో మే భవేతి ప్రార్థనామతిః, శరణాగతి రిత్యుక్తా సా దేవేఽ స్మిన్ ప్రయుజ్యతామ్" (అహిర్బుధ్న్య సంహిత-37-30,31) (నేను దోషాలకు నివాసస్థానమై ఉన్నాను. నన్ను రక్షించే ఏ ఉపాయం లేనివాడనై ఉన్నాను. నిన్ను తప్ప వేఱు గతిని లేనివాడనై ఉన్నాను. నీవే నాకు ఉపాయంగా కావాలి - అని ప్రార్థించే బుద్ధియే శరణాగతి అనబడుతున్నది. అది ఈ భగవంతుని విషయంలో చేయబడుగాక) అని గల ప్రమాణాలలో చెప్పబడినట్లుగా మహావిశ్వాసాన్ని కల్గి, అకించనుడై అనన్యగతియైన జీవునిచే అనుష్ఠింపబడేదై, "ఆర్తానాం మాశుఫలదా సకృదేవ కృతా హ్యసౌ, దృప్తానామపి

**జంతూనాం దేహాంతరనివారిణీ"** (పాంచరాత్రమ్)- (ఒకసారి అనుష్ఠింపబడిన ఈ ప్రపత్తి ఆర్తితో చేసినవారికి వెంటనే ఫలాన్ని ఇస్తుంది. దృప్తప్రపన్నులకు కూడా ఆ దేహావసానంలో వేఱొక దేహం (జన్మ) కలుగని రీతిలో చేస్తుంది) అనే విధంగా వ్యర్థం కాకుండా ఫలాన్ని కల్గించే శరణాగతి,

**(మఱ్ఱోర్ శాదనత్తై ప్పఱ్ఱిల్)** - పూర్వం పల్కిన రీతిలో "భగవంతుడే రక్షకం'' అనే భావనతో శరణాగతిని చేసేవాడు, దాని మహిమను తెలిసి, "ఇదే మనకు ఉపాయం'' (రక్షకం) అనే నమ్మికతో నిలువకుండా, "దానికి సహాయంగా మనం కూడా కొన్ని కార్యాలను చేస్తాము''- అని స్వప్రయత్న రూపాలైన ఉపాయాలలో దేనినైనా అనుష్ఠిస్తే, అపుడు ఆ శరణాగతి,

**(అరణాకాదు)** - అది ఇతనికి రక్షకం కాబోదు. అంతేకాక, అతనిని విడచి పోతుంది.

ఈవిషయాన్ని ఒక ఉదాహరణాన్ని చూపి వివరిస్తున్నారు.

**(అఞ్జనైతన్ శేయై)**- అంజనాదేవి సుతుడైన హనుమంతుని- అని అర్థం. **"శేయై"**- పుత్రుని.

**(మురణఴియ క్కట్టియదు)**- బలం నశించేటట్లు కట్టిన బ్రహ్మాస్త్రం. **"మురణ్"**- అనే పదం బలిమిని తెల్పుతుంది.

**(వేఱొర్ కయిఱుకొణ్డు ఆర్ప్పదన్ మున్)**- ఆ బ్రహ్మాస్త్రం "బలం లేనిది'' అని తలచి వేఱొక నారపగ్గాలతో కట్టడానికి ముందే- అని అర్థం. **"మున్నే"**- అనే పదం కట్టడం ఆరంభించినపుడే- అనే అర్థాన్నికల్గినది.

**(విట్ట పడైపోల్ విడుమ్)** - మొదట హనుమంతుని బంధించి, తరువాత "ఈ బంధం చాలదు'' అనే భావనతో రాక్షసులు నార పగ్గాలతో అతనిని కట్టడం ఆరంభించినపుడే, తాను విడచిపోయిన బ్రహ్మాస్త్రం వలె, శరణాగతిని రక్షకంగా తలచిన చేతనుడు, ఇంకొక ఉపాయాన్ని ఆశ్రయిస్తే, తాను (శరణాగతి) ఆ చేతనుని విడచిపెట్టిపోతుంది - అని తాత్పర్యం. **"ప్రపత్తేః క్వచిదప్యేవం పరాపేక్షా న విద్యతే, సా హి సర్వత్ర సర్వేషాం సర్వకామ ఫలప్రదా, సకృదుచ్చా**



**రితా యేన తస్య సంసారతారిణీ, రాక్షసానా మవిస్రంభాత్ ఆంజనేయస్య బంధనే, యథా విగళితా సద్య స్త్వమోఘోఽప్యస్త్ర బంధనా, తథా పుంసా మవిస్రంభాత్ ప్రపత్తిః ప్రచ్యుతా భవేత్, తస్మాత్ విస్రంభయుక్తానాం ముక్తిం దాస్యతి సాఽచిరాత్"** (సనత్కుమారసంహిత) - (ప్రపత్తి అనే ఉపాయం ఫలించడానికి భక్తి మొదలైన ఉపాయాలను వలె, వేఱు దేని సహాయం ఆవశ్యకం కాదు. ఆ ప్రపత్తి అనే ఉపాయమే అందఱికి సర్వత్ర అన్ని అభీష్టాలను ఇస్తున్నది కదా! ఎవడు, ఒక పర్యాయం ఈ ఉపాయాన్ని అనుష్ఠిస్తున్నాడో, అతనికి అది సంసారసంబంధాన్ని లేకుండా చేస్తుంది. అమోఘమైన (వ్యర్థం కాని) బ్రహ్మాస్త్రబంధనం ఆంజనేయుని బంధించడానికి సరిపోయినది- అనే నమ్మిక రాక్షసులకు లేనందున, వారు నారపగ్గాలతో అతనిని కట్టగానే, వెంటనే ఆ అస్త్రబధనం ఆంజనేయుని వీడిపోయినట్లుగా, "భగవానుడు రక్షకుడు'' అనే నమ్మిక ప్రపత్తిచేసే చేతనులకు లేకపోతే, వారు చేసే ప్రపత్తి తొలగిపోతుంది. (వ్యర్థమై పోతుంది) అందువల్ల నమ్మికను కలవారికి ప్రపత్తి శీఘ్రంగానే మోక్షాన్ని ఇస్తుంది) అని ఈ అర్థం పాంచరాత్ర సంహితలో ఒకటైన సనత్కుమార సంహితలో చెప్పబడింది కదా!

**29. మన్దిరము మీన్ద గురువుమ్, మన్దిరత్తాల్**
**శిన్దనై శెయ్‌గిన్ఱ తిరుమాలుమ్, - నన్దలిలాదు**
**ఎన్ఱు మరుళ్ పురివర్ యావర్ అవరిడరై,**
**వెన్ఱు కడిదడైవర్ వీడు**

మన్దిరముమ్ = అష్టాక్షరీమంత్రం, ఈన్ద గురువుమ్ = దానిని ఉదేశించిన ఆచార్యుడు, అమ్మన్దిరత్తాల్ = ఆ మంత్రంచే, శిన్దనై శెయ్ నిన్ఱ = అనుసంధింపబడే, తిరు మాలుమ్ = శ్రియఃపతి, నన్దల్ ఇలాదు = నిరంతరంగా, ఎన్ఱుమ్ = అన్ని కాలాల లోను, అరుళ్ పురివార్ = ఎవరికి అనుగ్రహిస్తారో, అవర్ = వారే, ఇడరై = సంసారమనే దుఃఖాన్ని, వెన్ఱు = జయించి, కడిదు = శీఘ్రంగా, వీడు అడైవర్ = పరమపదాన్ని పొందుతారు.

అష్టాక్షరీమహామంత్రం, ఆ మంత్రాన్ని ఉపదేశించే ఆచార్యుడు, ఆ తిరుమంత్రం ద్వారా ధ్యానింపబడే శ్రియఃపతి విచ్ఛేదం లేకుండా ఎల్లప్పుడు అనుగ్రహించే రీతిలో ఎవరు ఉంటారో, అటువంటివారు సాంసారికదుఃఖాలను పోగొట్టుకొని శీఘ్రంగా మోక్షాన్ని పొందగలరు.

ఇరుపత్తొన్బదామ్‌పాట్టు :- అవతారికై - మంత్ర- గురు- దేవతైగళ్ మూన్ఱినుడైయవుమ్, ప్రసాదత్తుక్కు సర్వకాలముమ్ విషయమాయ్ప్పోరుమవర్‌గళ్, సంసార దుఃఖత్తై వెన్ఱు, శడక్కెన మోక్షత్తై ప్పెఱువర్- ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (మన్దిరముమ్) - "మంతారం త్రాయత ఇతి మంత్రః" ఎన్గిఱపడియే అనుసంధాతావుక్కు రక్షకమాన తిరుమంత్రముమ్.

(ఈన్ద గురువుమ్)- మంత్రప్రదనాన ఆచార్యనుమ్.

(అమ్మన్దిరత్తాల్ శిన్దనై శెయ్‌గిన్ఱ తిరుమాలుమ్)- అన్ద మంత్రప్రతిపాద్యనాయ్ అత్తాలే అనుసంధిక్కప్పడుగిఱ శ్రియఃపతియుమ్.

(నన్దలిలాదు)- నన్దుదలిన్ఱిక్కే. అదావదు, నన్దుదల్- కేడాయ్, అదిల్లై ఎన్ఱైయాలే విచ్ఛేదమన్ఱిక్కే- ఎన్ఱై.

(ఎన్ఱుమరుళ్ పురివర్ యావర్)- సర్వకాలముమ్ ప్రసాదత్తై ప్పణ్ణుగైక్కు విషయభూతరాయిరుక్కుమవర్‌గళ్ యావర్ శిలర్.

(అవరిడరై వెన్ఱు కడిదడైవర్ వీడు)- అదావదు- అవర్‌గళ్ సాంసారికమాన దుఃఖజ్గళైయుమ్ జయిత్తు, శీఘ్రమాగ పమపురుషార్థ లక్షణమోక్షత్తై ప్రాప్తిప్పర్‌గళ్- ఎన్ఱై. "దేవతాయా గురో శ్చైవ మంత్రస్యైవ ప్రసాదతః, ఐహికాముష్మికా సిద్ధి ర్ద్విజస్య స్యాన్న సంశయః" ఎన్ఱు పురాణసార సముచ్చయత్తిల్ మూలమంత్ర మాహాత్మ్యత్తిల్ శొన్న వచనమ్ ఇదుక్కు ప్రమాణమాగ అనుసంధేయమ్. "మంత్రే తద్దేవతాయాం చ తథా మంత్రప్రదే గురౌ, త్రిషు భక్తి స్సదా కార్యా సా హి ప్రథమసాధనమ్" ఎన్నక్కడవదిత్తే.

ఇరవై తొమ్మిదవ పాశురం :- అవతారిక : మంత్రం, దానిని ఉపదేశించిన ఆచార్యులు, దానికి అర్థమైన లక్ష్మీవల్లభుడు ఎవరి విషయంలో సదా



అనుగ్రహిస్తున్నారో, వారు (అచేతనులు) సంసారదుఃఖాన్ని జయించి, వేగంగా మోక్షాన్ని పొందుతారు - అని ఈ పాశురంలో అంటున్నారు.

వ్యాఖ్యానం :- (మన్దిరముమ్) - "మంతారం త్రాయత ఇతి మంత్రః" అనే మంత్రశబ్దవ్యుత్పత్తి ప్రకారం తనను మననం చేసేవానిని కాపాడేది- అనే కారణం వల్ల మంత్రమనబడుతున్నది. అనుసంధించేవానికి రక్షకమైన తిరుమంత్రం- అని అర్థం.

(ఈన్ద గురువుమ్)- ఆ మంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడు-అని అర్థం.

(అమ్మన్దిరత్తాల్ శిన్దనై శెయ్‌కిన్ఱ తిరుమాలుమ్)- ఆ తిరుమంత్రం ద్వారా చెప్పబడేవాడై, దానివల్ల అనుసంధింపబడేవాడైన శ్రియఃపతి- అని అర్థం.

(నన్దలిలాదు) - అంతరాయం లేకుండా నిరంతరంగా - అని అర్థం. "నన్దుదల్" అనే పదం అంతరాయాన్ని తెల్పుతున్నందున, ప్రకృతంలో- "ఏ అడ్డు లేకుండా" అనే అర్థం చెప్పబడుతున్నది.

(ఎన్ఱుమ్ అరుళ్ పురివర్ యావర్) - అన్ని కాలాలలోను అనుగ్రహించడానికి లక్ష్యమై ఉండేవారెవరో,

(అవర్ ఇడరై వెన్ఱు కడితడైవర్ వీడు) - దీని తాత్పర్యమేమంటే - వారు ఈ లోకంలో కలిగే అన్ని దుఃఖాలను జయించి, త్వరగానే గొప్ప పురుషార్థమైన మోక్షాన్ని పొందుతారు - అని. "దేవతాయాః గురో శ్చైవ మంత్రస్యైవ ప్రసాదతః, ఐహికాముష్మికా సిద్ధిః ద్విజస్యాస్తి న సంశయః". (పురాణసారసముచ్చయం- మూలమంత్రమాహాత్మ్యమ్) -(అనుసంధింపబడే తిరుమంత్రం, ఆ మంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడు, ఆ మంత్రం ద్వారా అనుసంధింపబడే శ్రీమన్నారాయణుడు - అనే వీరి అనుగ్రహం వల్ల బ్రాహ్మణునకు ఇహలోక - పరలోక సిద్ధులు అన్నీ కల్గుతాయి. ఇందులో ఏ సందేహం లేదు) అని పురాణ సారసముచ్చయంలోని మూలమంత్రమాహాత్మ్యంలో చెప్పబడిన వచనం దీనికి ప్రమాణంగా అనుసంధేయం. "మంత్రే తద్దేవతాయాం చ తథా మంత్రప్రదే గురౌ, త్రిషు భక్తి స్సదా కార్యా సా హి ప్రథమసాధనమ్" (విష్ణుతత్త్వమ్)-

(మంత్రం, ఆ మంత్రంచే ప్రతిపాదింపబడే దేవత, ఆ విధంగానే, మంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడు- అనే ఈ ముగ్గురి విషయంలో భక్తిని కల్గి ఉండాలి. ఆ భక్తియే కదా భగవత్ ప్రాప్తికి మొదటి సాధనం) అని చెప్పబడింది కదా!

**30. మాడుమ్ మనైయుమ్ కిళైయుమ్ మఱైమునివర్,**
**తేడుముయర్ వీడుమ్ శెన్నెఱియుమ్, - పీడుడైయ**
**ఎట్టెழుత్తుమ్ తన్దవనే ఎన్ఱిరాదారుఱవై,**
**విట్టిడుగై కణ్డీర్ విది.**

మాడుమ్ = పశువులు, మనైయుమ్ = గృహాలు, కిళైయుమ్ = కలసిజీవించే బంధువులు, మఱై మునివర్ = తేడుమ్ = వైదికులైన మునులచే ఆదరింపబడి అన్వేషింపబడే, ఉయర్ వీడుమ్ = గొప్ప మోక్షం, శెమ్ నెఱియుమ్ = ఆ మోక్షాన్ని పొందించే అర్చిరాది మార్గం, పీడుడైయ = (సంసారాన్ని దాటించే) మహిమను కల, ఎట్టు ఎழుత్తుమ్ తన్దవనే = అష్టాక్షరిని ఉపదేశించిన ఆచార్యుడే, ఎన్ఱు ఇరాదార్ = అని తలచి ఉండనివారి, ఉఱవై = సంబంధాన్ని, విట్టిడుకై = చేయి విడువడమే, విది కణ్డీర్ = ఆవశ్యకమైనదని తెలియండి.

పశువులు, గృహం, బంధువులు, వైదికులైన మునులు, ఆశపడి అన్వేషించే గొప్ప మోక్షం, ఆ మోక్షాన్ని పొందించే ఋజువైన మార్గం – అనే ఇవి అన్నీ మిక్కిలి గొప్పతనాన్ని కల్గిన తిరుమంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడే – అనే నిశ్చయం లేనివారితో సంబంధాన్ని తెగతెంపులు చేసికోవడమే శాస్త్రంలోని సిద్ధాంతం.

ముప్పదామ్‌పాట్టు :- అవతారికై - తనక్కపేక్షితమాన ఐహికాముష్మిక సకలవస్తుక్కళుమ్, తిరువష్టాక్షర ప్రదనాన ఆచార్యనే - ఎన్ఱు ఇరాదవర్‌గళోడుళ్ళ సంబంధత్తై విడుగై శాస్త్రవిహితమ్ - ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (మాడుమ్)- తనక్కు భోగ్యమాన క్షీరాదిగళై యుణ్డాక్కుమవై - ఎన్ఱాన్ఱు ఆదరిక్కప్పడుమ్ పశుక్కళుమ్.

(మనైయుమ్)- భోగస్థానమాన గృహముమ్.



(కిళైయుమ్)- తజ్గళోట్టై కలవిదానే భోగమామ్బడి యిరుక్కుమ్ బంధుక్కళుమ్. ఇవై మఱ్ఱుమ్ ఐహికమాన భోగ్యవస్తుక్కళుక్కెల్లా ముప లక్షణమ్.

(మఱైమునివర్ తేడు ముయర్ వీడుమ్)- వైదికరాయ్, భగవన్మననశీలరా యిరుక్కుమవర్‌గళ్. ప్రాప్య మెన్ఱు విరుమ్బి త్తేడప్పడుమదాయ్. కైవల్యమోక్షమ్ పోలన్ఱిక్కే. ఉత్కృష్టమాన మోక్షముమ్.

(శెన్నెఱియుమ్) - అన్ద మోక్షత్తై ప్రాప్పిక్కైక్కుడలాగప్పోదు మర్చిరాది మార్గముమ్. అన్ఱిక్కే, శెన్నెఱి - యెన్ఱు అన్ద మోక్షత్తై ప్రాపిక్కైక్కు ఉఱుప్పాన ఉపాయత్తై చ్చొల్లవుమామ్.

(పీడుడైయ ఎట్టెழుత్తుమ్ తన్దవనే యెన్ఱిరాదారుఱవై)- కీழ్ ఉక్తమానవై ఎల్లామ్. సంసారవర్ధకజ్గళుమాయ్, క్షుద్రజ్గళుమాన మంత్రాంతరజ్గళ్ పోలన్ఱిక్కే, సంసారనివర్తకమాగైయాలే వన్ద పెరుమైయైయుడైయ తిరువష్టాక్షరత్తై త్తన్దరుళిన అచార్యనే- ఎన్ఱిరాదవర్‌గళోడుణ్డాన సంబంధత్తై.

(విట్టిడుగై కణ్డీర్ విది) -విడుగై యావదు - శాస్త్రవిహితజ్గాణుజ్గోళ్- ఎన్ఱై. ఇత్తాల్ - అవర్‌గళోట్టై సంబంధమ్, అవశ్యమ్ విడవేణుమెన్ఱదాయిఱ్ఱు. "ఐహికా ముష్మికం సర్వం గురు రష్టాక్షరప్రదః, ఇత్యేవం యే న మన్యన్తే త్యక్తవ్యా స్తే మనీషిభిః" ఎన్నక్కడవదిఱే.

ముప్పైయవ పాశురం :- అవతారిక : "తాము కోరే ఇహలోక - పరలోక ఫలాలు అన్నీ అష్టాక్షరిని ఉపదేశించిన ఆచార్యుడే"- అని భావించనివారి సంబంధాన్ని త్యజించాలనేదే శాస్త్రసిద్ధం- అని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (మాడుమ్) - తనకు తీయని (భోగ్యమైన) పాలు, పెరుగు మొదలైనవానిని ఇచ్చేవి - అని ఆదరింపబడే పశువులు.

(మనైయుమ్) - తమతో కలసి ఉండడమే భోగ్యమైనది - అని భావించదగిన బంధువులు. ఈ రెండిటిని పల్కడం ఈ లోకంలో ఉండే భోగ్యవస్తువులన్నిటికి ఉపలక్షణం.

**(మత్రై మునివర్ తేడుమ్ ఉయిర్ వీడుమ్ శెన్నెఱియుమ్)**- వేదాధ్యయనాన్ని చేసేవారై, భగవానుని తిరునామసంకీర్తనం చేయడమే స్వభావంగా కల్గినదై, ఇదే పొందదగినది - అని అందఱిచే ఆశపడి అన్వేషింపబడేదై, కైవల్య మోక్షంవంటిది కాకుండా, గొప్పదైన మోక్షం.

**(శెన్నెఱియుమ్)** - ఆ మోక్షాన్ని కల్గించే మార్గమై ఉండే అర్చిరాదిమార్గం- అని అర్థం. లేక, **"శెన్నెఱి"** - అనేది ఈ మోక్షాన్ని పొందడానికి దారి అయిన శరణాగతి- అనే ఉపాయాన్ని తెల్పుతున్నది- అని కూడా చెప్పవచ్చు.

**(పీడుడై ఎట్టెழుత్తుమ్ తన్దవనే ఎన్ఱిరాదార్ ఉఱవై)** - సంసారజీవితాన్ని వృద్ధిపొందిచేవై, చాలా తక్కువ అయిన అన్యమంత్రాలవలె కాకుండా సంసార జీవితాన్ని పోగొట్టేది అయినందున కల్గిన గొప్పతనాన్ని కల తిరుమంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడే, పూర్వం ప్రస్తావించిన పశువులు, భార్యాది బంధువులు- అని భావించనివారితో సంబంధాన్ని,

**(విట్టిడుకై కణ్డోర్ విది)**- విడిచిపెట్టడం- అనేది శాస్త్రంచే విధింపబడినది కదా! దీనివల్ల వారితో ఉండే సంబంధం తప్పక విడువదగినది- అని భావం. **"ఐహికాముష్మికం సర్వం గురు రష్టాక్షరప్రదః, ఇత్యేవం యే న మన్యంతే త్యక్తవ్యా స్తే మనీషిణః"** (అష్టాక్షరీమహామంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుడే- పశువులు, భార్యాది బంధువులు మొదలైన ఐహికఫలాలు, మోక్షం, దానికి ఉపాయంగా చెప్పబడే ఉపాయం మొదలైన ఆముష్మికఫలాలు అన్నీ - అని ఎవరు భావించరో, వారు జ్ఞానులచేత విడువదగినవారు - అని చెప్పబడింది కదా!

**31. వేదమొరు నాన్గిన్ ఉట్పొదిన్ద మెయ్ప్పొరుళుమ్,**
**కోదిల్ మనుముదల్ నూల్ కూఱువదుమ్, - తీదిల్**
**శరణాగతి తన్ద తన్నిఱైవన్ తాన్**
**అరణాగుమెన్ను మదు.**

తీదు ఇల్ = దోషం లేని, శరణాగతి = శరణాగతిని, తన్ద = తనకు ఉపదేశించిన, తన్ ఇఱైవన్ = తన ఆచార్యుని, తాళే = శ్రీచరణాలే, అరణ్ ఆకుమ్ ఎన్నుమదు= రక్షకం అవుతుంది - అనే విషయం, ఒరు నాన్గు వేదమ్ = సాటి లేని నాల్గు వేదాలను, ఉళ్ పొదిన్ద = లోపల ఇముడ్చుకొన్న, మెయ్ పొరుళ్= యథార్థమైన అర్థం, (అంతేకాక) కోదు ఇల్ = దోషం లేని, మను ముదల్ నూల్= మనుపు మొదలైన అన్ని స్మృతులు, కూఱువదుమ్ = పలికే అర్థంకూడా ఇదే.



నాల్గు వేదాలలోను బోధింపబడ్డ పరమార్థం, దోషరహితమైన మనుస్మృతి మొదలైన గ్రంథాలు తెలిపే అర్థం ఏది? అంటే – ఏ దోషం లేని శరణాగతిని తెలిపే ద్వయమంత్రాన్ని తనకు ఉపదేశించిన ఆచార్యుని శ్రీచరణాలే శరణం (రక్షకం) – అనే అర్థమే.

ముప్పత్తొన్ఱామ్పాట్టు :- అవతారికై - సకలవేదాంతర్గతమాన పరమార్థముమ్, తదుప బృంహణంగళాన శాస్త్రజ్గళ్ శొల్లుమదువుమ్, శరణాగతిప్రదనాన స్వాచార్యన్ తిరువడిగళే రక్షక మెన్నుమదు - ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- **(వేదమొరు నాన్గినుట్పొదిన్ద మెయ్ ప్పొరుళుమ్)** - అపౌరుషేయమాయ్, నిత్యనిర్దోషమాయ్, ఆప్తతమమాయిరుక్కైయాలే అద్వితీయమాయ్, ఋగాది భేదత్తాలే చతుర్విధమాన వేదత్తినుళ్ళే ఎట్టుమ్బుడియు మిట్టు కట్టివైక్కుమాప్పోలే శేమిత్తు వైత్త పరమార్థముమ్. ఇత్తాల్- వేదమెన్దైయాలే, ఇవ్వర్థప్రతిపాదకమాన ప్రమాణత్తినుడైయ గౌరవముమ్, నాన్గిన్ - ఎన్దైయాలే, అదుతన్నిల్ ఏజ్గేనుమొరు ప్రదేశత్తిల్ ప్రతిపాదిక్కప్పడువదన్ఱిక్కే, అనేకశాఖారూపమానవదుక్కెల్లామ్ తాత్పర్య మిదు - ఎన్నుమిడముమ్, ఉట్పొదిన్ద - ఎన్దైయాలే, అదుదాన్, మేలెழ చ్చొల్లిప్పోరుమదన్ఱిక్కే ఉళ్ళే శేమిత్తువైక్కప్పట్టదు- ఎన్నుమిడముమ్, మెయ్ ప్పొరుళ్- ఎన్దైయాలే, అదుదాన్ అర్థవాదరూపవాదమానదన్ఱిక్కే, తత్వరూపమాన అర్థమెన్ను మిడముమ్ శొల్లిఱ్ఱాయిఱ్ఱు.

**(కోదిల్ మనుముదల్ నూల్ కూఱువదుమ్)** - కోదిల్లాద మన్వాది శాస్త్రజ్గళ్ శొల్లువదుమ్. కోదిల్లామైయావదు - కుఱ్ఱమిల్లామై. అదావదు- అయథార్థ ప్రతిపాదకమాగిఱ దోషమిల్లామై. ఇదు మనువుక్కు విశేషణమాదల్,ఎల్లాత్తుక్కుమ్ విశేషణమాదల్, మనువుక్కు విశేషణమానపోదు, "యద్వై కించ మనురవదత్త

ద్భేషజమ్" ఎన్నుమ్, "మన్వర్థవిపరీతా తు యా స్మృతి స్సా న శస్యతే" ఎన్నుమ్ శొల్లుమ్బడియాన అదినుడైయ ప్రామాణ్యగౌరవమ్ శొల్లుగిఱదు. ఎల్లాత్తుక్కుమ్ విశేషణమానపోదు, అవర్ర్రినుడైయ అప్తతమత్వమ్ శొల్లుగిఱదు. మనుముదల్ నూల్గళావన - మర్ర్రు ముణ్డాన సాత్త్వికస్మృతిగళుమ్, ఇతిహాసపురాణజ్గళుమ్, పాఞ్చరాత్రాదిగళుమాగిఱ శాస్త్రజ్గళ్. కూఱుగైయావదు - ఇవై యెల్లా మేకకంఠమాగ వేదహృదయమాన అన్ద అర్థత్తై చ్చొల్లుగై. వేదార్థత్తై విశదీకరిక్కై యితే ఇవర్ర్రుక్కు కృత్యమ్.

(తీదిల్ శరణాగతి తన్ద)- తీదిల్లాద శరణాగతియై ఉపకరిత్తు. అదావదు- అధికృతాధికారత్వముమ్, అపాయబహుళత్వముమ్, అప్రాప్తత్వముమాగిఱ దోషమిన్రిక్కే యిరుక్కిఱ శరణాగతియై, దరిద్రనుక్కు చ్చీరియ నిధియై క్కొడుక్కుమాప్పోలే ఉపకరిత్త-ఎన్గై.

"పీడుడైయ ఎట్టెழுత్తుమ్ తన్దవనే" ఎన్నార్ కీழ். ఇజ్గే శరణాగతి తన్దవన్- ఎన్నార్. కీழదుపోలుమన్రితే ఇదు. నమ్మాచార్యర్గళ్ మర్ర్ర రహస్యజ్గళిరణ్డిలుమ్ అర్థత్తై మఱైత్తు శబ్దత్తై వెళియిట్టుక్కొణ్డు పోరువర్గళ్. ఇదిల్ అర్థమ్బోలే శబ్దత్తై యుమ్ మఱైప్పార్గళెన్నుమ్బడి యిరుప్పదొన్రాగైయాలే. దివ్యమంగళ విగ్రహముమ్, విగ్రహగుణజ్గళుమ్, దివ్యాత్మస్వరూపజ్గళుమ్, స్వరూపగుణజ్గళుమ్, నిత్య ముక్తరుక్కు ప్రాప్యమాయిరుక్కుమాపోలే, ముముక్షువాయ్, ప్రపన్ననాన అధి కారిక్కు ద్వయశరీరమే ప్రాప్యమా యిరుక్కుమెన్రితే నఞ్జీయర్ అరుళిచ్చెయ్ దదు. ఇప్పడి యిరుక్కిఱవర్ర్రైయితే ఇవనుక్కు ఉపకరిత్తదు.

(తన్నిత్తైవన్)- తన్నుడైయ ఆచార్యన్. ఇత్తైవనెన్దదు - శేషి- ఎన్దపడి తన్నిత్తైవన్- ఎన్గైయాలే, సర్వసాధారణశేషియాన ఈశ్వరనైప్పోలన్రిక్కే తనక్కు అసాధారణ శేషియానవన్ -ఎన్గై.

(తాళే)- అవనుడైయ తిరువడిగళే. ప్రథమపర్వత్తోపాది చరమపర్వత్తిలుమ్ తిరువడిగళేయితే ఉద్దేశ్యమ్. అవధారణత్తాలే అదినుడైయ సహాయాంతర నైరపేక్ష్యమ్ శొల్లుగిఱదు.



(అరణాగుమెన్నుమదు)- రక్షకమామెన్గిఱ అర్థ మెన్గై. అరణావదు- రక్షకమ్. తన్నిత్తైవ నెన్నుమ్, తాళే యరణాగు మెన్నుమ్ శేషిత్వశరణ్యత్వజ్గళై చ్చొల్లుగైయాలే, ప్రాప్యత్వమర్థాత్సిద్ధమితే. "గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరా గతిః, గురురేవ పరా విద్యా గురురేవ పరం ధనమ్, గురురేవ పరః కామో గురురేవ పరాయణమ్, యస్మాత్తదుపదేష్టాసౌ తస్మాద్గురుతరో గురుః, అర్చనీయశ్చ వంద్యశ్చ కీర్తనీయశ్చ సర్వదా, ధ్యాయేజ్జపేన్నమేద్భక్త్యా భజే దభ్యర్చయేన్మదా, ఉపాయోపేయభావేన తమేవ శరణమ్ వ్రజేత్, ఇతి సర్వేషు వేదేషు సర్వశాస్త్రేషు సమ్మతమ్, ఏవం ద్వయోపదేష్టారం భావయేద్బుద్ధిమాన్ ధియా" ఎన్ఱు శ్రీసాత్త్వికతంత్రత్తిలే ద్వయప్రసంగత్తిలే తదుపదేష్టావాన ఆచార్యనుడైయ వైభవమ్ భగవానాలే అరుళిచ్చెయ్యప్పట్టదితే.

ముప్పైఒకటవ పాశురం :- అవతారిక : అన్ని వేదాల లోపల ఉండే యథార్థమైనది, దానిని వివరించడం కోసం ప్రవర్తించిన ఇతిహాస - పురాణాదులైన శాస్త్రాలు తెలిపేది ఏమంటే- "శరణాగతిని ఉపదేశించిన తన ఆచార్యుని శ్రీచరణాలే రక్షకం'' అనేదే - అని ఈ పాశురంలో అంటున్నారు.

వ్యాఖ్యానం :- (వేదమ్ ఒరు నాన్గిన్ ఉట్పొదిన్ద మెయ్ప్పొరుళుమ్)- ఎవరిచేత రచింపబడనివై, నిత్యంగా ఉండేవై, దోషం లేనివై, మిక్కిలి నమ్మదగినవి అయినందువల్ల సాటి లేనివై, ఋగ్వేద-యజుర్వేద-సామవేద-అధర్వణవేదాలనే నాల్గు విధాలైన వేదాల లోపల, ధాన్యపు గింజను పైన ఉండే ఎనిమిది పొరలు ఆవరించి దాచి ఉంచేటట్లుగా, రక్షింపబడుతూ ఉండే వాస్తవమైన అర్థం- అని భావం. ఈ ప్రయోగంలో "వేదమ్" అని అన్నందున ఈ అర్థాన్ని పలికే ప్రమాణంయొక్క గొప్పతనం, "నాన్గిన్" అని అన్నందున ఆ వేదంలో ఏదో ఒక చోట చెప్పబడేదిగా కాకుండా, పలు శాఖలు కల అన్ని వేదాల లోపల ఉండి అర్థం ఇది - అనేది, "ఉట్పొదిన్ద" అని అన్నందున అదికూడా పైన బహిరంగంగా పలుకకుండా, లోపల రక్షింపబడి ఉన్నది - అనేది, "మెయ్ప్పొరుళ్" అని అన్నందున ఇదికూడా పొగడ్తగా చెప్పబడినదిగా కాకుండా, వాస్తవమైన అర్థం- అనేది చెప్పబడ్డాయి.

**(కోదిల్ మనుముదల్ నూల్ కూఱువదుమ్)**- దోషం లేని మనుస్మృతి మొదలైన శాస్త్రాలలో చెప్పబడేది- అని అర్థం. **"కోదిల్"**- అంటే దోషం లేకుండా ఉండడం. అది ఏమంటే- అసత్యమైన అర్థాన్ని తెలుపడం- అనే దోషం లేక పోవడం. ఇది "మను" అనే పదానికి మాత్రం విశేషణంగానో, లేక, మనుధర్మశాస్త్రం మొదలైన సమస్తశాస్త్రాలకు విశేషణంగానో అన్వయించవచ్చు. మనుధర్మశాస్త్రానికి మాత్రం విశేషంగా గ్రహించినపుడు, **"యద్వై మనురవదత్ తద్భేషజమ్"** (యజుర్వేదం) - (మనువు చెప్పినది అంతా ఔషధం) అని, **"మన్వర్థవిపరీతా తు యా స్మృతిః సా న శస్యతే"** (మనుస్మృతి పల్కిన అర్థానికి విరుద్ధంగా వేఱొక స్మృతి పల్కితే, అది ప్రశంసింపబడడం లేదు) అని చెప్పబడినట్లుగా ఆ మనుస్మృతి గొప్ప ప్రమాణమని చెప్పబడినది. ఆ మనుస్మృతి మొదలైన అన్ని శాస్త్రాలకు విశేషణంగా చేసినపుడు- అవి అన్నీ మొత్తం నమ్మదగినవి- అని చెప్పబడుతున్నవి. మనుధర్మశాస్త్రం మొదలైన శాస్త్రాలు- అని చెప్పబడేవి ఏవి ? అంటే, మనుస్మృతియే కాక, మిగిలిన సాత్త్విక స్మృతులు, ఇతిహాసపురాణాలు, పాంచరాత్రం- వైఖానసం- అనే ఆగమరూపశాస్త్రాలు. **"కూఱుకై"** -అంటే- అవి అన్నీ ఏకకంఠంగా వేదంలోని సారమైన ఆ అర్థాన్ని తెలుపడం. ఉపబృంహణాలని చెప్పబడే ఈ శాస్త్రాలు వేదంలో చెప్పబడ్డ అర్థాలను స్పష్టం చేసేవి కదా!

**(తీతిల్ శరణాగతి తన్ద)** - ఏ దోషం లేని శరణాగతిని ఉపదేశించిన- అని అర్థం. అంటే- ఉపాయాంతరాల వలె (బాహ్మణ-క్షత్రియ-వైశ్యులనే) మూడు వర్ణాలకు మాత్రమే అనుష్ఠించడానికి తగినవై ఉండడం, పలు ఆటంకాలు కలిగే అవకాశం ఉండడం, చేతనుని భగవచ్ఛేషత్వ స్వరూపానికి తగని స్వప్రయత్నమై ఉండడం- అనే దోషాలు లేకుండా ఉండే శరణాగతిని, దరిద్రునకు గొప్ప నిధిని ఇచ్చినట్లుగా, ఉపదేశించిన-అని అర్థం.

**"పీడుడైయ ఎట్టెழுత్తుమ్ తన్దవనే"** అని అన్నారు, 30వ పాశురంలో. ఇక్కడ, శరణాగతిని అనుగ్రహించినవారు **"శరణాగతి తన్దవన్"** అని అన్నారు. అష్టాక్షరివంటిదికాదుకదా ద్వయం. రహస్యత్రయంలో అష్టాక్షరిలోను, చరమ శ్లోకంలోను అర్థాన్ని మఱుగుపరచి, శబ్దాన్ని వ్యక్తం చేశారు, మన పూర్వాచార్యులు.



ఈ ద్వయంలో అర్థాన్ని వలె, శబ్దాన్నికూడా మఱుగుపరచారు- అనే గొప్పతనాన్ని కల్గినది కనుక, పరమపదంలో ఉండే దివ్యమంగళ విగ్రహం, ఆ దివ్యవిగ్రహం యొక్క గుణాలు, భగవంతుని ఆత్మస్వరూపం, స్వరూపానికి చెందిన గుణాలు- అన్నీ పరమపదంలోని నిత్యులకు, ముక్తులకు అనుభావ్యాలు అయినట్లే, మోక్షాన్ని కోరే ప్రపన్నుడైన అధికారికి ద్వయంయొక్క శబ్దస్వరూపమే అనుభావ్యమై ఉంటుంది- అని కదా నంజీయర్ అన్నారు. ఈ రీతిలో ఉండే (ద్వయ) మంత్రాన్ని కదా, ఆచార్యుడు శిష్యునకు ఉపదేశిస్తాడు.

**(తన్ ఇఱైవన్)**- తన ఆచార్యుడు- అని అర్థం. **"ఇఱైవన్"** అంటే- శేషి. కైంకర్యాన్ని స్వీకరించేవాడని అర్థం. **"తన్ ఇఱైవన్"** అని అన్నందున అందఱికి చెందిన (సాధారణుడైన) సర్వేశ్వరునివలె కాకుండా, తనకే చెందిన శేషియై (నాయకుడై) ఉండేవాడని భావం.

**(తాళే)** - అటువంటి వాని శ్రీచరణాలే -అని అర్థం. ప్రథమపర్వమైన భగవంతుని విషయంలోవలె. చరమపర్వరూపమైన అతని భక్తులైన ఆచార్యుల విషయంలోను శ్రీచరణాలే కదా ఆశ్రయింపబడుతున్నాయి. **"తాళే"**- అనే ప్రయోగంలోని "ఏవ" కారంతో ఆ శ్రీచరణాలు వేఱు ఏ సహాయాన్ని ఎదురుచూచేవి కావు- అని చెప్పబడుతున్నది.

**(అరణాకుమ్ ఎన్నుమదు)**- రక్షకమవుతుంది- అని భావం. **"అరణ్"** అంటే -రక్షించేది. **"తన్ ఇఱైవన్"** అని అంటూ ఆచార్యుని తెల్పినందున, అతడే కైంకర్యాన్ని పరిగ్రహించేవాడు- అని తెలుస్తున్నది. **"తాళే అరణాకుమ్"** అని అన్నందున అతడే శరణు పొందదగినవాడు- అని తెలుస్తున్నది. ఈ రెండిటి ద్వారా- అతడే పొందదగిన ప్రాప్యభూతుడు- అని వ్యక్తమవుతుందికదా!

"గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరా గతిః, గురురేవ పరా విద్యా గురురేవ పరం ధనమ్, గురురేవ పరః కామో గురురేవ పరాయణమ్, యస్మాత్తదుపదేష్టాసౌ తస్మాద్గురుతరో గురుః, అర్చనీయశ్చ వంద్యశ్చ కీర్తనీయశ్చ సర్వదా, ధ్యాయేజ్జ పేన్నమేద్భక్త్యా భజేదభ్యర్చయేన్మదా, ఉపాయోపాయభావేన తమేవ శరణం వ్రజేత్, ఇతి సర్వేషు వేదేషు సర్వశాస్త్రేషు సమ్మతమ్, ఏవం ద్వయోపదేష్టారం

భావయేత్ బుద్ధిమాన్ ధియా" (శ్రీసాత్త్వత తంత్రమ్)- (గురువే పరబ్రహ్మ, గురువే గొప్ప ఉపాయం. గురువే గొప్ప విద్య. గురువే గొప్ప సంపద. గురువే గొప్ప మనోరథం. గురువే గొప్ప ప్రాప్యం. భగవంతుని గూర్చియే గురువు ఉపదేశిస్తాడు కనుక, ఆ భగవంతుని కంటే గురువు గొప్పవాడు. అందువల్ల ఆ ఆచార్యుని సదా అర్చించాలి. నమస్కరించాలి. సంకీర్తనం చేయాలి. గురువునే ప్రీతితో ధ్యానించాలి. జపించాలి. భక్తితో నమస్కరించాలి. స్తుతించాలి. అర్చించాలి. ఉపాయంగా, ఉపేయంగా ఆచార్యులనే శరణు పొందాలి. ఈ విషయం అన్ని వేదాలలో, అన్ని శాస్త్రాలలో సమ్మతమైనది. అందువల్ల జ్ఞాని అయినవాడు ద్వయాన్ని ఉపదేశించిన ఆచార్యుని ఈ రీతిలో భావించాలి) అని పాంచరాత్రసంహితలలో ఒకటైన శ్రీసాత్త్వతసంహితలో ద్వయాన్నిగూర్చి చెప్పబడేటపుడు, దానిని ఉపదేశించిన ఆచార్యుని గొప్పతనాన్ని భగవంతుని చేతనే తెలుపబడింది కదా !

**32. మానిడవనెన్ఱుమ్ గురువై మలర్మగళ్కోన్,**
**తానుగన్ద కోలములోకమెన్ఱుమ్, - ఈనమదా**
**ఎణ్ణుగిన్ఱ నీశరిరువరుమే, ఎక్కాలుమ్**
**నణ్ణిడువర్ కీழ் నరగు.**

గురువై = తన ఆచార్యుని, మానిడవన్ ఎన్ఱుమ్ = మానవుడని, మలర్ మకళ్ కోన్ = లక్ష్మీవల్లభుడైన స్వామి, తాన్ ఉకన్ద కోలమ్ = తాను స్వీకరించన అర్చ స్వరూపం, ఉలోకమ్ ఎన్ఱుమ్ = దానికి కారణమైన తిరుమేనిని (బంగారం, వెండి, రాగి-మొదలైన) లోహాలని, ఈనమదా = తక్కువగా, ఎణ్ణుకిన్ఱ = భావించే, నీశర్= నీచులు, ఇరువరుమే = ఇద్దఱే, ఎ క్కాలుమ్ = అన్నికాలాలలో, కీழாమ్= చాలా అధమమైన, నరకు = నరకాన్ని, నణ్ణిడువర్ = పొందుతారు.

ఆచార్యుడు మనవంటి మానవుడని తలచేవారు, శ్రియఃపతి ఆదరంతో పరిగ్రహించిన దివ్యమంగళ విగ్రహాన్ని లోహమని హీనంగా భావించేవారు - అనే ఈ ఇద్దరు నీచులు, నిత్యంగా అధోగతిలో పడి ఉంటారు.

ముప్పత్తిరణ్డామ్‌పాట్టు :- అవతారికై - తిరువష్టాక్షరప్రదనాన ఆచార్యన్ తిరువడిగళే సకల ప్రాప్యమెన్ఱఱియాదా రుఱవై విడుగై శాస్త్రవిహితమెన్ఱుమ్,



సకలశాస్త్రముమ్ ప్రతిపాదిప్పదు శరణాగతిప్రదనాన ఆచార్యన్ తిరువడిగళే రక్షకమామెన్నుమదు వెన్ఱు మరుళిచ్చెయ్‌గైయాలే ఆచార్యవైభవత్తై ప్రకాశిప్పిత్తార్, కీழ் ఇరణ్డు పాట్టాలే. ఇప్పాట్టిల్ ఇప్పడి యిరున్దుళ్ళ ఆచార్యనై అవతార విశేషమెన్ఱు ప్రతిపత్తి పణ్ణాదే, మానుషప్రతిపత్తి పణ్ణుమవనుక్కు వరుమనర్థత్తై, అర్చావతారత్తిల్ ఉపాదాననిరూపణమ్ పణ్ణుమవనోడు శేర్‌త్తరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (మానిడవనెన్ఱుమ్ గురువై)- ఆచార్యనై మనుష్యనెన్ఱుమ్. అదావదు - "సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్" ఇత్యాదిప్పడియే తన్నై సంసారత్తిల్ నిన్ఱు మెడుక్కైక్కాగ. ఈశ్వరన్ మనుష్య రూపజ్గొణ్డు వన్దిరుక్కిఱాన్- ఎన్ఱు అఱియాదే, మేలెழுన్ద ఆకారత్తై ప్పార్‌త్తు ఆచార్యనై మనుష్యనెన్ఱు ప్రతిపత్తి పణ్ణుగై. "యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ, మర్త్యబుద్ధిః శ్రుతమ్ తస్య సర్వం కుంజరశౌచవత్" ఎన్ఱు ఆచార్యనై మనుష్యనెన్ఱు నినైక్కిఱవన్‌బుద్ధి అసద్బుద్ధి ఎన్ఱుమ్, అవన్ కఱ్ఱ కల్వి ఎల్లామ్ నిష్ప్రయోజనమెన్ఱుమ్ శ్రీభాగవతత్తిలే శొల్లిఱ్ఱిఱే.

(మలర్మగళ్కోన్ తానుగన్ద కోల ములోగమెన్ఱుమ్) - శ్రియఃపతియాన వన్, తానుగన్దరుళిన విగ్రహత్తై లోహమెన్ఱుమ్. అదావదు, "ఉమరుగన్దుగన్ద ఉరువమ్ నిన్నురువమ్" ఎన్గిఱపడియే ఆశ్రితరానవర్‌గళ్ ఉగన్దదడియాగ అవన్ ఉగన్దు పరిగ్రహిత్తునిఱ్కిఱ అర్చారూపత్తై అప్రాకృత విగ్రహత్తోపాదియాగ ప్రతిపత్తిప్పణ్ణవేణ్డి యిరుక్క, మేలెழுన్ద ఆకారత్తైయే పార్‌త్తు అదినుడైయ ఉపాదాననిరూపణమ్ పణ్ణుగై. "అర్చావతారోపాదానం వైష్ణవోత్పత్తి చింతనమ్, మాతృయోనిపరీక్షాయా స్తుల్యమాహు ర్మనీషిణః" ఎన్ఱు అర్చావతారోపాదాన నిరూపణత్తై మాతృయోని పరీక్షాసమమాగ శాస్త్రమ్ శొల్లిఱ్ఱిఱే.

(ఈనమదాగ)- హీనమాగ- ఇప్పడి త్తణ్ణియదాగ - ఎన్ఱపడి.

(ఎణ్ణుగిన్ఱ నీశర్)- శిన్దియానిఱ్కిఱ నీశర్. ఇవర్‌గళిఱ్కాట్టిల్ తణ్ణియరిల్లై- ఎన్గై. అదావదు- ఆచార్యవిషయత్తైయుమ్, అర్చావతారవిగ్రహత్తైయుమ్ కీழ் చ్చొన్నపడియే తణ్ణియదాగ ప్రతిపత్తి పణ్ణుమవర్‌గళ్ కర్మచణ్డాళర్ - ఎన్గై.

**(ఇరువరుమే)** - ఇవ్విరువరోడు తుల్యపాపిగళ్ ఇల్లామైయాలే, మేఱ్చొల్లు గిఱ అనర్థ మివర్గళిరువరుక్కుమే యుళ్ళదు - ఎన్రై.

**(ఎక్కాలుమ్)**- ఎక్కాలత్తిలుమ్. కాలతత్వముళ్ళదనైయు మెన్టపడి.

**(నణ్ణిడువర్ కీఴ్గా నరగు)**- ఇదుక్కు మేల్ పొల్లాదదిల్లై యెన్నుమ్బడి త్తణ్ణీదాన నరకత్తై ప్రాపిప్పర్గళ్- ఎన్రై. ఎక్కాలుమ్ నణ్ణిడువర్ - ఎన్రైయాలే, నరకత్తిలే సృష్టియుమ్, నరకత్తిలే సంహారముమాయ్ చ్చెల్లుమాయిఱ్ఱు. అన్టిక్కే, ఎక్కాలుమ్ కీఴ్గానరగెన్టు, వెడియా వెన్నరగాన సంసారత్తై చ్చొన్నపోదు, నిత్యసంసారిగళాయ్ ప్పోవర్గళ్ - ఎన్టపడి. **"విష్ణో రర్చావతారేషు లోహభావం కరోతి యః, యో గురౌ మానుషం భావ ముభౌ నరకపాతినౌ"** ఎన్గిఱ బ్రహ్మాణ్డ పురాణవచనమ్ ఇవ్వర్థత్తుక్కు సంవాదమాగ అనుసంధేయమ్.

ముప్పైరెండవ పాశురం అవ : గడచిన రెండు పాశురాలలో - (1) తిరు మంత్రాన్ని ఉపదేశించిన ఆచార్యుల శ్రీచరణాలే సకలవిధమైన ప్రాప్యమని తెలియనివారి సంబంధాన్ని విడచిపెట్టాలి - అని శాస్త్రాలు విధిస్తున్నాయని, (2) శరణాగతి మంత్రమైన ద్వయాన్ని ఉపదేశించిన ఆచార్యుని శ్రీచరణాలే రక్షకం- అని అన్ని శాస్త్రాలు తెల్పుతున్నాయి - అని పల్కడం ద్వారా ఆచార్యుని వైభవాన్ని వ్యక్తం చేశారు. ఇక, ఈ పాశురంలో, ఈ విధంగా ఉండే ఆచార్యుని ఒక అవతారమని భావించకుండా, మానవమాత్రుడని భావించేవారికి కలిగే దోషాన్నిగూర్చి, అర్చావతారం రూపొందించిన లోహం విషయంలో విచారణ చేసేవానికి కలిగే దోషాన్నిగూర్చి ఇందులో పల్కుతున్నారు.

**(మానిడవన్ ఎన్టుమ్ కురువై)** - ఆచార్యుని సామాన్యమానవుడని- అని అర్థం. దీని భావమేమంటే- **"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్ర పాణినా"** (జయాఖ్యసంహిత) (దేవుడైన శ్రీమన్నారాయణుడే ఆచార్యుడనే రూపాన్ని ధరించి, సంసార సముద్రంలో మునిగి ఉండే జీవులను శాస్త్రమనబడే చేతిలో కరుణా ఉద్ధరిస్తున్నాడు) అనే రీతిలో తనను సంసారమండలం నుండి ఉద్ధరించడం కోసం సర్వేశ్వరుడు మానవరూపాన్ని ధరించి వచ్చాడు- అని తెలియకుండా,



పైపైన తోచే అతని మానవరూపాన్ని ధరించి ఆచార్యుని మానవుడని భావించడం. **"యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ, మర్త్యబుద్ధిః శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్"** (భాగవతమ్) (జ్ఞానమనే దీపాన్ని ఇచ్చే ఆచార్యునిపట్ల ఎవడు సామాన్యమానవుడనే భావాన్ని పొందుతున్నాడో, అతడు ఉపదేశంగా పొందిన జ్ఞానం అంతా గజస్నానంవలె నిష్ఫలం) అని ఆచార్యుని మానవుడని భావించేవాని జ్ఞానం సరి అయిన జ్ఞానం కాదని, అతడు నేర్చిన విద్య అంతా ఏనుగు స్నానం చేసి, తనపై బురదను జల్లుకొనే రీతిలో నిష్ఫలమని శ్రీమద్భాగవతంలో చెప్పబడింది కదా!

**(మలర్మకళ్కోన్ తాన్ ఉకన్ద కోలమ్ ఉలోకమ్ ఎన్టుమ్)**- లక్ష్మీనాథుడు అభిమానించిన అర్చారూపం యొక్క తిరుమేనిని బంగారం, వెండివంటి లోహం అని- అని అర్థం. దీని భావం ఏమంటే- **"ఉమరుకన్దుకన్ద ఉరువమ్ నిన్నురువమాకి"** (తిరువాయ్-8-1-4) (నీ భక్తులు ఏ రూపాన్ని ఆదరిస్తారో ఆ రూపాన్నే నీ రూపంగా గ్రహించి) అనే రీతిలో భక్తులు ఆదరించి నిర్మించినది- అనే కారణంచేత భగవంతుడు ఆదరించి, స్వీకరించిన అర్చారూపాన్ని అప్రాకృతరూపాన్నివలె భావించవలసి ఉండగా, పైపైన తోచే సన్నివేశాన్ని చూచి, "ఇది ఈ ద్రవ్యంతో నిర్మింపబడినది- అని పరిశీలించడం. **"అర్చావతారోపాదానం వైష్ణవోత్పత్తిచింతనమ్, మాతృయోనిపరీక్షాయా స్తుల్య మాహు ర్మనీషిణః"** (అర్చావతార విగ్రహంయొక్క ద్రవ్యాన్ని పరిశీలించడం, శ్రీవైష్ణవుడు జన్మించిన జాతిని గూర్చి విచారించడం- అనేది తల్లియోని (జన్మస్థాన) పరీక్షను చేయడంవంటిదని జ్ఞానులు అంటారు) అని అర్చావతార తిరుమేనిని "ఇది ఈ ద్రవ్యంతో చేయబడింది'' అని భావించడం తల్లి మర్మస్థానాన్ని పరిశీలించడంవంటిది (మహాపాతకం) అని శాస్త్రం పల్కింది కదా!

**(ఈనమదా)**- (అర్చారూపాన్ని) హీనంగా- తక్కువగా- అని అర్థం. పూర్వం తెల్పిన రీతిలో తక్కువగా- అని తాత్పర్యం.

**(ఎణ్ణుకిన్ట నీశర్)** - భావించే నీచులు - అని అర్థం. వీరికంటే నీచులు లేనేలేరని భావం. అంటే- ఆచార్యుని, భగవానుని అర్చాతిరుమేనిని పూర్వం తెల్పినట్లుగా తక్కువగా భావించేవారు కర్మచండాలురు- అని భావం.

**(ఇరువరుమే)**- ఈ ఇద్దరిలో సాటివచ్చే ఇంకొక మహాపాతకులు లేనందున, పైన తెలుపబడే చెడ్డఫలం వీరిరువురకు మాత్రమే కల్గుతుందని భావం.

**(ఎక్కాలుమ్)**- అన్ని కాలాలలోను- అని అర్థం. **"కాలమ్"** అనే తత్త్వం ఉన్నంతవరకు- అని భావం.

**(నణ్ణిడువర్ కీ*ழ*ామ్ నరకు)** - దీనికి మించిన నరకం ఇంకొకటి లేదు- అని చెప్పే రీతిలో చాలా నీచమైన నరకాన్ని పొందుతారు- అని భావం. **"ఎక్కాలుమ్ నణ్ణిడువర్"** అని అన్నందున నరకంలోనే పుట్టి పుట్టి నశిస్తారు- అని స్ఫురిస్తున్నది. ఆ రీతిలో కాకుండా **"ఎక్కాలుమ్ కీ*ழ*ామ్ నరకు"** అనేది **"వెడియా వెన్నరకు"** (తిరువాయ్‌మొ*ழ*ి-2-6-7) అని చెప్పబడే సంసారాన్ని తెల్పుతున్నదిగా గ్రహించి, ఎల్లప్పుడు సంసారంలోనే పరిభ్రమిస్తారు- అనే అర్థాన్ని చెప్పవచ్చు. **"విష్ణో రర్చావతారేషు లోకభావం కరోతి యః, యో గురౌ మానుషం భావ ముభౌ తౌ నరకపాతినౌ"** (బ్రహ్మాండపురాణమ్)- (విష్ణువు యొక్క అర్చావతారాన్ని గూర్చి లోహమనే భావాన్ని పొందేవాడు, ఆచార్యునిపట్ల మానవభావనను పొందేవాడు- అనే ఈ ఇద్దఱు నరకంలో పడిపోతారు) అనే బ్రహ్మాండపురాణవచనం ఈ అర్థానికి ప్రమాణంగా అనుసంధేయం.

33. **ఎట్ట విరున్ద గురువై యిఱై యన్ఱెన్ఱు,**
**విట్టోర్ పరనై విరుప్పుఱుదల్, - పొట్టెన త్తన్**
**కణ్ శెమ్బిళిత్తిరున్దు కైత్తురుత్తి, నీర్ తూవి**
**అమ్బుదత్తై ప్పార్త్తిరుప్పానఱ్ఱు**

ఎట్ట ఇరున్ద = తనకు అందేటట్లుగా సమీపంలో ఉండే, గురువై = ఆచార్యుని, ఇఱై అన్ఱు ఎన్ఱు = నమస్కరించదగినవారు కారు - అని, విట్టు = విడచిపెట్టి, ఓర్ పరనై = తనకు దరిచేరడానికి దుర్లభుడైన భగవానుని, విరుప్పు ఉఱుదల్ = ఆశించడం, పొట్టెన = చటుక్కున, తన్ కణ్ = తన నేత్రాన్ని, శెమ్బిళిత్తిరున్దు = మూసికొని, కై త్తురత్తి నీర్ = చేతిలో ఉండే నీటిసంచిలో పోసికొన్న నీటిని,



తూవి= నేలపై పారబోసి, అమ్బుయత్తై = ఆకాశంలోని మేఘాన్ని, పార్త్తిరుప్పాన్ అఱ్ఱు= దాహం తీరడం కోసం నీటిని తాగాలని ఎదురుచూడడం వంటిది.

తన సమీపంలో ఉండే ఆచార్యుని స్వామి కాదని విడచిపెట్టి, వేఱు పరమ పురుషుని పొందాలని కోరడం - చటుక్కున తన కన్నులను మూసికొని (చేతికి అందే) చేతిలో ఉండే జలాన్ని జారవిడచి, ఆకాశంలోని మేఘాన్ని నీటికోసం ఎదురుచూచేవాడు, చేసేపనివంటిదే కాగలదు.

ముప్పత్తుమూన్ఱామ్‌పాట్టు :- అవతారికై - ఆసన్ననాయిరుక్కిఱ ఆచార్యనై అవమతి పణ్ణి క్కైవిట్టు, అతిదూరస్థనాన ఈశ్వరనై అపేక్షిత్త దశైయిల్ ఉదవుమెన్ఱు నినైత్తు ఆశైప్పడుమవన్ అఱివు కేడనెన్నుమత్తై దృష్టాంతముఖేన అరుళిచ్చెయ్‌గిఱార్.

వ్యాఖ్యానమ్ : **(ఎట్ట విరున్ద గురువై)** - ఆసన్నమాగ ఇరున్ద ఆచార్యనై. అదావదు- చక్షుర్గమ్యనాయ్, త్తనక్కు వేణ్డినపోదు రక్షకనాగవుమ్, భోగ్యనాగవుమ్ ఉజ్జీవిక్కలామ్బడి సన్నిహితనా యిరుక్కిఱ ఆచార్యనై - ఎన్ఱై.

**(ఇఱై యన్ఱెన్ఱు విట్టు)** - శేషియన్ఱు - ఎన్ఱు విట్టు. అదావదు - "శరణాగతి తన్ద తన్నిఱైవన్దాళ్" ఎన్గిఱపడియే తనక్కిఱైవనాయిరుక్క సజాతీయ బుద్ధియాలే అవన్ ఇఱైయన్ఱు ఎన్ఱు విట్టు - ఎన్గై.

**(ఓర్ పరనై విరుప్పుఱుదల్)**- పరనా యిరుప్పా నొరువనై విరుమ్బుగై. అదావదు- శాస్త్రగమ్యనాయ్, అతిదూరస్థనాయ్, తనక్కు అణుగ అరియ నాయిరుక్కుమ్ ఈశ్వరనై రక్షకనాగవుమ్, భోగ్యనాగవుమ్ ఉజ్జీవిక్కలామ్బడి సన్నిహితనాయిరుక్కిఱ ఆచార్యనై-ఎన్ఱై.

**(పొట్టెన)**- శడక్కెన,

**(తన్ కణ్ శెమ్బిళిత్తిరున్దు)**- తూఙ్గువారైప్పోలే తన్ కణ్ణై మూడిక్కొణ్డిరున్దు, మేల్ విళైవదు విచారియామలిరున్దు- ఎన్ఱపడి.

**(క్కైత్తురుత్తి నీర్ తూవి)** - విడాయ్ పిఱన్దపోదు ఉపజీవిక్కలామ్బడి తురుత్తియిలే శేర్త్తు కరస్థమాయిరుక్కిఱ జలత్తై నిలత్తిలే పోక్కు**ఱ్ఱు**.

**(అమ్బుదత్తై ప్పార్త్తిరుప్పాన***ఱ్ఱు***)**- మేఘగతమాన జలమ్ విడాయ్క్కు ఉదవుమెన్ఱు నినైత్తు. ఆకాశవర్తియాయ్, అతిదూరస్థమా యిరుక్కిఱ అమ్బుదత్తై ప్పార్త్తిరుక్కుమవనైప్పోలే. అవనైప్పోలే-ఎన్ఱదు- అవన్ శెయలైప్పోలే- ఎన్ఱపడి. అల్లదు విరుప్పుఱదల్ - ఎన్ఱదోడు శేరాదితే. "చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యః స్మరేత్, కరస్థముదకం త్యక్త్వా ఘనస్థ మభివాంఛతి" ఎన్ఱు ఇవ్వర్థన్దాన్ భగవద్బోధాయన కృతమాన పురాణసముచ్చయత్తిల్ ఆచార్యమాహాత్మ్యప్రకరణత్తిల్ శొల్లప్పట్టదితే.

ముప్పైమూడవ పాశురం :- అవతారిక : సమీపంలో ఉండే ఆచార్యుని ఒక వస్తువుగా లెక్కించకుండా, విడచి పెట్టి, "చాలా దూరంలో ఉండే భగవంతుడే (మనకు అక్కరవచ్చినపుడు) కావలసి వచ్చినపుడు సహాయ పడతాడు'' అని భావించి, అతనిని ఆదరించేవాడు (కోరేవాడు) జ్ఞానహీనుడు- అని సోదాహరణంగా పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- **(ఇతై అన్ఱు ఎన్ఱు విట్టు)** కైంకర్యం చేయదగినవాడు కాడు- అని విడచిపెట్టి- అని అర్థం. దీని భావమేమంటే - **"శరణాగతి తన్ద తన్ ఇతైవన్తాళే అరణాకుమ్"** (31) అనే రీతిలో తనచే నమస్కరింపబడదగినవాడై ఉండగా, అతడు మనవంటి ఒక సాధారణమానవుడు - అని తలచి, అతడు నమస్కరించదగినవాడు కాడు- అని విడచిపెట్టి - అని భావం.

**(ఓర్ పరనై విరుప్పుఱుదల్)** - పరమాత్మయై ఉండే ఒకనిని (అద్వితీయుని) కోరడం. దీని భావం ఏమంటే- శాస్త్రాలద్వారా తెలియబడేవాడై, చాలా దూరంలో పరమపదంలో ఉండేవాడై, తనకు దరిచేరడానికి దుర్లభుడై ఉండే సర్వేశ్వరుని (ఆచార్యుని కంటే) రక్షించేవాడని, భోగ్యభూతుడని తలచి- అని.

**(పొట్టెన)**- చటుక్కున- అని అర్థం.

**(తన్ కణ్ శెమ్బుళిత్తిరున్దు)**- నిద్రించేవారివలె తన కన్నులను మూసికొని- అని అర్థం. దీని ఫలం ఏమి ? అని విచారించకుండా- అని భావం.



**(కైత్తురత్తి నీర్ తూవి)**- దాహం కల్గినపుడు, నీరు తాగి దాహం తీర్చుకొనేటట్లుగా **"తురత్తి"** అనే పాత్రలో నీరు పోసికొని, దానిని తనచేతిలో పెట్టుకొని, ఆ నీటిని నేలపై పారబోసి.

**(అమ్బుదత్తై ప్పార్త్తిరుప్పాన***ఱ్ఱు***)** - మేఘంలో ఉండే నీటిని తన దాహాన్ని తీర్చగల్గినదని తలచి ఆకాశంలో ఉన్నదై, చాలా దూరంలో ఉండే మేఘాన్ని చూచేవానివలె - అని అర్థం. ఆ విధంగా అర్థాన్ని గ్రహించకపోతే, పాశురం ముందు భాగంలో ఉండే **"విఱుప్పుదల్"**- అనే పదప్రయోగంతో పొసగదుకదా! **"చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యః స్మరేత్, కరస్థ ముదకం త్యక్త్వా ఘనస్థ మభివాంఛతి"** (పురాణసముచ్చయమ్)- కంటికి నేరుగా కన్పించే ఆచార్యుని విడచిపెట్టి, శాస్త్రం ద్వారా తెలియబడే భగవంతుని ఎవడు భావిస్తాడో, అతడు చేతిలో ఉండే నీటిని విడచిపెట్టి, మేఘంలో ఉండే నీటిని కోరేవానివంటివాడు) అని ఈ అర్థం బోధాయనమహర్షి రచించిన పురాణసముచ్చయంలో ఆచార్యుని గొప్పతనాన్ని తెలిపే సందర్భంలో చెప్పబడింది కదా!

**34. ప***ఱ్ఱు***గురువై ప్పరనన్ఱెన ఇగ***ఴ్***న్దు,**
**మ***ఱ్ఱో***ర్ పరనై వ***ఴి***ప్పడుదల్, - ఎ***ఱ్ఱే***! తన్**
**కైప్పొరుళ్ విట్టారేనుమ్ క్కాశినియిల్ తామ్ పుదైత్త,**
**అప్పొరుళ్ తేడి త్తిరివాన***ఱ్ఱు*

ప*ఱ్ఱు*మ్ గురువై = తాను ఆశ్రయించిన ఆచార్యుని, వరన్ అన్ఱు ఎన = రక్షకం అని, ఇక*ఴ్*న్దు = అవమానించి, విడచి, మ*ఱ్ఱు* ఓర్ పరనై = వేఱొకడైన పరమాత్మను, వ*ఴి*పడుతల్ = రక్షకునిగా స్వీకరించడం (ఆశ్రయించడం), తన్ కై పొరుళ్ = తన చేతిలోని సంపదను, విట్టు = "ఇది చిన్నది'' అని విడచిపెట్టి, ఆరేనుమ్ = ఇంకొ ఎవరైనా, తామ్ = తాము, కాశినియిల్ = భూమిలో ఉండే, పుదైత్త = నిక్షిప్తం చేసిన, అప్పొరుళ్ = ఆ సంపదను, తేడి త్తిరివాన*ఱ్ఱు*= అన్వేషించేవాని చేష్టవంటిది, ఎ*ఱ్ఱే* = ఏమి! (విషాద సూచకం)

తనచే ఆశ్రయింపబడిన ఆచార్యుడు రక్షకుడు కాదని తిరస్కరించి, వేఱొక పరమ పురుషుని అనువర్తించడం (ఎటువంటిది? అంటే,) – తన చేతికి లభించిన ధనాన్ని విడచి, వేఱు వ్యక్తి భూమిలో ఉండే గుప్తవిధికోసం అన్వేషించేవాని పనివంటిది. అయ్యో! ఏమి అవివేకం!

ముప్పత్తునాలామ్పాట్టు :- అవతారికై - అతిసులభనాయ్, త్తనక్కు కైపుగున్దిరుక్కిఱ ఆచార్యనై అపరత్వబుద్ధియాలే ఉపేక్షిత్తు, అతిదుర్లభనాయ్, అనేక యత్నప్పట్టు క్కాణ వేణ్డుమ్బడి యిరుక్కుమ్ ఈశ్వరనై అపేక్షిత్తు, సమయత్తిల్ నమక్కుదవు మెన్ఱు నినైత్తు అనువర్తిక్కై అజ్ఞానకార్య మెన్నుమత్తై ఇన్న మొరు దృష్టాంతత్తాలే దర్శిప్పిక్కిఱార్.

వ్యాఖ్యానమ్ :- **(పఱ్ఱు గురువై)** - తన్నాలే పఱ్ఱప్పట్టిరుక్కిఱ ఆచార్యనై. ఆదావదు- అతిసులభనాయ్, త్తనక్కపేక్షితమాన దశైయిల్ రక్షకనాగవుమ్, భోగ్యనాగవుమ్, ఆశ్రయిక్కప్పట్టిరుక్కిఱ ఆచార్యనై-ఎన్ఱై.

**(పరనన్ఱెన ఇగఴ్న్దు)** - "యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ" ఎన్ఱు, భగవదవతారమాగ శాస్త్రమ్ శొల్లుగైయాలే పరనా యిరుక్కిఱవనై. సజాతీయ బుద్ధియాలే, ఇవన్ పరనన్ఱు - ఎన్ఱు అవమతిపణ్ణి కైవిట్టు.

**(మఱ్ఱోర్ పరనై వఴిప్పడుదల్)**- వేఱే యొరు పరనై వఴిప్పడుగై. అదావదు-అతిదుర్లభనాయ్, త్తన్ కణ్ణుక్కు విషయమన్ఱిక్కే, అనేకమ్ వరుత్తప్పట్టు క్కాణవేణ్డుమ్బడి యిరుప్పానాన ఈశ్వరనై, తనక్కు రక్షకనుమ్, భోగ్యనుమాగ నినైత్తు త్తన్ లాభార్థమాగ అనువర్తిక్కై-ఎన్ఱై.

**(ఎఱ్ఱే)**- ఇవన్ విట్ట విషయత్తుక్కుమ్, పఱ్ఱిన విషయత్తుక్కుముళ్ళ నెడు వాశియై త్తిరువుళ్ళమ్ పఱ్ఱి విషణ్ణరాయ్, ఎన్నే!- ఎన్గిఱార్.

**(తన్ కైప్పొరుళ్ విట్టు)**- వేణ్డినపోదు వినియోగజ్గొళ్ళలామ్బడి మడిచ్చి రైయిలే కట్టి త్తన్ కైయిలిరుక్కిఱ ధనత్తై అల్పమెన్ఱు నినైవాలే విట్టు.

**(ఆరేనుమ్ కాశినియిల్ తామ్ పుదైత్త)**- వెళినిలత్తిలన్ఱిక్కే భూమిక్కుళ్ళే మఱ్ఱోరేనుమ్ తాజ్గళ్ పుదైత్తువైత్త.



**(అప్పొరుళ్ తేడిత్తిరివానఱ్ఱు)** - అన్ద ధనత్తైత్తాన్ లభిక్కైక్కు త్తేడి త్తిరియుమవన్‌పోలే. ఇజ్గు మవన్ శెయల్‌పోలే - ఎన్ఱపడి. వఴిప్పడుదల్ - ఎన్ఱత్తోడు శేరవేణుమిఱే. "సులభం స్వగురుం త్యక్త్వా దుర్లభమ్ య ఉపాసతే, లబ్ధం త్యక్త్వా ధనమ్ మూఢో గుప్త మన్వేషతి క్షితౌ" ఎన్నక్కడవదిఱే. ఇన్ద శ్లోకత్తిలే ఉపాసతే- ఎన్ఱదు, ఆర్షమ్. ఉపాస్తే- ఎన్ఱపడి.

ముప్పైనాల్గవ పాశురం :- అవతారిక : మిక్కిలి సులభుడై, తనకు వశుడై ఉండే ఆచార్యుని "గొప్పవాడు కాడు'' అని విడచి పెట్టి, పొందడానికి చాలా దుర్లభుడై, పలు ప్రయత్నాలు చేసి దర్శించదగినవాడై ఉండే సర్వేశ్వరుని- "మనకు కావలసి వచ్చినపుడు సహాయం చేస్తాడు'' అని తలచి ఆరాధించడం జ్ఞానం లేని పని- అనే విషయాన్ని ఇంకొక ఉదాహరణాన్ని ప్రదర్శించి, ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- (పఱ్ఱు గురువై) తాను ఆశ్రయించిన ఆచార్యుని- అని అర్థం. దీని భావమేమంటే - చాలా సులభుడై, తనకు అవసరమైనపుడు రక్షకునిగా, భోగ్యునిగా (ఉపాయంగా, ఉపేయంగా) ఆశ్రయింపబడే ఆచార్యుని- అని.

**(పరన్ అన్ఱు ఎన ఇకఴ్న్దు)** - "యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ, మర్త్యబుద్ధిః శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్" (భాగవతమ్) అనే భాగవత ప్రమాణానుసారం ఆచార్యుని భగవదవతారంగా శాస్త్రం తెల్పుతున్నందున, నిజానికి గొప్పవాడై ఉండగా, "ఇతడు కూడా ఒక సామాన్య మానవుడే'' అని తలచి, ఇతడు గొప్పవాడు కాడు - అని అవమానించి, విడచిపెట్టి- అని భావం.

**(మఱ్ఱోర్ పరనై వఴిప్పడుదల్)**- వేఱొక పరమాత్మను ఆరాధించడం- అని అర్థం. దీని భావమేమంటే - పొందడానికి చాలా దుర్లభుడై, కంటికి కన్పించకుండా ఉండేవాడై, పలు ప్రయత్నాలను చేసినా కన్పించని రీతిలో ఉండేవాడైన సర్వేశ్వరుని తనకు రక్షకుడని (శరణమని), భోగ్యభూతుడని (ఉపాయమని, ఉపేయమని) తలచి, అతనిని పొందడానికి పాటుపడడం- అని.

**(ఎన్ఱే!)** - ఇతనిచే విడువబడిన ఆచార్యునకు, ఆశ్రయింపబడిన సర్వేశ్వరునకు మధ్య ఉండే మిక్కిలి హెచ్చు తగ్గులను తలచి, విషాదంతో **"ఎన్ఱే!"** అని అంటున్నారు.

**(తన్ కైప్పొరుళ్ విట్టు)** -ఆవశ్యకమైనపుడు ఉపయోగించు కొనేటట్లుగా తన వస్త్రంలో ముడికట్టుకొని ఉన్నందున తన చేతిలో ఉండే సంపదను అది కొంచెమనే భావనతో విడచి పెట్టి,

**(ఆరేనుమ్ కాశినియిల్ తామ్ పుదైత్త)**- తనకు లభించని చోట కాకుండా, తమ భూమి లోపల వేటెవరైనా దాచి పెట్టి ఉంచిన,

**(అప్పొరుళ్ తేడి త్తిరివాన్ఱు)** - ఆ సంపదను తాను పొందడానికి వెదకుతూ తిరిగే వానివలె - అని అర్థం. ఇక్కడ కూడా **'వఴిపడుదల్"** అనే పదంతో పొసగాలి కనుక, **"తేడిత్తిరివాన్ఱు"** అనే ప్రయోగానికి "వెదకి తిరిగేవాని చేష్టవలె'' అనే అర్థాన్ని గ్రహించాలి. **"సులభం స్వగురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే, లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్త మన్విష్యతి క్షితౌ"** (తనకు వశుడై ఉండే ఆచార్యుని విడచి, పొందడానికి దుర్లభుడైన భగవంతుని ఎవడు రక్షకునిగా భావిస్తాడో, ఆ జ్ఞానహీనుడు చేతిలో ఉండే వస్తువును విడచి, భూమిలో దాచి పెట్టిన నిధిని అన్వేషించేవానితో సమానుడు) అని చెప్పబడినది కదా! ఈ శ్లోకంతో ఋషి ప్రయోగమైనందున **"ఉపాసతే"** అనే దానిని **"ఉపాస్తే"** అని గ్రహించాలి.

**35. ఎన్టు మనైత్తుయిర్క్కుమ్ ఈరజ్ఞెయ్ నారణనుమ్**
**అన్టుమ్ తన్నారియన్‌పాల్ అన్బొఴియిల్, - నిన్ఱ**
**పునల్ పిరిన్ద పఙ్గయత్తై ప్పొఙ్గు శుడర్ వెయ్యోన్,**
**అనలుమిఴ్న్దు తానులర్త్తియన్ఱు**

నిన్ఱ పునల్ = తాను నిలచి ఉండే నీటిని, పిరిన్ద = విడచిపెట్టిన, పఙ్గయత్తై= తామరపూవును, పొఙ్గు శుడర్ = జ్యోతిస్స్వరూపుడైన, వెయ్యోన్ = సూర్యుడు, తాన్= (దానిని వికసింపజేసే) తానే, అనల్ ఉమిఴ్న్దు = తన జ్యోతిస్సు అనే నిప్పును ఉమిసి, అలర్త్తియన్ఱు = శుష్కింపజేసేటట్లే, ఎన్టుమ్ = అన్ని



కాలాలలోను, అనైత్తు, ఉయిర్క్కుమ్ = జీవులందఱికి, ఈరమ్ శెయ్ = కరుణను చూపే, నారణనుమ్= సర్వేశ్వరుడు కూడా, తన్ ఆశారియన్ పాల్ = (ఒక మానవుడు) తనకే చెందిన ఆచార్యుని పట్ల, అన్బు ఒఴియిల్ = భక్తినికల్గి ఉండకపోతే, అన్టుమ్ = కోపాన్ని పొందుతాడు.

ఆత్మలన్నిటిపట్ల ఎల్లప్పుడు కరుణ జూపే నారాయణుడుకూడా, స్వాచార్యుని పట్ల భక్తిలేనివానిని నిగ్రహిస్తాడు. ఇది ఎటువంటిది? అంటే, తనకు ధారకమైన నీటిని విడచి బయటపడిన తామరపూవును, తేజస్వి అయిన సూర్యుడే తన వేడిమిని వ్యాపింపజేసి, ఎండిపోయేటట్లు చేస్తాడు.

ముప్పత్తఞ్జామ్‌పాట్టు :- అవతారికై - ఆసన్నమాయ్, సులభమాన ఆచార్య విషయత్తై విట్టు, దూరస్థమాయ్ దుర్లభమాన ఈశ్వరవిషయత్తై ఆశైప్పడువార్ అఱివిలిగళ్- ఎన్నుమత్తై దృష్టాంతద్వయత్తాలే దర్శిప్పిత్తార్, కీఴ్, ఆచార్య విషయత్తిల్ ప్రేమమన్ఱి వనుక్కు ఈశ్వరన్ ఒరుకాలముమ్ అనుగ్రహమ్ పణ్ణాన్; నిగ్రహమే పణ్ణుమెన్నుమత్తై సదృష్టాంతమాగ అరుళిచ్చెయ్‌గిఱార్, ఇదిల్.

వ్యాఖ్యానమ్ :- (ఎన్టుమ్)- ఎల్లా క్కాలత్తిలుమ్.

(అనైత్తుయిర్క్కుమ్)- ఎల్లా ఆత్మాక్కళుక్కుమ్,

(ఈరమ్ శెయ్ నారణనుమ్) - తణ్ణళి పణ్ణానిఱ్కుమ్ సర్వేశ్వరనుమ్. నారణను మెన్టదు. "ఉఱవేల్ నమక్కిజ్ఞొఴిక్క వొఴియాదు" ఎన్గిఱపడియే సకలాత్మాక్కళోడుమ్ అవర్జనీయమాన సంబంధ ముడైయవనాగైయాలే, సర్వవత్సలనెన్టు తోన్ఱుగైక్కాగ.

(అన్టుమ్)- నిగ్రహత్తై ప్పణ్ణానిఱ్కుమ్, అన్టుదల్ - విడుదల్.

(తన్నారియన్‌పాల్ అన్బొఴియిల్) తన్నాచార్యన్‌పక్కల్ ప్రేమమన్ఱాల్. అదావదు. కీఴ్ చ్చొన్నపడియే ఇఱైయన్ అన్టు- ఎన్టుమ్, పరనన్టు - ఎన్టుమ్ నినైత్తు. త్తానవనై విడుమ్బడి తద్విషయ ప్రేమమ్ కులైయిల్- ఎన్ఱై.

**(నిన్ఱ పునల్ పిరిన్ద పఙ్గయత్తై)**- ఉత్పత్తియే తొడఙ్గి త్తనక్కు ధారకమాగ ప్పఱ్ఱినిన్ఱ జలత్తై విట్టగన్ఱ తామరైయై.

**(పొఙ్గుశుడర్ వెయ్యోన్)**- కిళర్న్ద తేజస్సైయుడైయనాయ్, ఉష్ణకిరణ నాన ఆదిత్యన్. అదావదు- "శెఙ్గమలమన్దరఙ్శేర్ వెఙ్గదిరోర్క్కల్లాల్ అలరావాల్" ఎన్గిఱపడియే నీరై ప్పిరియామల్ నిఱ్కుఙ్గాలత్తిల్ ఎన్ఱు మొక్క త్తన్నుడైయ కిరణఙ్గళాలే అదుక్కు వికాసత్తై చ్చెయ్దుక్కొణ్డు పోరువన్ - ఎన్ఱై.

**(అనలుమిఴ్న్దు తామలర్త్తియఱ్ఱు)**- నెరుప్పై యుమిఴ్న్దు తానత్తై యులర్త్తి విడుమాప్పోలే- ఎన్ఱై. ఇత్తాల్- నీరై ప్పిరియామల్ నిఱ్కుఙ్గాలత్తిల్, తామరైయై అలర్త్తక్కడవ ఆదిత్యన్దానే, నీరై ప్పిరిన్ద కాలత్తిల్, నెరుప్పై యుమిఴ్న్దు అత్తై యులర్త్తి విడుమాప్పోలే, ఆచార్యసంబంధమ్ కులైయామల్ నిన్ఱకాలత్తిలే ఎన్ఱు మొక్క అనుగ్రహశీలనాయ్, ఇవన్ స్వరూపత్తై వికసిప్పిక్కుమ్ ఈశ్వరన్దానే, ఆచార్య సంబంధం కొలైన్దాల్, నిగ్రహశీలనాయ్, ఇవన్ స్వరూపత్తై సంకోచప్పిత్తు విడుమెన్ఱదాయిఱ్ఱు. "నారాయణోஉపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్య దుర్బుద్ధేః, కమలం జలాదపేతం శోషయతి రవి ర్న తోషయతి" ఎన్నక్కడవదిఱే.

**ముప్పైఐదవ పాశురం :-** అవతారిక : సమీపంలో ఉన్నందున దరి చేరడానికి సులభుడైన ఆచార్యుని విడచిపెట్టి, దూరంలో ఉన్నందున దరిచేరడానికి వీలు కానివాడై ఉండే సర్వేశ్వరుని పొందాలని ఆశ పడేవారు జ్ఞానహీనులు - అనే విషయాన్ని గడచిన రెండు పాశురాలలో రెండు ఉదాహరణాలను చూపి వివరించారు. ఆచార్యుని విషయం ప్రేమ (భక్తి) లేనివారికి సర్వేశ్వరుడు ఏనాడూ అనుగ్రహించడు; కోపిస్తాడు - అనే విషయాన్ని ఉదాహరణాన్ని చూపుతూ ఈ పాశురంలో పల్కుతున్నారు.

**వ్యాఖ్యానం :- (ఎన్ఱుమ్)**- అన్ని కాలాలలోను,

**(అనైత్తుయిర్క్కుమ్)** ఆత్మలన్నిటిపట్ల,



**(ఈరమ్ శెయ్‌నారణనుమ్)** - దయ చూపే సర్వేశ్వరుడు కూడా- అని అర్థం. "నారణన్" అనే పదం "ఉఱవేల్ నమక్కు ఇఙ్గొఴిక్క ఒఴియాదు" (తిరుప్పావై-28) అనే రీతిలో అన్ని ఆత్మలతో పోగొట్టుకోవడానికి వీలు లేని సంబంధాన్ని కలవాడైనందున, అందఱి పట్ల వాత్సల్యాన్ని కలవాడు - అని వ్యక్తం కావడంకోసమే ప్రయోగింపబడింది.

**(అన్ఱుమ్)** - కోపాన్ని పొందుతాడు. "అన్ఱుతల్"- అనే పదం కోపాన్ని తెలుపుతుంది.

**(తన్నారియన్ పాల్ అన్బు ఒఴియిల్)**- ఒక ఆత్మకు (చేతనునకు) తన ఆచార్యునిపట్ల భక్తిలేకుండా పోతే, గడచిన పాశురాలలో తెలుపబడిన రీతిలో, "ఇతడు మనవంటివాడే" అనే భావనతో "మనకు స్వామి (శేషి) కాడు" అని, "పరుడు కాడు" అని తలచి, తాను అతనిని విడచేటట్లుగా తన ఆచార్యుని పట్ల భక్తి లేకుండా పోతే,

**(నిన్ఱ పునల్ పిఱిన్ద పఙ్గయత్తై)** - తాను జన్మించడానికి, పెరగడానికి ఆధారంగా చేసికొన్న నీటినుండి బయటకు తీయబడిన తామరపూవును.

**(పొఙ్గు శుడర్ వెయ్యోన్)**- మిక్కిలి వృద్ధిచెందే జ్యోతిస్సును కలవాడై, జ్వలించే ప్రకాశాన్ని కల సూర్యుడు. "శెఙ్గమల మన్దరమ్ శేర్ వెఙ్గదిరోఱ్కల్లాల్ అలరావాల్" (పెరుమాళ్ తిరు-5-6) (తామరపూల ఆకాశంలో ప్రకాశించే సూర్యుని చూచి తప్ప వేఱొకరికి వికసించనట్లే) అనే విధంగా నీటిలో ఉండేటపుడు ఎల్లప్పుడు తన కిరణాలతో దానిని వికసింపజేసే సూర్యుడు- అని భావం.

**(అనల్ ఉమిఴ్న్దు తాన్ ఉలర్త్తియఱ్ఱు)**- నిప్పును వెలువరించి, ఆ సూర్యుడు ఆ తామరపూవును శోషింపజేసేటట్లే - అని భావం. నీటిలో ఉండే కాలంలో తామరను వికసింపజేసే అదే సూర్యుడు, నీటిలోనుండి బయటకు తీసివేయబడినపుడు తన కిరణాలతో నిప్పును ఉమిసి, దానిని ఎండిపోయేటట్లు చేసేటట్లే, ఆచార్యునితో సంబంధం విడువకుండా ఉండే కాలంలో ఎల్లప్పుడు

చేతనునకు దయచూపే సర్వేశ్వరుడే, ఆచార్యునితో సంబంధం లేకుండా పోతే ఇతనిపట్ల కోపించి, ఇతనిని జ్ఞానహీనుని చేస్తాడు - అని భావం.

"నారాయణోఽపి వికృతిం యాతి గురోః ప్రచ్యుతస్య దుర్బుద్ధేః, కమలం జలాదపేతం శోషయతి రవి ర్న తోషయతి" (ఆచార్యుని విడచిపెట్టిన జ్ఞానహీనుని పట్ల శ్రీమన్నారాయణుడు కూడా కోపాన్నే పొందుతాడు. నీటినుండి దూరమైన తామరపూవును సూర్యుడు శోషింప జేస్తాడే తప్ప, వికసింపజేయడు) అని చెప్పబడింది కదా !

**36. విల్లార్ మణి కొழிక్కుమ్ వేఙ్గడప్పొఱుప్పు ముదల్,**
**శెల్లార్ పొழిల్ శూழ் తిరుప్పదిగళ్, - ఎల్లామ్,**
**మరుళా మిరుళోడ మత్తగత్తు త్తన్దాళ్,**
**అరుళాలే వైత్త అవర్**

విల్ ఆర్ = తేజస్సు నిండుగా కల, మణి = రత్నాలను, కొழிక్కుమ్ = పోగు చేసే, వేఙ్గడమ్ = తిరువేంగడమనే, పొఱుప్పు ముదల్ = అందమైన పర్వతం మొదలైన, శెల్లార్ = మేఘాలు వచ్చి వాలే, పొழிల్ శూழ் = తోటలచే చుట్టబడి ఉండే, తిరుప్పదికళ్ ఎల్లామ్ = దివ్యదేశాలన్నీ, మరుళామ్ ఇరుళ్ = అజ్ఞానమనే చీకటి, ఓడ= చాలా తొందరగా తొలగిపోయేటట్లుగా, మత్తకత్తు = (శిష్యుని) శిరస్సుపై, తన్ తాళ్ = తన శ్రీచరణాలను, అరుళాలే = తన నిర్హేతుక కృపతో, వైత్త = పెట్టిన, అవర్ = ఆ అచార్యులే.

మిక్కిలి ప్రకాశాన్ని కల రత్నాలు చేరే చోటు అయిన వేంకటాచలం మొదలుగా గల కాలమేఘాలు సంచరించే దివ్యదేశాలు అన్నీ – అజ్ఞానాంధకారం తీరేటట్లుగా తలపై తన శ్రీచరణాలను పెట్టిన ఆచార్యుడే. (ఆచార్యుడే సర్వస్వం– అని భావం).

ముప్పత్తాఱామ్పాట్టు :- అవతారికై - సచ్ఛిష్యనాయ్, సదాచార్య ప్రేమముడైయవనా యిరుక్కు మవనుక్కు సకలదివ్యదేశఙ్గళుమ్ తన్నాచార్యనే- ఎన్గిఱార్.



వ్యాఖ్యానమ్ :- (విల్లార్ మణి కొழிక్కుమ్)- తేజస్సుమిక్కిరున్దుళ్ళ రత్నఙ్గళై త్తిరువరు విగళానవై కొழிత్తేఱానిఱ్కుమ్. విల్లావదు - తేజస్సు, ఆర్దల్ - మిగుది. "పన్మణి నీరోడు పొరుదురుళుమ్ కానముడైయ వేఙ్గడమితే".

(వేఙ్గడప్పొఱుప్పుముదల్) - తిరువేఙ్గడ మెన్గిఱ తిరునామత్తైయుడైత్తాయ్, సర్వస్పృహణీయమాన తిరుమలై తొడక్కమాయుళ్ళ.

(శెల్లార్ పొழிల్ శూழ்)- ఉయరత్తిన్ అతిశయత్తాలే మేఘఙ్గళ్ వన్దు పడియుమ్బడి యిరుక్కుమ్ పొழிల్గళాల్ శూழ்ప్పట్టిరుక్కిఱ. శెల్ - మేఘమ్. ఆర్దల్ - పడిదల్.

(తిరుప్పదిగళెల్లామ్)- ఉగన్దరుళిన నిలఙ్గళాన దివ్యదేశఙ్గళెల్లామ్.

(మరుళా మిరుళోడ)- అజ్ఞానాంధకారమానదు అతిశీఘ్రమాగ ప్పోమ్బడి యాగ.

(మత్తగత్తు త్తన్దాళ్ అరుళాలే వైత్తవర్) - శిష్యన్ శిరస్సిలే తమ్ముడైయ తిరువడిగళై హేత్వంతరఙ్గళాలన్ఱిక్కే, కృపైయాలే వైత్తరుళిన ఆచార్యరాన అవర్ - ఎన్దై. అర్చాస్థలఙ్గళై చ్చొన్న ఇదు, పరవ్యూహాది స్థలఙ్గళుక్కెల్లామ్ ఉపలక్షణమ్. పరవ్యూహాది పంచస్థలముమ్ ఆచార్యనే ఎన్ఱిరుక్కక్కడవన్ ఎన్నుమత్తై "పొట్టుక్కేట్కు మిడమ్" ఎన్దు తుడఙ్గి పిళ్ళైలోకాచార్యర్ అరుళిచ్చెయ్దారితే. "యేనైవ గురుణా యస్య న్యాసవిద్యా ప్రదీయతే, తస్య వైకుంఠదుగ్దాదుబ్ధి ద్వారకా స్సర్వ ఏవ సః" ఎన్గిఱ వచనమ్ ఇదుక్కు సంవాదమాగ అనుసంధేయమ్.

ముప్పై ఆరవ పాశురం :- అవతారిక : సచ్ఛిష్యుడై, సదాచార్యుని పట్ల భక్తిని కలవానికి అన్ని దివ్యదేశాలు ఆ ఆచార్యుడే- అని అంటున్నారు.

వ్యాఖ్యానం :- (విల్లార్ మణి కొழிక్కుమ్) - కాంతిని మిక్కిలిగా కల్గిన రత్నాలను శ్రీవేంకటాద్రిపై ఉండే కొండవాగులు గుంపులు గుంపులుగా కొట్టుకొనివస్తాయి. "విల్"- అనే పదం ఇక్కడ కాంతిని తెల్పుతుంది. "ఆర్తల్" అంటే -మిక్కిలి- అని అర్థం. "నన్ మణివణ్ణనూర్ ఆళియుమ్ కోళరియుమ్

**పొన్మణి ముగ్ఱముమ్ పూమరముమ్, వన్మణినీరొడు పొరుదురుళుమ్ కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడమ్”** (నాన్ముకన్ తిరు-47) కదా!

**(శెల్లార్ పొఴిల్ శూఴ్)**- మిక్కిలి ఎత్తుగా ఉన్నందున మేఘాలు వచ్చి నిలచే చోటు అయిన ఉద్యానవనాలను చుట్టూ కల్గిన. **“శెల్”** -అంటే మేఘం. **“ఆర్తల్”** అంటే- వచ్చి వాలడం.

**(తిరుప్పదికళెల్లామ్)**- భగవంతుడు వేంచేసి ఉండే దివ్యదేశాలు అన్నీ.

**(మరుళామ్ ఇరుళోడే)** - జ్ఞానం లేకపోవడమనే తమస్సు మిక్కిలి త్వరగా తొలగిపోయే రీతిలో,

**(మత్తకత్తు త్తనన్తాళ్ అరుళాలే వైత్తవర్)**- శిష్యుని తలపై తమ శ్రీచరణాలను, ఆ శిష్యుడు సమర్పించే ధనం మొదలైనవానివల్ల కాకుండా, కేవలం కృపతో పెట్టిన సదాచార్యుడు- అని భావం. ఇక్కడ దివ్యదేశాలను గూర్చి ప్రస్తావించడం పర-వ్యూహ-విభవ- అంతర్యామి- అనే భగవానుడు వేంచేసి ఉండే మిగిలిన సన్నివేశాలన్నిటినీ ఉపలక్షణ రీతిలో తెల్పుతుంది- పరం, వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చ- అనే అయిదు చోట్లు ఆచార్యుడే- అని శిష్యుడు భావించాలి- అనే విషయాన్ని **“పాట్టు క్కేట్టు మిడముమ్, కూప్పీడు కేట్కు మిడముమ్, కుదిత్త విడముమ్, వళైత్త విడముమ్, ఊట్టు మిడముమ్ ఎల్లామ్ వకుత్తమిడమే ఎన్ఱిరుక్కక్కడవన్” (శ్రీవచనభూషణమ్-453)** (స్తుతిని వినేచోటు, పిలుపును వినే చోటు, కిందకు దుమికి అవతరించే చోటు, అంతర్యామిగా అంతటా వ్యాపించిన చోటు, ఆరాధనను స్వీకరించే చోటు- (పరత్వాదిపంచకం) అన్నీ ఆచార్యుడే అని భావించాలి). అని శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు పలికారు కదా! **“యేనైవ గురుణా యస్య న్యాసవిద్యా ప్రదీయతే, తస్య వైకుంఠదుగ్ధాబ్ధి ద్వారకా స్సర్వ ఏవ సః”** (ఏ ఆచార్యునిచే ఒక శిష్యునకు శరణాగతి విద్య ఉపదేశింపబడిందో, ఆ శిష్యునకు ఆ ఆచార్యుడే శ్రీవైకుంఠం క్షీరాబ్ధి, ద్వారక మొదలైన అన్ని దివ్యదేశాలు) అనే వచనం దీనికి ప్రమాణాలుగా అనుసంధేయం.



**37. పొరుళుమ్ ముయిరు ముడమ్బుమ్, పుగలుమ్**
**తెరుళుమ్ కుణముమ్ శెయలుమ్, – అరుళ్ పురిన్ద**
**తన్నారియన్ పొరుట్టా చ్చఙ్గఱ్పిత్తైయ్బవర్ నెఞ్జు,**
**ఎన్నాళు మాలుక్కిడమ్.**

పొరుళుమ్ = తన సంపద, ఉయిరుమ్ = తన ప్రాణం, ఉడమ్బుమ్ = తన శరీరం, పుకలుమ్ = తన గృహం, తెరుళుమ్ = తన జ్ఞానం, కుణముమ్ = తన గుణాలు, శెయలుమ్ = తన కృత్యాలు - అనే అన్నీ, అరుళ్ పురిన్ద = తనకు అనుగ్రహించిన, తన్ ఆశారియన్ పొరుట్టా = తన ఆచార్యునికోసం - అని, శఙ్గఱ్పమ్ శెయ్పవర్ = సంకల్పం చేసేవారి, నెఞ్జు = మనస్సు, ఎన్నాళుమ్= అన్ని సమయాలలో, మాలుక్కుమ్ = సర్వేశ్వరునకు, ఇడమ్ = ప్రీతితో నివసించే చోటు.

సంపద, ప్రాణం, శరీరం, గృహం, జ్ఞానం శమదమాది గుణాలు, చేసే కార్యాలు – అన్నీ తనపట్ల కృపను చూపిన ఆచార్యునికోసమే అని సంకల్పించే సచ్ఛిష్యుల మనస్సు శ్రియఃపతికి నిత్యవాసస్థానం.

ముప్పత్తేఴామ్పాట్టు :- అవతారికై : అర్థ-ప్రాణ- శరీరాదిగళెల్లామ్ ఆచార్యశేషమాగ అనుసంధిత్తిరుక్కుమవర్గళ్ నెఞ్జు సర్వేశ్వరనుక్కు సర్వకాలముమ్ వాసస్థానమ్ - ఎన్గిఱార్.

వ్యాఖ్యానమ్ : **(పొరుళుమ్)- తనక్కుణ్డాన అర్థముమ్,**

**(ఉయిరుమ్)- తన్నుడైయ ప్రాణనుమ్,**

**(ఉడమ్బుమ్)- తన్నుడైయ శరీరముమ్,**

**(పుగఴుమ్)- తన్నుడైయ గృహముమ్,**

**(తెరుళుమ్)- తన్నుడైయ జ్ఞానముమ్,**

**(కుణముమ్)- తన్నుడైయ శమాదిగుణఙ్గళుమ్.**

**(శెయలుమ్)- తన్నుడైయ ప్రవృత్తిగళుమ్. ఇవై ఎల్లావఱ్ఱైయుమ్.**

**(అరుళ్ పురిన్ద తన్నారియన్ పొరుట్టాయ్)** - ఒరు హేతువన్ఱిక్కే యిరుక్క చ్చెయ్‌దే, కృపైయై ప్పణ్ణి తన్నై అజ్గీకరిత్త తన్నుడైయ ఆచార్యన్ పొరుట్టాగ. తచ్ఛేషమాగ - ఎన్ఱపడి.

**(శజ్గఱ్పుశ్చెయ్‌బవర్ నెఞ్జు)** - సంకల్పమ్ పణ్ణుమవర్‌గళ్ నెఞ్జు. అప్పడి సజ్కల్పిత్తిరుక్కుమవర్‌గళుడైయ హృదయ మెన్ఱపడి.

**(ఎన్నాళు మాలుక్కిడమ్)** - ఎల్లాక్కాలముమ్ సర్వేశ్వరనుక్కు వాసస్థానమ్. ఇవన్ సకలముమ్ తన్నాచార్యనుక్కు శేషమెన్ఱు సంకల్పిత్తు, "తేవు మఱ్ఱఱిఏన్" ఎన్ఱిరుక్క, అవన్ ఇవనుడైయ హృదయత్తై త్తానాదరిత్తు క్కొణ్డిరుక్కుమాయిఱ్ఱు. "శరీరం వసు విజ్ఞానం వాసః కర్మ గుణానసూన్, గుర్వర్థం ధారయేద్యస్తు స శిష్యో నేతరః స్మృతః, గుర్వర్థం స్వాత్మనః పుంసః కృతజ్ఞస్య మహాత్మనః, సుప్రసన్న స్సదా విష్ణు ర్హృది తస్య విరాజతే" ఎన్ఱు జయసంహితై యిలే, శ్రీవరాహనాయనార్ అరుళిచ్చెయ్‌ద వచనమ్ ఇదుక్కు సంవాదమాగ అనుసంధేయమ్.

ముప్పై ఏడవ పాశురం :- అవతారిక : సంపద (ధనం) ప్రాణం, దేహం- మొదలైనవి అన్నీ ఆచార్యుని కోసమే- అని తలచి వర్తించేవారి మనస్సు, సర్వేశ్వరునకు అన్ని కాలాలలో నివాసస్థానమై ఉంటుంది- అని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం :- **(పొరుళుమ్)** - తన సంపద,

**(ఉయిరుమ్)** -తన ప్రాణం, **(ఉడలుమ్)**- తన దేహం,

**(పుకఴుమ్)**- తాను నివసించే గృహం,

**(తెరుళుమ్)** - తన జ్ఞానం

**(గుణముమ్)**- తన పాండిత్యం, నమ్రత మొదలైన గుణాలు,

**(శెయలుమ్)**- తాను చేసే పనులు - అనే ఇవి అన్నీ,



**(అరుళ్ పురిన్ద తన్ ఆశారియన్ పొరుట్టా)** - ఏ హేతువు లేకుండానే (సహజంగానే కృపతో) మంత్రోపదేశం మొదలైనవానిని చేసి, తనని శిష్యునిగా పరిగ్రహించిన తన ఆచార్యునికోసమే- అని అర్థం. అవి అతనికి చెందినవి అని తలచి- అని భావం.

**(శజ్గఱ్పమ్ శెయ్‌పవర్ నెఞ్జు)**- అని భావించేవారి మనస్సు. ఆ విధంగా తలచేవారి హృదయం- అని అర్థం.

**(ఎన్నాళుమ్ మాలుక్కు ఇడమ్)**- అన్ని కాలాలలోను సర్వేశ్వరునకు నివాసస్థానమై ఉంటుంది. ఇతడు తన సమస్తాన్ని తన ఆచార్యునకే చెందినది. అని, "తేవు మఱ్ఱఱిఏన్" (కణ్ణినుణ్ శిఱుత్తామ్బు-2) (ఇంకొక దైవాన్ని తెలియను) అని ఉండాలి. ఆ విధంగా ఉంటే, సర్వేశ్వరుడు ఇతని హృదయాన్ని అభిమానించి, తన నివాసస్థానంగా చేసికొంటాడు - అని భావం. "శరీరం వసు విజ్ఞానం వాసః కర్మ గుణానసూన్, గుర్వర్థం ధారయేద్యస్తు స శిష్యో నేతరః స్మృతః, గుర్వర్థం స్వాత్మనః పుంసః కృతజ్ఞస్య మహాత్మనః, సుప్రసన్నః సదా విష్ణుః హృది తస్య విరాజతే" (జయాఖ్యసంహిత) (శరీరం, ధానం, జ్ఞానం, నివాసం చేసే కర్మలు, గుణాలు, ప్రాణం- అనే అన్నీ ఆచార్యునికోసమేనని ఎవడు కలిగి ఉంటాడో, అతడే శిష్యుడు. అన్యుడు శిష్యుడు కాడు- అని శాస్త్రాలు పల్కుతున్నాయి. గురువు కోసంగా తనను నివేదించుకొని, ఉపయోగపడేవాడై, చేసిన మేలును మరువనివాడై, అందువల్లనే, గొప్పవాడై ఉండే శిష్యుని పట్ల చాలా ప్రీతిని కలవాడై భగవంతుడు అతని మనస్సులో ప్రకాశిస్తాడు) అని శ్రీపాంచరాత్రానికి చెందిన జయాఖ్యసంహితలో శ్రీవరాహస్వామిపల్కిన సూక్తి. ఈ అర్థానికి ప్రమాణంగా అనుసంధేయం.

**38. తేనార్ కమలత్తిరుమామగళ్ కొఴునన్,**
**తానే కురువాగి త్తన్నరుళాల్, - మానిదర్క్కాయ్**
**ఇన్నిలత్తే తోన్ఱుదలాల్, యార్క్కు మవన్ తాళిణైయై**
**ఉన్నువదే శాల వుఱుమ్**

తేన్ ఆర్ = తేనె నిండిన, కమలమ్ = తామరపూవును నివాసంగా చేసికొన్న తిరు మామకళ్ = లక్ష్మీదేవి యొక్క కొ*ఝు*నన్ = వల్లభుడైన సర్వేశ్వరుడు, తానే=పరమాత్మ అయినతానే, కురు ఆకి = మానవరూపాన్ని ధరించిన ఆచార్యుడై తన్ అరుళాల్ = తన కృపతో, మానిడర్క్కాయ్ = మానవులకోసం, ఇన్నిలత్తే = వారు నివసించే ఈలోకంలో, తోన్టుదలాల్ = అవతరించినందువల్ల, యార్క్కుమ్ = అందఱు జీవులు, అవన్ తాళ్ ఇణైయై = ఆ ఆచార్యుని శ్రీచరణాలను, ఉన్నువదే= పొందదగినవి - అని పల్కడమే, శాల ఉఱుమ్ = స్వరూపానికి చాలా తగినది.

తేనె నిండుగా ఉండే తామరపూవులో అవతరించిన లక్ష్మీదేవికి వల్లభుడైన భగవానుడే తన కృపతో మనుషరూపి అయిన ఆచార్యునిగా మనవంటివారికోసం ఈ భూలోకంలో అవతరించినందున, ఆత్మలన్నిటికి ఆ ఆచార్యుని శ్రీచరణాలు రెండిటిని అనుసంధించడమే చాలా తగినది.

ముప్పత్తెట్టామ్‌పాట్టు :- అవతారికై - ఆచార్యవైభవత్తై బహువిధమాగ అరుళిచ్చెయ్‌దార్, కీ*ఝ్*. అదెల్లామ్ తగు మెన్నైక్కాగ ఆచార్యన్ భగవదవతార మెన్నుమత్తై ప్రకాశిప్పిత్తు ఇప్పడియిరుక్కైయాలే ఎల్లార్క్కుమ్ అవర్ తిరువడిగళై అనుసంధిక్కుమదే మిగవు మనురూపమెన్టు ఇవ్వర్థత్తై నిగమిక్కిఱార్.

వ్యాఖ్యానమ్ :- (తేనార్ కమలత్తిరుమామగళ్ కొ*ఝు*నన్)- తన్స్పోట్టై స్పర్శత్తాలే ఎప్పోదు మొక్క శెవ్వి పె*ఱ్ఱి*రుక్కైయాలే మధుసమృద్ధి మాఱాద తామరైప్పూవై వాసస్థాన మాగ ఉడైయళాయ్, శ్రీ- యెన్టు తిరునామమా యిరుక్కుమ్ పెరియపిరాట్టి యారుక్కు వల్లభనానవన్.

(తానే)- శ్రియఃపతి యాగైయాలే సర్వాధికనానతానే,

(కురువాగి)- దివ్యరూపత్తై మఱైత్తు మనుష్యరూపజ్గొణ్డు ఆచార్యనాయ్. ఇదుక్కడి ఎన్ ? ఎన్నిల్.

(తన్నరుళాల్)- తన్నుడైయ కృపైయాలే. హేత్వంతరమిల్లై -ఎన్టై. ఇప్పడి అవథరిక్కిఱదుదాన్ ఆరుక్కాగ ఎన్నిల్.



(మానిడర్క్కాయ్) - శాస్త్రవశ్యమాన మనుష్యజన్మత్తిలే పిఱన్దు, ఉపదేశాది గళాలే తిరుత్తినాల్ తిరున్దు ఉజ్జీవిక్కైక్కు యోగ్యరాన ఆత్మాక్కళుక్కాక.

(ఇన్నిలత్తే తోన్టుదలాల్) - ప్రజై వి*ఝు*న్ద కిణ*ఱ్ఱి*లే ఒక్క కుతిక్కుమ్ తాయైప్పోలే, ఇవర్గళ్ సంసారార్ణవమగ్నరాయ్ కిడక్కిఱ ఇన్ద భూమియిలే అవతరిక్కైయాల్.

(యార్క్కుమ్)- వర్ణభేదత్తాలుమ్, ఆశ్రమభేదత్తాలుమ్, స్త్రీపురుష భేదత్తాలుమ్, పలవగై ప్పట్టిరుక్కిఱ ఆత్మాక్కళ్ ఎల్లార్క్కుమ్.

(అవన్టాళిణైయై యున్నువదే) - శేషియాయ్, శరణ్యానాయ్, ప్రాప్తనా యిరుక్కిఱ అవనుడైయ తిరువడిగళ్ ఇరణ్డైయు ముద్దేశ్యమాగవుమ్, ప్రాప్యమాగవుమ్, ప్రాపకమాగవుమ్ అనుసంధిత్తిరుక్కుమదే. అవధారణత్తాలే ఇదొ*ఝి*య మ*ఱ్ఱొ*న్టు వేణ్డా - ఎన్టై.

(శాల వుఱుమ్)- మిగవు ముఱుమ్. ఉఱుగై - శేరుగై. ఇత్తాల్- మిగవుమ్ స్వరూపత్తుక్కు అనురూపమెన్టై. "సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా, తస్మాద్భక్తిర్గురౌ కార్యా సంసారభయభీరుణా" ఎన్టు జయాఖ్యసంహితైయిలే శాణ్డిల్యన్ శొన్న వచనమ్ ఇప్పాట్టిల్ శొన్న అర్థత్తుక్కు సంవాదమాగ అనుసంధేయమ్.

ముప్పై ఎనిమిదవ పాశురం :- అవతారిక : ఆచార్యుని గొప్పతనాన్ని గడచిన పాశురాలలో పలు విధాలుగా పలికారు. ఆ మహిమలన్నీ ఆచార్యునకు తగినవి - అని అనడంకోసం "ఆచార్యుడు భగవంతుని అవతారమే" అనే దానిని వ్యక్తం చేసి, ఆ విధంగా ఉన్నందున అందఱికి అతని శ్రీచరణాలను సర్వస్వంగా భావించడమే చాలా తగినది- అని పల్కి ఈ అర్థాన్ని పూర్తి చేస్తున్నారు, ఈ పాశురంలో.

వ్యాఖ్యానం : (తేనార్కమల త్తిరుమామకళ్ కొ*ఝు*నన్) తన స్పర్శతో ఎల్లప్పుడు చిగురిస్తున్నందున మధుప్రవాహం ప్రవహించే తామరపూవును

నివాసంగా కల్గినదై, శ్రీదేవి అనే తిరునామాన్ని పొందిన లక్ష్మీదేవికి ప్రియ వల్లభుడు.

**(తానే)**- లక్ష్మీనాథుడైనందున అందరికంటే గొప్పవాడైన తానే,

**(కురువాకి)** - తన పరమాత్మరూపాన్ని మఱుగుపరుచుకొని, మానవ రూపంలో ఆచార్యుడై - అని అర్థం. ఈ విధంగా మానవరూపాన్ని ధరించి ఆచార్యుడై అవతరించడానికి ఏమి కారణం? అంటే,

**(తన్నరుళాల్)**- తన కృపతో తప్ప వేఱు కారణం ఏమీ లేదని భావం. ఈ రీతిలో అవతరించడం ఎవరికోసం? అని అంటే,

**(మానిడర్క్కాయ్)**- శాస్త్రాలకు కట్టుబడి ఉండే మానవ జన్మలో పుట్టి ఉపదేశాదులతో సంస్కరింపబడగా మాఱి, ఉజ్జీవనాన్ని పొందడానికి యోగ్యతను కల ఆత్మకోసం- అని భావం.

**(ఇన్నిలత్తే తోన్డుదలాల్)**- బిడ్డ తప్పిదంవల్ల పడిపోయిన బావిలో దానితోపాటుగా అందులోకి దూకి, ఆ బిడ్డను రక్షించే తల్లివలె, జీవులు సంసారసముద్రంలో మునిగి ఉండే ఈ లోకంలో అవతరించినందున,

**(యార్క్కుమ్)**- బ్రాహ్మణ- క్షత్రియ- వైశ్య- శూద్రులనే వర్ణాల భేదంతోను, బ్రహ్మచారి- గృహస్థుడు- వానప్రస్థుడు- సన్న్యాసి- అనే ఆశ్రమభేదంతోను, ఆడ-మగ అను భేదంతోను పలు రీతులలో ఉండే ఆత్మలన్నిటికి,

**(అవన్తాళిణైయే ఉన్నువతే)**- కైంకర్యాన్ని స్వీకరించ దగినవాడై శరణు పొందదగినవాడై (శరణ్యుడై), ప్రాప్యుడై ఉండే అతని (భగవంతుని) రెండు శ్రీచరణాలను ఉద్దేశ్యంగా, ప్రాప్యంగా, ప్రాపకంగా తలచి ఉండడమే - అని అర్థం. **"తాళిణైయే"** అనే ప్రయోగంలోని **"ఏవ"** కారం చేత ఇది తప్ప వేఱు ఏదీ అక్కఱ లేదు - అనే భావం వ్యక్తమవుతుంది.

**(శాల ఉఱుమ్)** - చాలా తగినదై ఉంటుంది- అని భావం. **"ఉఱుకై"**- చేరి ఉండడం - తగినదై ఉండడం. ఈ పదం ఇక్కడ స్వరూపానికి తగి



ఉండడాన్ని తెల్పుతుంది. అందువల్ల ఈ విధంగా భావించడమే స్వరూపానికి చాలా తగినదని భావం. **"సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనుమ్, మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా, తస్మాత్ భక్తిః గురౌ కార్యా సంసారభయభీరుణా"** (దేవుడైన శ్రీమన్నారాయణుడే స్వయంగా మానవ రూపాన్ని ధరించి, సంసారమనే సముద్రంలో మునిగి ఉండే లోకులను శాస్త్రమనే చేతితో కరుణతో ఉద్ధరిస్తున్నాడు. అందువల్ల, సంసారంపట్ల భయం కల్గినవాడు గురువు విషయంలో భక్తిని కల్గి ఉండాలి) అనే జయాఖ్యసంహితలో శాండిల్యుడు పల్కిన వచనాన్ని ఈ పాశురంలో పల్కిన అర్థానికి ప్రమాణంగా అను సంధించాలి.

**39. అలకై ములై శువైత్తార్క్కు అన్బరడిక్కన్బర్**
**తిలద మెన త్తిరివార్తమ్మై, - ఉలగర్ పழி**
**తూற்றில் తుది యాగుమ్, తూற்றாదవర్ ఇవరై**
**పోற்றிల్ అదు పున్మైయే యామ్**

అలకై ములై = తల్లి రూపాన్ని ధరించి వచ్చిన పిశాచి పూతనయొక్క స్తన్యాన్ని శువైత్తార్క్కు = ఆమె ప్రాణాలతోపాటు ఆరగించిన శ్రీకృష్ణుని పట్ల, అన్బర్ అడిక్కు= భక్తిని (ప్రేమను) కలవారి శ్రీచరణాలలో, అన్బర్ = ఆదరాన్ని కలవారై, తిలకమ్ ఎన= లోకానికే తిలకం అని ప్రశంసించేటట్లు, తిరివార్తమ్మై= ఉజ్జీవించే మహా పురుషులను, ఉలకర్ = లోకంలోని జనులు, పழி తూற்றிల్ = నిందా వాక్యాలు పల్కితే, తుతి ఆకుమ్ = అదేవారి స్తుతికాగలదు, అవర్ = ఆ పామరజనులు, తూற்றாదు = ఆ విధంగా దూషించకుండా, ఇవరై = దాసులపట్ల ప్రేమను కలవారిని, పోற்றிల్ = పొగడితే, అది = ఆ పొగడ్త, పున్మైయే ఆమ్ = నిందయే కాగలదు.

పూతన స్తన్యాన్ని ఆస్వాదించిన భగవానునిపట్ల ప్రేమను కలవారి శ్రీచరణాలలో ప్రేమను కల్గినవారు, లోకానికి తిలకంవంటివారు – అని భావించి ఈ లోకంలో సంచరించే మహాత్ములను, లౌకికులైన పామరులు దూషిస్తే, అదే

వారికి స్తుతిగా పరిణమిస్తుంది. ఆ లౌకికులు ఆ విధంగా దూషించకుండా పొగడితే, ఆ స్తుతి దూషణమే అవుతుంది.

ముప్పత్తొన్బదామ్‌పాట్టు :- అవతారికై - ఇవ్వాచార్యవైభవ మివ్విషయత్తిల్ అన్ఱి తీర్న్దునిఱ్పార్ ఏన్ఱ మఱివార్ విశేషజ్ఞరెన్ఱో! అదఱియాద లౌకికర్ భగవ ద్విషయత్తిలుఱ్గాట్టిల్ ఇవ్విషయమే ఉద్దేశ్యమెన్ఱు పన్ఱి త్తిరియానిన్ఱారెన్ఱు పఴి తూన్ఱువర్ గళాగిలో! ఎన్న, ఇదు భగవద్విషయత్తిల్ ఊన్ఱినిఱ్పార్‌క్కెల్లార్ క్కుమ్ ఒక్కుమితే - ఎన్ఱు పార్‌త్తు, తద్విషయత్తిలుఱ్గాట్టిల్, తదీయవిషయత్తి లూన్ఱి నిఱ్పారేన్ఱత్తై చ్చొల్లి, ఇప్పడి నిఱ్కుమధికారిగళుక్కు లౌకికర్ పణ్ణుమ్ నిన్దైయుమ్ స్తుతియుమ్, స్తుతి నిన్దైయుమాయ్ విడు మెన్గిఱార్.

వ్యాఖ్యానమ్ :- (అలగై ములై శువైత్తార్‌క్కు) - అలగై ఎన్ఱు - పేయ్‌క్కు ప్పేర్. "పెన్ఱ తాయ్‌ప్పోల్ వన్ద పేయ్‌చ్చి" ఎన్గిఱపడియే తన్ వడివై మఱైత్తు, తాయ్ వడివై క్కొణ్డు వన్ద పేయ్‌చ్చియుడైయ ములైయై ప్రాణసహితమాగ ప్పణైయఱ చ్చువైత్తవనుక్కు.

(అన్బరడిక్కన్బర్) - "స్తన్యం తద్విషసంమిశ్రం రస్య మాసీజ్జగద్గురోః" ఎన్ఱుమ్, "విడప్పాలముదా వముదు శెయ్‌దిట్ట మాయన్" ఎన్ఱుమ్ శొల్లుగిఱపడియే, అవళ్ కైయిల్ అగప్పడామల్, అన్ద విషప్పాలే యముదాక్కి యముదు శెయ్‌దు, జగత్తుక్కు వేర్ పన్ఱాన తన్నై నోక్కి త్తన్దవన్ -ఎన్ఱు అన్ద గుణత్తుక్కు త్తోన్ఱి, అవన్ పక్కల్ ప్రేమయుక్తరా యిరుక్కుమవర్‌గళ్‌తిరువడిగళిల్ ప్రేమయుక్తరా యిరుక్కుమవర్‌గళ్.

(తిలదమెన త్తిరివార్‌తమ్మై)- ఇప్పడి భాగవతవిషయ ప్రేమయుక్తరాయ్, లోకత్తుక్కు ఇవర్‌గళొరు తిలక మెన్ఱు విశేషజ్ఞర్ శ్లాఘిక్కుమ్బడి తిరియుమ్ మహాత్మాక్కళై. అన్ఱిక్కే, అన్బరడిక్కన్బర్ - ఇవర్‌గళ్ తిలకభూతరెన్ఱు అఱివుడై యార్ కొణ్డాడుమ్బడి త్తిరియుమ్ పెరియోర్‌గళ్- ఎన్నవుమామ్.

(ఉలగర్ తూన్ఱిల్ తుది యాగుమ్)- ఇప్పడి యిరుక్కుమ్ అధికారిగళై వర్ణాశ్రమాది విశేషజ్ఞళొన్ఱుమ్ పారామల్ భాగవతరెన్గిఱ మాత్రమే పన్ఱాశాగ



క్కొణ్డు, భగవద్విషయన్దన్నిలుఱ్గాట్టిల్ ఇవర్‌గళే ఉద్దేశ్యరెన్ఱు నినైత్తు అనువర్తిత్తు తిరియానిన్ఱార్‌గళ్ - ఎన్ఱు లౌకికరానవర్‌గళ్ పఴితూన్ఱిల్, అదివర్‌గళ్ గుణ ప్రకాశకమాగైయాలే స్తోత్రమాయ్ విడుమ్.

(తూన్ఱాదవర్ ఇవరై ప్పోన్ఱిల్ అదు పున్మైయేయామ్)- ఇప్పడి పఴి తూన్ఱాదే లౌకికరానవర్‌గళ్ కీఴ్‌చ్చొన్న అన్ద అధికారిగళై లోకసంగ్రహాది గళుక్కాగ మేలెఴుచ్చెయ్‌దు కొణ్డుపోరుమ్ ఆచార్యర్గళై క్కణ్డు, అవై యడియాగ నల్లవర్‌గళెన్ఱు పుగఴ్‌ల్, అదు ఇవర్‌గళధికారత్తుక్కు చ్చేరామై యాలే, పున్మైయే యాయ్‌విడు మెన్గై. పున్మై - పొల్లాఙ్గు. నిన్దై - ఎన్ఱపడి. "వ్యాస విద్యైకనిష్ఠానాం వైష్ణవానాం మహాత్మనామ్, ప్రాకృతాభిస్తుతి ర్నిన్దా నిన్దా స్తుతి రితి స్మృతా" ఎన్నక్కడవదిఱే.

ముప్పైతొమ్మిదవ పాశురం :- అవతారిక : ఇటువంటి ఆచార్యుల వైభవాన్ని తెలిసి, వారికే శేషభూతులై ఉండేవారి గొప్పతనాన్ని తెలియడం అనేది గొప్ప జ్ఞానులకే కదా సాధ్యం. దానిని తెలియని పామరులు "భగవానునికంటే ఆచార్యుడే ముఖ్యమైనవాడు'' అని అతనిని ఆశ్రయించి వర్తించేవారే, వీరు - అని నిందించేటట్లయితే ఏమి చేయాలి? అనే ప్రశ్న రాగా, "ఈ రీతిలో నిందించడం అనేది లోకం విషయంలో గౌరవం (ఆసక్తి) లేకుండా, భగవంతుని పట్ల ఆదరాన్ని కలవారికి కూడా సాధారణం కనుక, భగవంతునికంటే అతని భక్తుల విషయంలో అభినివేశాన్ని పొందినవారి గౌరవాన్నిగూర్చి పల్కుతూ, ఈ విధంగా ఉండేవారిని గూర్చి లోకులు పలికే నిందావాక్యమే స్తుతి అవుతుంది. వారిని స్తుతించడమే నిందగా అవుతుంది- అని ఈ పాశురంలో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (అలకై ములై శువైత్తాఱ్కు)- "అలకై" అనే - పదం పిశాచిని తెల్పుతుంది. "పెన్ఱతాయ్ పోల్ వన్ద పేయ్‌చ్చి" (పెరియతిరుమొఴి-1-3-1) అనే రీతిలో తనకు సహజమైన పిశాచి రూపాన్ని మఱుగు పరచుకొని, తల్లిరూపాన్ని ఆరోపించుకొని వచ్చిన పిశాచి పూతనయొక్క స్తన్యాన్ని, ఆమె ప్రాణాలతో పాటు తాగినవానికి.

(అన్బరడిక్కన్బర్) - "తస్యాః స్తన్యం పపౌ కృష్ణః ప్రాణైః సహ ననాద చ, స్తన్యం తద్విషయ సంమిశ్రం రస్యమాసీత్ జగద్గురోః" (హరివంశం-35) (ఆ పూతనయొక్క స్తన్యాన్ని ఆమె ప్రాణంతో పాటు శ్రీకృష్ణుడు పానం చేశాడు. ఆనందంతో గొప్ప సింహనాదాన్ని కూడా చేశాడు. లోకనాథుడైన అతనికి విషం కలిసిన ఆ పాలు భోగ్యమైనది) అని, "విడప్పాలముదా అముదు శెయ్‌దిట్ట మాయన్" (తిరువాయ్-1-5-9) అని పల్కినట్లుగా పిశాచి అయిన ఆమెచేతిలో చిక్కుకోకుండా, ఆ విషక్షీరాన్నే అమృతం చేసి, తాగి, లోకానికి మూలకారణమైన తనను రక్షించుకొని, ఇచ్చినవాడు- అని ఆ గుణంలో ఆసక్తులై, ఆ స్వామిపట్ల భక్తిని కలవారి శ్రీచరణాలలో భక్తిని కలవారై ఉండేవారు.

(తిలదమెన త్తిరివార్‌తమ్మై) -ఈ విధంగా భగవంతునిపట్ల భక్తిని కల్గిన వారి విషయంలో భక్తిని కలవారై ఉండేవారు. "లోకానికి వీరు ఒక తిలకంవలె ఆభరణమై ఉండేవారు'' అని భక్తులు కీర్తించేటట్లుగా ఉజ్జీవించే మహాపురుషులను - అని అర్థం. లేక, భగవంతునిపట్ల భక్తిని కలవారి విషయంలో భక్తిని కన్గినవారై ఉండేవారికి - వీరు తిలకంవలె ఉండేవారు- అని జ్ఞానులు పొగడేటట్లుగా ఉజ్జీవించే గొప్పవారు - అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు.

(ఉలకర్ పఱి తూఱ్‌ఱిల్ తుదియాకుమ్) - ఈ విధంగా ఉండే గొప్పవారిని వారి వర్ణాశ్రమాదులలోని గొప్పతనాన్ని దేనినీ చూడకుండా, వారు భగవంతుని భక్తులు - అనే దానిని మాత్రమే చూచి, "భగవంతునికంటే వీరే మనకు ముఖ్యులు - అని భావించి, వారికి కైంకర్యం చేసి తిరిగేవారు.'' అని లోకంలోని వారు నిందించేవారైతే, ఆ నింద వారి గుణాలను వ్యక్తం చేసేది కనుక, ఆ నిందావాక్యాలే వారికి స్తుతిగా పరిణమిస్తుంది.

(తూఱ్‌ఱాదు అవర్ ఇవరై ప్పోఱ్‌ఱిల్ అదు పున్మైయేయామ్)- ఈ విధంగా నిందించకుండా, లోకులు పూర్వం తెల్పిన ఆ మహనీయులను, లోకులను చూచి అనువర్తించడంకోసం పైపైన ఆచరించే ఆచారాలను చూచి, తత్కారణంగా "గొప్పవారు, వీరు'' అని వారిని పొగడితే, ఆ పొగడ్త వారి గొప్పతనానికి తగినది కాదు కనుక, అది నిందగానే పరిణమిస్తుంది - అని



భావం. "పున్మై" - అనే పదం చెడ్డను తెల్పుతుంది. ఇక్కడ నింద - అనే అర్థాన్ని ఇస్తుంది. "న్యాసవిద్యైకనిష్ఠానాం వైష్ణవానాం మహాత్మనామ్, ప్రాకృతాభి స్తుతి ర్నిందా నిందా స్తుతి రితి స్మృతా" (శరణాగతివిద్యలో నిష్ఠను కల మహాపురుషులైన వైష్ణవులను పామరజనులు చేసే స్తుతి నిందయే కాగలదు- అని, వారినింద వారి స్తుతియే కాగలదు- అని చెప్పబడుతున్నది) అని తెలుపబడిందికదా!

**40. అల్లిమలర్ప్పావై క్కన్బరడిక్కన్బర్**
**శొల్లు మవిడు శురుది యామ్, - నల్ల**
**పడియామ్ మనునూఱ్కవర్‌శరిదై, పార్వై**
**శెడియార్ వినై త్తొగైక్కు త్తీ**

అల్లి మలర్ ప్పావైక్కు = తామరలో వేంచేసి ఉండే లక్ష్మీదేవి పట్ల, అన్బర్ = అనురాగాన్ని కల భగవానుని, అడిక్కు అన్బర్ = శ్రీచరణాల పట్ల ప్రేమను (భక్తిని), కలవారు, అవిడు శొల్లుమ్ = పలికే వినోద వాక్యాలు సైతం, శురుది ఆమ్ = వేదం వలె స్వీకరించదగినవై ఉంటాయి, అవర్ శరిదై = వారి కృత్యాలు, మనునూఱ్కు = మనుస్మృతికి, నల్ల పడి ఆమ్ = చక్కగా వివరించే వ్యాఖ్యానం వలె కాగలవు, పార్వై= వారి కటాక్షాలు, శెడియార్ = ముళ్ళ పొదలవలె ఉండే, వినై త్తొకైక్కు తీ = కర్మ పరంపరలను దహించే అగ్నివంటివి.

లక్ష్మీపతి అయిన సర్వేశ్వరుని శ్రీచరణాలలో ప్రేమను కల భక్తులు వినోదంగా పలికే మాటలుకూడా వేదంతో సమానం. అటువంటివారి అనుష్ఠానం ధర్మశాస్త్రాలలో గొప్పదైన మనుస్మృతితో ఉపమానం కాగలదు. వారి కటాక్షం ప్రబల పాపరాశి అనే వృక్షాలనుకూడా దహించే దావాగ్ని.

నాల్పదామ్‌పాట్టు :- అవతారికై - ఇప్పడియానాలుమ్ ఇవర్‌గళుడైయ శొల్లుమ్, శెయలుమ్ నాట్టార్‌క్కు ప్పొరున్దామైయాలే, అదు తన్నైయిట్టు ప్పలిక్కులో? ఎన్న, ఇదు ప్రథమ పర్వనిష్ఠర్‌క్కు మొక్కుమితే- ఎన్టు పార్‌త్తు, సామాన్యేన భాగవతర్‌గళుడైయ ఉక్తివృత్తికటాక్షజ్ఞళినుడైయ వైభవత్తై చ్చొల్లి, ఇప్రబంధత్తై నిగమిక్కిఱార్.

వ్యాఖ్యానమ్ :- (అల్లిమలర్ప్పావై క్కన్బరడిక్కన్బర్)- "కోలమలర్ ప్పావైక్కన్బా!" ఎన్ఱు ఇదువే నిరూపకమాగ చ్చొల్లి సంబోధిక్కుమ్బడి త్తామరైప్పూవై యిరుప్పిడ మాగవుడైయ పెరియపిరాట్టి విషయత్తిల్ ప్రేమయుక్తనాయిరుక్కు మీశ్వరన్ తిరువడిగళిల్ ప్రేమమేని రూపకమామ్బడిన యిరుక్కుమ్ భాగవతర్గళ్.

(శొల్లుమవిడు శురుదియామ్) - వినోదమాయ్ చ్చొల్లుమ్ వార్త్తై వేదార్థ మాయిరుక్కైయాలే, అపౌరుషేయమాయ్, నిత్యనిర్దోషమాయ్, ఆప్తతమమా యిరుక్కుమ్ వేదత్తోపాది ప్రమాణమాయ్, ప్పరిగ్రహిక్కలా యిరుక్కుమ్.

(నల్లపడియామ్ మనునూఱ్కవర్ శరిదై)- అవర్గళ్ చరిత్రమానదు ధర్మశాస్త్రజ్గళిల్ తలైయాయ్, సదాచార ప్రతిపాదకమాయిరుక్కుమ్ మానవ శాస్త్రత్తుక్కు, "ఇత్తై క్కొణ్డు ఇదు శొల్లిఱ్ఱు" ఎన్నుమ్బడి నన్ఱాన మూలమా యిరుక్కుమ్. పడియావదు- తన్నైక్కొణ్డు తనక్కు ప్పోలియానదు శెయ్యలా మ్బడి మూలమాయిరుక్కుమదిఱే.

(పార్వై చ్చెడియార్ వినైత్తొగైక్కు త్తీ)- అవర్గళుడైయ కటాక్షమానదు, తూఱుమణ్డి క్కిడక్కిఱ కర్మసమూహత్తుక్కు అగ్నిపోలే, నాశకరమా యిరుక్కు మెన్నై. అదావదు- ఇవర్గళుడైయ కటాక్షమ్ స్వవిషయమానవర్గళ్ కర్మత్తై నిశ్శేషమాగ ప్పోక్కుగైయాలే స్వరూపత్తై ఉజ్జ్వలమాక్కు మెన్నదాయిఱ్ఱు. "వేదశాస్త్రరథారూఢాః జ్ఞానఖడ్గధరా ద్విజాః, క్రీడార్థమపి యద్బ్రూయు స్స ధర్మః పరమో మతః" ఎన్ఱుమ్, "వాసుదేవం ప్రపన్నానాం యాన్యేవ చరితాని వై, తాన్యేవ ధర్మశాస్త్రాణీత్యేవమ్ వేదవిదో విదుః" ఎన్ఱుమ్, "న శుద్ధ్యతి తథా జన్తు స్తీర్థవారిశతైరపి, లీలయైవ యథా భూప! వైష్ణవానాం హి వీక్షణైః" ఎన్ఱుమ్ ఇతిహాస పురాణజ్గళిల్ శొల్లప్పట్ట వచనజ్గళ్ ఇప్పాట్టిల్ శొన్న అర్థత్తుక్కు ప్రమాణమాగ అనుసంధేయజ్గళ్.

పెరియజీయర్ తిరువడిగళే శరణమ్

పెరియజీయర్ అరుళిచ్చెయ్ద జ్ఞానసారవ్యాఖ్యానమ్ సంపూర్ణమ్



నలభైయవ పాశురం :- అవ : పూర్వం పల్కిన గొప్పతనాలు (మహిమలు) ఉన్నా, వీరిమాట, చేష్ట లోకులతో పోసగనందున, దానిని చూచి వారు నిందిస్తే ఏమి చేయాలి? అని అంటే, "ఇది భగవానునిపట్ల అభినివేశాన్ని కలవారికికూడా పొసగుతుంది - అని తలచి, భగవంతుని భక్తుల మాట, చేష్ట, కటాక్షం మొదలైనవాని గొప్పతనాన్నిగూర్చి సాధారణంగా పల్కి, ఈ గ్రంథాన్ని పరిసమాప్తి చేస్తున్నారు.

వ్యాఖ్యానం :- (అల్లిమలర్ప్పావైక్కు అన్బరడిక్కు అన్బర్)- "కోలమలర్ ప్పావైక్కు అన్బా!" (తిరువాయ్-10-6-6) అని అంటూ నమ్మాఴ్వార్లు భగవంతుడు లక్ష్మీవల్లభుడై ఉండే విషయాన్నే ప్రస్తావించి పల్కినట్లుగా, తామర పూవును నివాసంగా కల్గిన లక్ష్మీదేవిపట్ల ప్రేమను కలవాడై ఉండే సర్వేశ్వరుని శ్రీచరణాలలో భక్తినే (ప్రేమనే) అసాధారణ లక్షణంగా కల్గిన అతని భక్తులు,

(శొల్లుమ్ అవిడు శురుదియామ్)- వేడుకగా పలికే మాటలు కూడా వేదార్థాలుగా ఉన్నందున, ఎవరిచేత రచింపబడనిదై, నిత్యమై, నిర్దుష్టమై, మిక్కిలి నమ్మదగినదై ఉండే వేదంవలె ప్రమాణంగా గ్రహించదగినవిగా ఉంటాయి.

(నల్లడియామ్ మనునూఱ్కు అవర్ శరిత్తై)- వారి జీవితం- పల్కినపుడు జీవించదగిన స్వభావాలను (రీతులను) తెలిపే స్మృతులలో ప్రాధాన్యాన్ని కల్గినదై, "ఈ సద్వర్తనాన్ని పురస్కరించుకొనే ఈ స్మృతివచనం పుట్టింది" - అని పలికేటట్లుగా, గొప్ప మూల గ్రంథంగా ఉంటుంది. "పడి" - అంటే ఒక వ్యాఖ్యానికి మూలమైన గ్రంథం. మనుస్మృతి వ్యాఖ్యానంగాను, వీరి వర్తనం దానికి మూలగ్రంథంగాను ఉంటుంది - అని భావం.

(పార్వై శెడియార్ వినై త్తొకైక్కు త్తీ) - వారి కటాక్షం, పొదవలె పెరిగి దట్టంగా ఉండే జీవుల పుణ్యపాపాలను దహించే అగ్నివలె, నశింపజేసేదై ఉంటుంది - అని అర్థం. దీని భావమేమంటే - వీరి కటాక్షం అనేది దానికి లక్ష్యభూతులైనవారి పుణ్యపాపాలను అన్నిటిని పోగొడుతుంది కనుక, వారి స్వరూపాన్ని ప్రకాశింపజేస్తుందని భావం. "వేదశాస్త్ర రథారూఢాః జ్ఞానఖడ్గధరాః ద్విజాః, క్రీడార్థమపి యద్బ్రూయుః స ధర్మః పరమో మతః" (వేదశాస్త్రాలనే రథంలో

అధిరోహించినవారై, జ్ఞానమనే ఖడ్గాన్ని చేతధరించినవారైన ద్విజులు విలాసంగా పలికే మాటకూడా గొప్ప ధర్మంగా చెప్పబడుతున్నది) అని, **"వాసుదేవం ప్రపన్నానాం యాన్యేవ చరితాని వై, తాన్యేవ ధర్మశాస్త్రాణీత్యేవం వేదవిదో విదుః"** (వాసుదేవుని శరణాగతి చేసినవారి చరిత్రలు ఏవి ఉన్నాయో, అవే ధర్మశాస్త్రాలని వేదార్థాన్ని తెలిసిన జ్ఞానులు అంటారు) అని, **"న శుద్ధ్యతి తథా జంతుః తీర్థవారిశతైరపి, లీలయైవ యథా భూప! వైష్ణవానాం హి వీక్షణైః"** (రాజా! భగవద్భక్తులు లీలగా ఒక మానవుని చూడడంవల్ల ఆ మానవుడు ఎంత పవిత్రతను పొందుతాడో వందలాది పుణ్యతీర్థాలలోని జలాలతో కూడా అతడు అంత పవిత్రతను పొందడు) అని ఇతిహాస పురాణాలలో చెప్పబడిన శ్లోకాలు ఈ పాశురంలో చెప్పబడిన అర్థానికి ప్రమాణంగా అనుసంధేయాలు.

శ్రీవరవరమునుల శ్రీచరణాలే శరణం.

జ్ఞానసారప్రబంధానికి శ్రీవరవరమునులు అనుగ్రహించిన ద్రావిడ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం సంపూర్ణం.

